# హైదరాబాద్
## అజ్ఞాత చరిత్ర పుటలు

హిందీమూలం : శ్రీ ఖండేరావు కులకర్ణి

తెలుగుసేత · శ్రీ నిఖిలేశ్వర్

జూన్, 1979

ప్రచురణ :

నవభారతి
3-4-852
హైదరాబాద్
500 027

ముద్రణ :

భారత ముద్రణాలయం
విజయవాడ
520 002

ముఖచిత్రం :

చంద్ర
హైదరాబాద్

ప్రతులకు :

సాహిత్యనికేతన్
ఏలూరురోడ్డు
విజయవాడ
520 002

ధర :
ఏడు రూపాయలు



# వెలుగు



అలుముకున్న చీకట్లను పారద్రోలటానికి ప్రజ ఉద్యమించిన చోట ఎందరో వీరులుదయిస్తారు. గగుర్పాటు కలిగించే సాహసిక ఘట్టాలెన్నో ఆ ఉద్యమచరిత్ర అడుగడుగునా కనిపిస్తాయి. అతి సామాన్య ప్రజానీకంనుంచికూడ ఆ ఉద్యమానికి స్ఫూర్తిని, దీప్తిని అందించే వ్యక్తులు కోకొల్లలుగా ఉద్భవిస్తారు.

వెలుగును తేవాలనే సంకల్పంతో—ఆ ప్రేరణతో—ఆ కారణంకోసం ప్రాణాలను తృణంగా భావించి, సర్వాన్ని పణంగాపెట్టి పోరాడే సాహస ప్రవృత్తి జనంలో పెల్లుబికి వస్తుంది. ఎన్నో "అత్యాచార పర్వా"ల నెదురించి సాగే ఆ "ప్రజాపోరాటం" చివరకు "జనవిజయం"గా మారుతుంది. ఆ విజయం వెనుక ఎన్నో త్యాగాల, బలిదానాల గాథలుంటాయి. సువర్ణాక్షరాలలోనో లేక రక్తాక్షరాలలోనో—అవన్నీ చరిత్ర పుటలకెక్కడం అనుభవం. కొన్ని అప్పుడప్పుడు అజ్ఞాత చరిత్రగా వెలుగుచూస్తాయి. కానీ ఎప్పటికీ చరిత్రకెక్కని ఘనులెందరో ఉంటూనే ఉంటారు. మరుగున పడిపోయే ఘట్టాలెన్నో ఉంటుంటాయి.

నిజాంపాలన అంతరించిపోయిన తర్వాత ఆనాటి ఉద్యమం గురించి ఎన్నో గ్రంథాలు వెలువరించబడ్డాయి. ఒక్కొక్కరు ఒక్కొక్కర

కంగా నాటి ఉద్యమానికి భాష్యం చెప్పారు. తమదైన వ్యాఖ్యానాలు చేశారు. తమ తమ వాదాలను నిరూపించుకోవడానికి అప్రధానమైన విషయాలకు ప్రాధాన్యతనిచ్చారు. ప్రాచుర్యం కల అంశాలను వదలి వేయడంకూడ చేశారు. వారి సిద్ధాంత రాద్ధాంతాల ఒత్తిడిలో ఎందరో ఉద్యమకారుల గాథలు చరిత్రకందకుండా పోయాయి. అలాంటి వారిలో కొందరు స్ఫూర్తి దాయకమైన గాథలు ఈ పుస్తకంలో ఉన్నాయి.

నిజాం నిరంకుశపాలన–దానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటం–దాని పరిణామాలు, ఆనాటి పోరాటగాథలు—ఇలా ఒక చరిత్రగా అజ్ఞాతపుటలు ఆ ఉద్యమాలయొక్క ఒక అవగాహనను మన ముందుంచుతాయి.

హిందువులకు వ్యతిరేకంగా నాడు నిజాం అతగాడి రజాకార్ మూకలు వ్యవహరించారనే విషయంలో రెండో అభిప్రాయానికి తావుండదు. నిజాం తన అధికారాన్ని నిలుపుకోవటానికి అన్నివిధాలైన భ్రష్టాచారాలకు పాల్పడినట్లు కన్పడుతుంది. ప్రజాస్వామ్య రక్షణకొరకే నియంతృత్వమంటూ—ఎమర్జెన్సీ విధించి అన్ని ప్రజాస్వామ్యహక్కులను కాలరాచివేయటం, పత్రికా స్వాతంత్ర్యం హరించడం, అభివృద్ధి పేరిట అమానుషకాండలెన్నో జరపడం నిన్న మనం చూశాం. పందొమ్మిది నెలల ఎమర్జెన్సీనే ఎంతో తల్లడిల్ల పరచిందే, ఎన్నోసంవత్సరాలుగా నిజాం నిరంకుశపాలనలో క్రుగ్గిన ఆనాటి జనం బాధలు; ఆ ఫాసిస్టు పాలనా రథచక్రాలక్రింద నలిగిపోయిన వారి ఆక్రందనలు ఎంత భయానకంగా ఉండెనో-తలచుకొంటే ఒళ్ళు జలదరిస్తుంది.

స్వాతంత్ర్యస్థితికి ముందునుంచే దేశంలో కొన్ని వర్గాలలో పెరుగుతూవచ్చిన విఘటన మనస్తత్వానికి ప్రతీకగా పాకిస్తాన్ ఏర్పడింది అలాంటి విపరీత ప్రవృత్తికల నిజాం “స్వతంత్ర హైదరాబాద్ రాజ్యం కోరాడు. దానికోసం ఎలాంటి దుష్కార్యానికైనా ఒడిగట్టాడు కాని చివరకు జనశక్తి ఎదుట తల ఒగ్గవలసి వచ్చింది. ఎన్నడూ ఎవరికీ సలాం చేయని నిజాం గత్యంతరంలేక తన సంస్థానాన్ని విలీనం చేయ



సర్దార్ పటేల్‌కు వంగి వందనం చేస్తున్న 'నిజాం'

డానికి అంగీకరించాడు సర్దార్ పటేలు హైదరాబాద్‌కు వచ్చినప్పుడు నిజాం విమానాశ్రయానికి వెళ్ళి పటేల్‌కు ఎదురేగి స్వాగతించాడు. అదొక అద్భుతదృశ్యం. నిజాం చేతులెత్తి పటేల్‌కు నమస్కరించాడు.

ఎంతో వ్యయప్రయాసలకోర్చి శ్రీ ఖండేరావు కులకర్ణి ఆవిమోచనోద్యమంలోని వెలుగుచూడని వివరాలను వెలికి తీసి "హైదరాబాద్ ముక్తిసంగ్రామం—కొన్ని అజ్ఞాతపుటలు" అనే హిందీపుస్తకం వ్రాశారు. '75 లో పూనా 'భారతీయ విచారసాధన" వారు దానిని ప్రచురించారు. ఆ పుస్తకానికి శ్రీ నిఖిలేశ్వర్ చేసిన సరళానువాదమే "హైదరాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు"

ఇందులో ఇరవైకిపైగా చారిత్రాత్మక గాథలున్నాయి. నిరంకుశుడైన నిజాం అతని రజాకారు శక్తులతో ప్రజలు ఒక్కొ రంగంలో... ఒక్కొ

సమయంలో....జరిపిన పోరాటం ఒక్కొక్క గాథగా ఇందు వర్ణించబడింది. తర తమ బేధాలు లేకుండా ప్రజలనేకులు ఈ పోరాటాల్లో పాల్గొన్నారు అనేకులు వీటికి నాయకత్వం వహించారు. వీరినలా నాయకులను చేసింది-ఎక్కడినుంచో దిగుమతి అయిన సిద్ధాంత చైతన్యంకాదు. అధర్మాన్ని, విధర్మీయ దౌష్ట్యాన్ని సహించలేని ఆత్మ చైతన్య, అ జ్వాల. తమలో ఉన్నవారు తాము జ్వలించి, లోకానికి వెలుగులను చూపించారు. రాజకీయపు ప్రయోజనాలనాశించినవారు ఈ పోరాటానికంతా కర్తృత్వం తమదేనన్నారు. తాము నమ్మేవాటికేదో ఇది పాక్షిక విజయమన్నారు. స్వయంభావుఅయిన చైతన్యానికంతా ఏవేవో రంగులుపులిమారు-

ఈ పుస్తకంలో మనకిటువంటి కుప్రయత్నం కనిపించదు. ఆర్య సమాజ్ నాయకత్వం వివిధ రంగాలలో జరిగిన పోరాటాలే ప్రధానంగా వీటిలో కథా వస్తువుగా స్వీకరించబడినా, వాటి కథనంలో వ్యక్తులకు, వ్యక్తిత్వాలకు, ఆత్మ చైతన్యపు వెలుగులకు, త్యాగపు విధానికే అధిక ప్రాధాన్యతనిచ్చారు-శ్రీ కులకర్ణి.

సువ్యవస్థకై సమాజాలు జరిపేకృషి చిరంతనమైనట్టిది నిరంతరం కొనసాగేటటువంటిది. వివిధ దృక్పథాలవారు ఈ కృషిని వివిధ మార్గాలలో కొనసాగిస్తుంటారు. ఉన్నవ్యవస్థ సమూలంగా నాశనమైతే తప్ప నూతనవ్యవస్థ నెలకొనదనే విశ్వాసం కొందరిది కాగా, సమూల నాశనంద్వారా కాక, సమగ్రమైన మార్పులద్వారా సువ్యవస్థను సాధించగలమనేది మరి కొందరి ధైర్యం.

మనిషికి శత్రువు మనిషే. ఇందులో సందేహంలేదు. మనిషికి మిత్రులెవరు ? సిద్ధాంతాలు తాముగావచ్చి ఎవరినీ ఉద్ధరించలేవుగదా? సమగ్రము, సర్వోత్కృష్టమునైన సిద్ధాంతాలను సహృదయంతో, స్ఫూర్తితో మనిషి పాటిస్తేనే సర్వతోభద్రమైన స్థితి సమాజాలలో నెలకొంటుంది. అటువంటి మనిషిని తయారుచెయ్యటం అన్ని కాలాలకు అవసరమైన విషయమంటారు- కొందరు.

వ్యక్తులలో మంచివారు, చెడ్డవారు ఉండరని .... మంచిచెడులు వర్గపు స్వభావాలని, చెడును పోషించే వర్గాలను సమూల నిర్మూలనం చేయటంద్వారా మంచిని పెంచవచ్చుననేదే మరికొందరి మార్గం.

మార్గాలు వేరైనా అందరు కోరేదిఒక్కటే-సర్వేజనాస్సుఖినోభవంతు.

అట్టి పరమ విశిష్టమైన ఆశయంతో తమ ప్రాణాలను, తమవారి సౌఖ్యాలను సరకుచేయక లెక్కకు మిక్కిలిగా చైతన్యమూర్తులు పాల్గొన్న ప్రజాపోరాటపు గాధలే ఈ పుస్తకంలోని అజ్ఞాతపు పుటలు. వెలుగులను విరజిమ్మే చరిత్ర జ్యోతులు.

విశిష్టమైన సాహిత్యాన్ని సహృదయ పాఠకలోకానికి అందించాలనే సదాశయం-నవభారతిది. మేము వెలువరిస్తున్న మొట్టమొదటి అనువాదగ్రంథమిది. అజ్ఞాతంగా ఉండిపోయిన ఆత్మ చైతన్యపు జ్యోతుల వెలుగునిలా ప్రసరింపజేయటంలో మా ఎందరో...ఎన్నో విధాలుగా సహకరించారు.

అందరికీ మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

# ప్రస్తావన


శ్రీ విజయకుమార్ సిన్హా

స్వాతంత్ర్య సూర్యోదయం జరిగి 30సం॥లు గడచిపోయినా, మన స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన యదార్థాలు చరిత్ర ప్రామాణికంగా ఈ నాటికి ప్రజలకు అందుబాటులో లేదు. ఆనాటి పోరాటాల్లో పాల్గొన్న కొందరి నాయకుల—అమరవీరుల జీవిత చరిత్రలు వెలువడ్డాయి. కాని ఆనాటి బలమైన బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఎదిరించి పోరాడి, ఘోరమైన యాతనలు అనుభవించిన అనేక మంది అమరవీరుల చరిత్ర, వారి సాహసానికి—శౌర్యానికి సంబంధించినగాథలు, సంపూర్ణంగా వెలువడలేదు—ఇది శోచనీయమైన అంశం

ఆనాటి పోరాటగాథలు—యదార్థాలు సాకల్యంగా గ్రంథరూపాల్లో వెలువడి ఒక జాతి సంపదగా సుస్థిరం కావలసి వుంది. దేశ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోవటానికి, పటిష్టం చేసుకోవటానికి ఆ గాథలు-

చరిత్రలు మన యువకులను నిరంతరం ఉత్తేజితులను చేస్తాయి. మని షిని మరొక మనిషి దోచుకోవటాన్ని అంతరింపజేసి, ప్రతిఇంటా వెలుగునింపే నవభారత నిర్మాణంలో నిరంతరం జాగురూకులుగా పాల్గొనే చైతన్యాన్ని సంతరింపచేస్తాయి.

అందువల్లనే శ్రీ ఖండేరావుగారి ఈ గ్రంథాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. ఇది చారిత్రక అవసరాన్ని పూరిస్తున్నది ఈ గ్రంథంలో—ఆనాడు బ్రిటిషు సామ్రాజ్యానికి నమ్మినబంటుగా వుండి ప్రజలను దోచిన నిజాంకు విరుద్ధంగా సామాన్యప్రజలు నడిపిన సాహసవంతమైన సాయుధ పోరాటాల వర్ణనవుంది.

ప్రజాపోరాటాలను అణచాలని నిజాం, అతని రజాకార్ అనుచరులు క్రూరమైన దమనకాండను అమలుచేశారు. చివరికి ప్రజలు సామూహికంగా సాహసంతో నిలిచి—పోరాడి నిజాంలాంటి సామంత రాజుల అత్యాచారాల పాలనను అంతం చేశారు.

శ్రీ ఖండేరావుగారు యువకుడిగా వున్నప్పుడే ఆదర్శవాదిగా జీవితాన్ని ప్రారంభించాడు. ఆనాడు మాతృభూమి స్వేచ్ఛకోసం ప్రాణాలకు తెగించిన అనేకమంది విప్లవకారులతో వారికి పరిచయం ఉండేది. అజ్ఞాతంగా స్త్రీ పురుషులు దేశభక్తితో కూడిన సైన్యంగా ఉద్యమించడం ఆయన సన్నిహితంగా చూసాడు. ఫలితంగా ఆ చరిత్రను—ఆనాటి సంఘటనలను ప్రజాస్వామిక దృక్పథంలో పరిశీలించే దృక్పథం వారికి అలవడింది.—చరిత్ర నిర్మాతలు కొద్దిమంది నాయకులు మాత్రమేనని కొందరు విద్వాంసులు భావిస్తున్నట్లుకాక చరిత్రను నిర్మించటంలో ప్రముఖపాత్ర ప్రజలపై ఉంటుందనే యథార్థాన్ని ఖండేరావుగారు విస్మరించలేదు.

ప్రజాపోరాటాలను రచయిత ఎంతో సజీవంగా చిత్రించారు గ్రామాల్లో జీవించి అతి సామాన్యులైన స్త్రీ పురుషులు దృఢచిత్తులై సైనికులుగా పోరాడిన దృశ్యాలు, వారిఆశలు—ఆకాంక్షలు, ఔదార్యం త్యాగం, ఈ గ్రంథంలో సవివరంగా మన కళ్ళముందు నిలుస్తాయి

రచయిత అనేకమాసాలు తెలంగాణాలోని మారుమూల గ్రామాల్లో పర్యటించి విషయాన్ని సేకరించి ఈ గ్రంథాన్ని రచించారు. ఆయా సంఘటనల వర్ణన మనల్ని ఉత్తేజితుల్ని చేయటమేగాక ప్రేరణాప్రదమైన యథార్థాలుగా మన హృదయాల్ని హత్తుకుంటాయి. ఎన్ని అమూల్యమైన త్యాగాల ఫలితమో ఈ దేశ స్వాతంత్ర్యం—ఎన్ని కష్ట నష్టాలకు వోర్చి దీన్ని సాధించుకొన్నామో అనే అంశాన్ని ఈనాటి నూతన తరం గ్రహించాలి ఆ దృష్ట్యా ఈ గ్రంథం ఎంతో ముఖ్యమైనది—ఆసక్తికరమెంది

**జె 31, ఎర్రమంజిల్ కాలని, హైదరాబాద్**

**9-3-1975** **విజయకుమార్ సిన్హా**



# రచయిత గురించి....



ఖండేరావ్ కులకర్ణి

**1930** నుండి శ్రీ ఖండేరావు కులకర్ణిగారికి హైదరాబాద్ రాష్ట్రం లోని సాంఘిక జీవితంతో సన్నిహిత సంబంధంవుంది. ఈనాటికీ వారు హైదరాబాద్ నగరంలోని సాంఘిక సాంస్కృతిక, విద్యా వ్యవహారాలలో చురుకుగా పనిచేస్తూనే వున్నారు. దాదాపు ముప్పదిసంవత్సరాలు కేశవ స్మారక విద్యాలయంలో ఆచార్యులుగా పదవీ బాధ్యతలు నిర్వహించి ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఆనాటి నిజాంరాజ్యంలో పోలీసులు-రజాకార్లు జరిపిన దమనకాండ, దానికి వ్యతిరేకంగా ప్రజ్వరిల్లిన రాజకీయ ఉద్యమాలు, ఆ తర్వాత వచ్చిన రాజకీయ పరిణామాలను ఆయన ప్రత్యక్షంగా పరిశీలిస్తూ వచ్చారు. వారికి చరిత్ర అధ్యయనం అభిమానమైన విషయం. అందువల్ల ప్రతి పరిణామాన్ని తటస్థంగా వుండి లోతుల్లోకి వెళ్ళి పరిశీలించే స్తోమత వారికివుంది అనేక వ్యయప్రయాసాలకు వెనకాడకుండా ఎంతో ఉత్సుకతతో ఈ గ్రంథంలోని ప్రతిసంఘటనకూ సంబంధించిన వ్యక్తులను, స్థలాలను ఆయన స్వయంగా కలుసుకొని అక్కడికివెళ్ళి యదార్థాలను సేకరించారు.



# అనువాదకుని అనుభూతి

బ్రిటిష్ సామ్రాజ్యానికి నమ్మకమైన బంటుగా—తొత్తుగా, చివరికి అవశేషంగా మిగిలి—పోయి, తెలంగాణా రైతాంగాన్ని పీల్చి పిప్పిచేసి ప్రపంచ ధనికుల సరసన పేరు నిలబెట్టుకున్న నిజాం ఉస్మాన్అలీ ఖాన్ ఆనాడు ఇండియన్ యూనియన్‌లో విలీనం కాకుండా మొరాయించాడు. అమానుషమైన కులీన(ఫ్యూడల్) వ్యవస్థను ఎదిరించిన తెలంగాణా ప్రజలను రాచి రంపాన పెట్టాడు. భూమిపై పెత్తనం వహించి బలిసిన దొరల, దేశ్‌ముఖ్‌ల పెద్దన్నగా సామాన్యప్రజానీకాన్ని కలకాలం అణచిపెట్టవచ్చునని నిజాం భావించాడు కాని చరిత్ర నిర్మాతలైన సామాన్యప్రజలు ఆనాటి దోపిడీ హింసాకాండను విప్లవ ప్రతి హింసతో ప్రతిఘటించి, ప్రపంచ విప్లవ విముక్తి పోరాటాల చరిత్రలో 'వీరతెలంగాణా విప్లవ పోరాటం"గా తీర్చిదిద్దారు. శ్రామికవర్గ విముక్తికోసం పీడిత ప్రజలు చేస్తున్న మహాప్రస్థానంలో తొలి అధ్యాయాన్ని రక్తాక్షరాలతో లిఖించారు.

ఆనాటి వీరతెలంగాణా ప్రజాపోరాటం కొనసాగుతున్న కాలంలో నల్లగొండజిల్లాలోని భోనగిరి తాలూకాలోని కొన్నిగ్రామాల్లో రజాకార్ల దురంతాలను నాచిన్ననాడు స్వయంగా చూచాను. గ్రామాలకు గ్రామాలు పొలాల్లోకి తరలి వెళ్ళి దుండగులను ఎదిరించడం ఈనాటికీ జ్ఞాపకం. అందువల్లనే శ్రీ ఖండేరావు కులకర్ణిగారు ఈపుస్తకం హిందీవ్రాత ప్రతితొలిదశలో నాకు చూపించినపుడు వెంటనే తెలుగులోకి అనువదించాలనిపించింది. ఒకవిధంగా నాచిన్ననాటి జ్ఞాపకాలను ఈ "అజ్ఞాత పుటలు" తట్టిలేపాయి. అతర్వాత 1971 లోనే "ఆంధ్రభూమి"లో మూడు వ్యాసాల అనువాదాలు "కె, వై. ఆర్" పేర ప్రచురితమైనాయి. 1975లో మిగతావ్యాసాలను అనువదించటం. అప్పుడే హిందీలో ఇది

"హైదరాబాద్‌కా ముక్తిసంగ్రామ్" అనే శీర్షికతో గ్రంథరూపంగా పూనానుంచి వెలువడటం మిగిలిన తొమ్మిది వ్యాసాలు కూడా "ఆంధ్ర భూమి' లో (క్రై. వైర్. పేరనే) ప్రచురితం కావడం జరిగింది.

ఈకాలంలోనే (1971-75 మధ్య) కామ్రేడ్స్ పుచ్చలపల్లి సుందరయ్య, దేవులపల్లి వెంకటేశ్వరరావు తదితర కమ్యూనిస్టు నాయకుల గ్రంథాలు "తెలంగాణా విప్లవపోరాటం"పై వెలువడ్డాయి అంతకుపూర్వమే కామ్రేడు చంద్ర పుల్లారెడ్డి ఈ అంశంపై రచించిన చిన్నపుస్తకం ఒకటి వుంది. ఇవన్నీ ఆనాటి చారిత్రక యధార్థాలను వివిధ దృక్కోణాలతో పరిశీలించినవి. ఖండేరావుగారు ఆనాటి నిజాం రాజ్యంలోని కర్నాటక, మరఠ్వాడా ప్రాంతాల్లో ప్రజ్వరిల్లినపోరాటాలను ఇందులో చిత్రించారు. అలాగే నిజాం ఫ్యూడల్‌పాలనను అన్నివైపులనుంచి కూలదోయడానికి స్టేట్‌కాంగ్రెస్, ఆర్యసమాజ్, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీ తమతమ పద్ధతుల్లో పనిచేశాయి ఒకదశలో ఐక్య సంఘటనగా పోరాటాన్ని నిర్వహించాయి. కమ్యూనిస్టుపార్టీ విప్లవ నాయకత్వం గురించి కులకర్ణిగారు అక్కడక్కడ ప్రస్తావించారు. అయితే ఆర్యసమాజ్ నిర్వహించినపాత్రను ఎక్కువగా తీసుకున్నారు. అది ఆయన పరిధిలోని అనుభవానికి సంబంధించింది. భూస్వామ్య ఫ్యూడల్ విధానాన్ని, అమానుష అత్యాచారాలను హిందువులు-ముస్లింలు కలిసి ఎదుర్కొన్న సంఘటనలు వున్నాయి. ఆనాడు అత్యధికంగా హింసాకాండకు గురైనవాళ్ళు హిందువులు, సహజంగానే ఆ అంశం పట్ల ఉద్రేకంరాకతప్పదు.

అయినా ఖండేరావుగారు ప్రధానంగా చరిత్రకారుడికి వుండవలసిన వస్తుపరమైన దృష్టి (ఆబ్జెక్టివిటి) తో వీటిని రచించే ప్రయత్నంచేశారు ఇక జాతీయ పోరాటాలను శాస్త్రీయమైన చారిత్రక దృష్టితో పరిశీలించడం అందరికి సాధ్యం కాదు. ఇక్కడ ఖండేరావుగారు కేవలం 'వాస్తవాలను' ఏకరువు పెట్టే పద్ధతిలో కాకుండా, ఆనాటి ప్రజా పోరాటాల్లో అతిసామాన్యులైన రైతులు (గ్రామీణులు) కొన్నిసార్లు తమంతతామే

అన్యాయాన్ని ప్రతిఘటించే మాహావీరులుగా రూపొందిన అంశంపట్ల ముగ్ధులై పరవశించి, ఆ భూమిపుత్రులను శ్లాఘించాము. వర్ణించాము. ఈ పుస్తకంలోని కొన్ని ఘట్టాలు ముఖ్యంగా ఉమ్రి బ్యాంక్ దోపిడి గెరిల్లా రైతాంగ దళం ఈ విషయాన్ని ధృవీకరిస్తాయి. ఒక విధంగా ఈనాటి తరానికి ఇవన్నీ అజ్ఞాత చరిత్ర పుటలే!

ఆనాటి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన భూస్వామ్య ఫ్యూడల వ్యవస్థను కూలదోసే విముక్తిపోరాటం కొంతమేర విజయవంత మైనది. కాని ఈనాటికీ అర్ధ భూస్వామ్య అర్ధ వలస విధానం పెట్టుబడిదారి ముసుగువేసుకొని ప్రజాస్వామ్యాన్ని నటిస్తున్నది. ఆనాడే నిజాం, ప్రజల చేతుల్లో గోరికట్టించుకూన్నాడు. సంక్షోభంలో వున్న ఈ వ్యవస్థ ఈ ప్రజల చేతుల్లో అంతమై ఏనాటికైనా విముక్తి పొందక తప్పదు. ఇది చరిత్ర నేర్పుతున్న గుణపాఠం.

5-8-1978
46, విద్యానగర్ కాలని.
హైదరాబాద్—500044

—నిఖిలేశ్వర్

# నివేదన

**1949** ఫిబ్రవరి నాటిమాట. పోలీసు చర్య జరిగిన తర్వాత సర్దార్ వల్లభాయ్ పటేల్ హైద్రాబాద్ వచ్చారు. నిజాం వచ్చి కలుసుకున్నప్పుడు, పటేల్ గతంలో జరిగిపోయిన వాటిని మరచిపోయి ఇక ఇప్పటినుంచి అందరము అందరి సంక్షేమం కోసం, కలసి కృషి చేయడం మంచిదని సలహా ఇచ్చారు. నిజాం తన రాజ్యంలో తాను కూడా అందరి సంక్షేమం కోసం పాటుపడిన వాణ్ణని అన్నాడు. పటేల్ మొదట ఆమాట విని ఏమీ అనలేదు. కాని నిజాం మాటిమాటికి తన పాలనలో హిందూ–ముస్లింలను రెండుకళ్ళుగా తాను ప్రేమించానని ప్రగల్భాలు పలుకుతుండగా పటేల్ గత్యంతరంలేక తన కార్యదర్శి మీనన్‌ను నిజాం అసలు వృక్పధాన్ని బహిర్గతం చేసే అతని పంక్తులను వినిపించమని ఆదేశించారు.

"సలాతనే సల్ఫ సబ్ హొగయె నజరె అజల్ ఉస్మాన్!
ముసల్మానోంకా తేరీ సల్తనత్ సే హై నిశాఁ బాకీ"

సారాంశం :– కరాళ కాల గర్భంలో పూర్వీకుల సామ్రాజ్యాలన్నీ అంతరించి పోయాయ్. కాని–ఉస్మాన్! నీరాజ్యం వల్లనే ఈనాడు ముసల్మానుల చిహ్నాలు ఇంకా మిగిలివున్నాయి."

బుంద్ నాకూస్ హువా సున్‌కె నారాఏ తక్‌బీర్
జల్ జలా ఆహిగయా రిశ్తఏ జున్నార్‌పర్".

సారాంశం :–"అల్లాహెూ అక్బర్ నినాదంవల్ల శంఖనాదాలు స్తంభించిపోయాయి —శిఖా, సూత్ర దారులపై ప్రళయం వచ్చినట్టు ఉంది.

తన అసలు మనస్తత్వం ఆ పంక్తుల్లో బహిర్గతం కాగానే నిజాం నోటిమాటరాక నిలుచుండిపోయాడు.

నిజాం నిరంకుశ పాలనకు ఒక ఉదాహరణ- ఆరోజుల్లో వికారాబాద్‌లో వున్న అనంతగిరి కొండలపై శానిటోరియమ్‌కు ప్రారంభోత్సవం జరిగింది. నిజాం రాజ్యానికి యువరాజైన ప్రిన్స్ ఆఫ్ బెరార్ ప్రారంభోత్సవం జరుపుతున్నప్పుడు ఆరోగ్యశాఖకు చెందిన అధికారులు కాలుపైకాలు వేసుకొని కూచునివున్నారు. ఆ కార్యక్రమం ఫొటో నిజాం చూశాడు. వలిఅహ్మద్ బహదూర్ (యువరాజు) సమక్షంలో కాలుపై కాలువేసుకొని కూర్చోడం ఎంత అధికార ధిక్కారం! వెంటనే ఆ అధికారులను ఉద్యోగాలనుంచి తొలిగించమని నిజాం ఆజ్ఞాపించాడు.

ప్రపంచంలో ఆనాడు వేళ్ళపై లెక్కపెట్టదగ్గ కొద్దిమంది ధనాఢ్యులలో నిజాం ఒకడు. సంపన్నుడైన హెన్రీ ఫోర్డ్ తర్వాతనిజాంను చెప్పుకునేవారు. అలాంటి ధనవంతుడైన నిజాం 1948లో తాను రజాకార్ల చేతుల్లో బందీనైవున్నానని, సహాయపడవలసిందని భారత ప్రభుత్వానికి మొరపెట్టుకున్నాడు. కాని అదే నిజాం 12-6-1946 నాడు ఒక ఫర్మాన్ ద్వారా తన ఉద్దేశాన్ని ఇలా ప్రకటించుకున్నాడు. "సర్వస్వతంత్రుడైన రాజుగా సార్వభౌమాధికారులతో వుండే హక్కు నాకు వుంది. అందువల్ల ఏరూపంలోనైనా నారాజ్యాన్ని భారత ప్రభుత్వంతో విలీనం చేసే సమస్యేలేదు." అసలు ఆనాటికి రజాకార్లు రంగం మీదికి రాలేదు. భారతదేశం పూర్ణ స్వాతంత్ర్యం పొందలేదు. కాని సంపూర్ణ స్వాతంత్ర్యం దేశానికి తప్పదనే వాస్తవాన్ని నిజాం గ్రహించి ఆపై ఫర్మానా జారీచేశాడు.

నిజాం వాస్తవంగా మత దురాహంకారంతో, నిరంకుశంగా సంపన్నుడిగా తాను కలకాలం రాజుగా నిలిచిపోవాలని కోరుకున్నవాడే. ఫలితంగా తన కోరికల్ని తీర్చుకొనే నిమిత్తం నిజాం నీతి-అవినీతి అనే దృష్టి లేకుండా ప్రవర్తించాడు, తన రాజ్యంలో అత్యధిక సంఖ్యాకులైన హిందూ ప్రజలు నిజాం ఆకాంక్షలకు అడ్డుగోడలుగా వున్నందువల్ల ఘోర హింసాకాండకు గురైపోయారు. తత్ఫలితంగా 1947-48 మధ్య హైదరాబాద్ సంస్థానంలో హాహాకారాలు వ్యాపించాయి.

ఆనాటి హైద్రాబాద్ సంస్థానంలో ప్రజలపై జరిగిన హత్యాచారాలను, 1971లో తూర్పుపాకిస్తాన్ (బాంగ్లాదేశ్) లో జరిగిన అమానుష కాండతో పోల్చవచ్చును. బాంగ్లాదేశ్‌లో జరిగిన ఘోర భీభత్స కాండ ప్రపంచాన్ని వణికించింది. ఒక విధంగా ఆ భీభత్సం ఆనాటి హైద్రాబాద్‌లో జరిగిన అమానుష కృత్యాలకు పునరావృతం మాత్రమే! అయితే బంగ్లాదేశ్ యదార్థాలు ప్రపంచానికి సంపూర్ణంగా తెలుసు. కాని హైద్రాబాద్‌లోని ఆనాటి వాస్తవాలు సాకల్యంగా వెలుగులోకి రాలేదు. దానికి కొన్ని ముఖ్యకారణాలు వున్నాయి.

ఆ కారణాల లోతుల్లోకి వెళ్లేముందు ఒక అంశాన్ని స్పష్టం చేయవలసి వుంది. అత్యాచారాలకు విరుద్ధంగా ధైర్యంగా లేచి నిలుచోని జాతి–దేశం మృతప్రాయంగానే వుండిపోతుంది. కాని ఈ సంస్థానంలోని ఆనాటి యువత అరిచేతులో ప్రాణాలు పెట్టుకొని ఆ అత్యాచారాలను సాహసంతో ఎదిరించింది. అన్యాయాన్ని–ఘోర హింసాకాండను ధైర్యంగా తిప్పికొడుతూ పోరాడింది. యువకులు తమరక్తంతో ఆనాటి చరిత్రను లిఖించారు. జాతికి వాళ్ళ బలి దానాలు గౌరవ గాథలుగా నిలిచిపోతాయి. రాబోయే తరాలకు ఆ అమరవీరుల చరిత్రలు ప్రేరణాదాయకాలు.

ఇక చరిత్ర మార్గంలో అడ్డంకిగా వున్న ఆ కారణాల్లోకి వెడదాం. గతయాభై–అరవై సంవత్సరాలలో అహింసాత్మక ఉద్యమాలకే ప్రాముఖ్యత పెరిగింది. కాని అక్కడక్కడ చెలరేగిన సాయుధ పోరాటాలను పట్టించుకోలేదు. ఫలితంగా స్వాతంత్ర్య పోరాట చరిత్రలో ఆ వీరోచిత సంఘర్షణలకు ఇవ్వవలసిన స్థానం లభించలేదు. మరో కారణం నిజాం రాజ్యంలో అధిక జనాభా హిందువులు కావడం వల్ల నిజాం అత్యాచారాలను యథాతథంగా వెల్లడిస్తే ఎక్కడ మత దురహంకారాన్ని అంటగడతారోనని నాయకులు వెనుకాడారు. ఆనాడు ఢిల్లీలో నిజాం అమానుషకృత్యాలపై మంత్రివర్గంలో తీవ్రంగా చర్చలు జరిగేవి. ఆ వాస్తవాలపై భేదాభిప్రాయాలు పొడసూపేవి. చివరికి రజాకార్ల అత్యాచారాల పట్ల సర్దార్ పటేల్ ఆవేదన చెంది, మంత్రివర్గ చర్చల్లో తీవ్ర విభేదాలు రాగానే ఆయన నిరసనగా సమావేశంనుంచి వాకౌట్ చేసి తన పదవికి రాజీనామా చేశారు. అప్పుడు ఆనాటి గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారిగారు సర్దార్‌కు నచ్చ చెప్పి రాజీనామాను ఉపసంహరించుకొనేట్టు చేసారు.

ఆ రోజుల్లోనే నిజాం హయాంలో క్రైస్తవస్త్రీలపై రజాకార్లు దౌర్జన్యాలు జరుపుతున్నారని కెనడా దౌత్యాధికారి ఫిర్యాదు చేయగానె స్వయంగా నెహ్రూ వెంటనే నిజాంకు వ్యతిరేకంగా బల ప్రయోగం జరపక తప్పదని అంగీకరించారు. అయితే హిందూ మహిళలపై జరిగిన దౌర్జన్యాలు తదితర అంశాల గురించి ఆందోళన జరిగితే అది మత దురహంకారం అని విమర్శించే వైఖరి మనల్ని విడనాడాలి. ఆ వైఖరి మారనంత వరకు హిందూ-ముస్లింల మధ్య వున్న దూరం కొనసాగుతూనే వుంటుంది కారణం జాతీయ జీవితంలో హిందువులు అనేక సార్లు నష్టపోయారు. అయినా మత దురహంకారమనే రంగు పూయడం జరిగింది. ఇక ముస్లిం సోదరులు జాతీయ జీవిత ప్రవాహం నుంచి తమను విడిగా చూసుకునే మనస్తత్వాన్ని పెంచుకోడం జరిగింది. ఇవి రెండు గర్హనీయాలే.

మరో కారణం-ప్రముఖులైన మరికొంతమంది ఆనాటి చారిత్రక అంశాలను తమ వ్యక్తిగతమైన ఖ్యాతికోసం వాస్తవాలను వక్రీకరించారు.-ఇలాంటి వివిధ కారణాల వల్ల ఆనాటి హైద్రాబాద్ విముక్త పోరాటంలోని కొన్ని ప్రముఖ ఘట్టాలు అజ్ఞాతంగానే వుండిపోయాయి. మరీ ముఖ్యంగా ఆనాడు గ్రామాల్లో రజాకార్ల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా చెలరేగిన సాయుధపోరాటం, ఆ పోరాటంలో వీరోచితంగా నిలిచి సర్వస్వం అర్పించిన సామాన్య ప్రజల అసామాన్య సాహసాలు నన్ను ముగ్ధుణ్ణి చేసాయి. ఆ సంఘటనల వీరోచిత కృత్యాల నిజానిజాలను పరిశీలించి యదార్థాలను తెలుసుకొనే క్రమంలో ఆ గ్రామీణ రైతాంగం ప్రదర్శించిన సమయస్ఫూర్తి, త్యాగం, నైతికత, దేశభక్తి సాహసం నామనస్సుపై చెరగని ముద్రనువేసాయి. దాని ఫలితమే ఈ "అజ్ఞాత చరిత్ర పుటలు" అనే గ్రంథరచన.

ఆనాటి సంఘటనల వాస్తవాలను (ప్రామాణికతను) యథాతథంగా చిత్రించే ప్రయత్నంచేసారు. ఆయా ప్రాంతాలకు వెళ్ళి ఆ గ్రామాలను దర్శించి-ఆనాటి పోరాటాల్లో పాల్గొని ఈనాటికి సజీవంగా వున్న ఆ వ్యక్తులతో మాట్లాడి (కొందరు వ్యక్తులు మానవ సహజమైన బలహీనతలవల్ల తమ పాత్రను ఎక్కువగా చిత్రించుకుంటారనే అంశాన్ని మరచిపోకుండా) యదార్థాన్ని అన్ని కోణాలనుంచి పరిశీలించే ప్రయత్నంచేసాను

ఇక్కడ మరో ముఖ్యమైన అంశాన్నికూడా నేను స్పష్టంచేయదల చుకున్నాను. నాటి ఆ పోరాటాల్లో గణనీయమైన పాత్రవహించిన కొందరువ్యక్తులు స్వాతంత్ర్యం తర్వాత మారిపోయారు. వారి వ్యక్తిగత జీవితం ఆతర్వాత అపఖ్యాతిపాలైపోయింది. అలాంటి వ్యక్తులనే వీరులుగా చిత్రించి గౌరవించడం సమంజసమేనా? అని మిత్రులు నన్ను ప్రశ్నించారు. అప్పుడు నేను ఇచ్చిన సమాధానం ఇది— ఆరోజుల్లో ఆ వ్యక్తులు సాహసంతో ప్రజలపక్షాన నిలిచి, ప్రాణాలకు తెగించి అన్యాయాన్ని ఎదుర్కొన్నారు. ఆ క్రమంలో చంపడం, లూటీలు జరపడం, హింసకు ప్రతిహింస మార్గమనితలచి అలానే ప్రవర్తించి అదే అలవాటుగా మారిపోయిన వ్యక్తులు ఉన్నారు. అయితే ఆచారిత్రకదశలో అవ్యక్తులు చూపిన చొరవ, సాహసం, తెగువ, త్యాగం విలువ ఏమీ లేదా? అవ్యక్తుల బంధువుల్లోనే కొంతమంది ఆరోజుల్లో నిజాంను బహిరంగంగా సమర్ధించి, రజాకార్లవెంటవుండి దౌర్జన్యాలను పోషించారు. మరి ఆనాడే ఆవ్యక్తులే తలచుకుంటే ఆబంధువులతో పాటుగా తాము కూడా నిజాంకింద భోగభాగ్యాలు పొందేవారే! కానిఆనాడే అన్యాయాన్ని దౌర్జన్యాలని ఎదిరించి దేశంకోసం సర్వస్వం అర్పించేనిమిత్తం దూసుక వచ్చినవారి ఆనాటి పాత్రతోనే ఈ రచనకు సంబంధం. ఇక అనాటి నుంచి ఈనాటిదాకా దృఢదీక్షలోవున్న నిజాయితీపరులైన మరికొంత మంది ఇంకా సజీవంగానేవున్నారు.

ఈనాటికీ—ఆనాటి పీడితులైన అసహాయులైన సామాన్యుల ఆర్తనాదాలు, వీరుల నినాదాలు, అమరుల వీరోచితమైన సందేశాలు నాచెవుల్లో మార్మోగుతూనేవున్నాయి.

అమరవీరుల సమాధుపై యేటా జరుగుతాయి ఉత్సవాలు దేశంకోసం మరణించినవారిజ్ఞాపకాల చెరగని చిహ్నాలు.

కృతజ్ఞతలు :—

ఈ గ్రంథాన్ని రచించడంలో నాకు తోడ్పడిన మిత్రులకు—సానుభూతిపరులకు పేరు పేరునా కృతజ్ఞతలు చెప్పకోడం నాకర్తవ్యం

వ్రాతప్రతులను చదివి అవసరమైన సూచనలు చేసినమిత్రులు ఆయాప్రాంతాలకు నావెంట రెండేసిమార్లువచ్చిన శ్రీ కృష్ణదత్ (హైదరాబాద్‌లోని హిందీ మహావిద్యాలయ మాజీ ప్రిన్సిపాల్) గారికి—

కాల్‌ఖేడ్ గోర్టా, హెూన్నాళి తదితర గ్రామాలకు నావెంటవచ్చి సహాయపడిన శ్రీ మనోహర్‌రావ్‌కులకర్ణి (కేశవస్మారక బాలికావిద్యాలయ మాజీ ప్రధానోపాధ్యాయులు)గారికి —

నావెంట ఏప్రిల్–మే మాసపు ఎండల్లో వేడికి తట్టుకొని 15 మైళ్ళదాకా నడిచివచ్చి, ఫోటోలుతీసి సహాయపడిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ నరేంద్రరాయ్**గారి**కి —

హిందీలో ఈ రచన పుస్తకరూపం పొందకపూర్వమే తెలుగులోకి అనువదించి 1971లో కొన్నింటిని, అతర్వాత 1975లో మిగతావాటిని "ఆంధ్రభూమి" దినపత్రికలో ప్రచురింపచేసిన ప్రఖ్యాత రచయిత నిఖిలేశ్వర్ (కె. యాదవరెడ్డి)గారికి—

**25** సం।ల నాటి పాతచిత్రాలను వెదికి ఫొటోలు తీసిఇచ్చిన శ్రీ సత్యన్నారాయణ (వైదిక చిత్రశాల) గారికి —

ఆయా సంఘటనలకు సంబంధించిన వాస్తవాలను వ్రాతపూర్వకంగా–మౌఖికంగా తెలియజేసిన వ్యక్తులందరికి —

సర్దార్ భగవత్‌సింగ్ సహచరులు, ప్రఖ్యాత విప్లవకారులు శ్రీ విజయకుమార్‌సిన్హా ఈ గ్రంథానికి "ప్రస్తావన" రచించి నాదృష్టిలో ఈగ్రంథం ప్రాముఖ్యతను మరింత పెంచినందుకు—

హిందీలో ప్రచురించిన శ్రీ విశ్వనాథ్‌నరవణే (సురుచిప్రకాశన్–భారతీయ విచార్‌సాధనా, పూనా) గారికి—

తెలుగులో పుస్తకరూపంలో ప్రచురిస్తున్న "నవభారతి" సంస్థకు నా హార్దిక ధన్యవాదాలు.

1–2–21, గగన్‌మహల్‌రోడ్
హైదరాబాద్ (ఆం, ప్ర)

**— ఖండేరావుకులకర్ణి**

# ఇందులోని గాధలు

# స మ ర్ప ణ



హైదరాబాద్ విముక్తి పోరాటంలో
ప్రాణాలు అర్పించినవారి
పాదాలకు సాదరంగా
సమర్పిస్తున్నాను.

—ఖండేరావు కులకర్ణి

# 1. విప్లవవీరుడు నారాయణబాబు

## హైద్రాబాద్

"ఆజాద్ హైద్రాబాద్" నినాదం మారుమ్రోగుతోంది. అక్కడక్కడ నిజాం సంస్థానానికి చెందిన అసఫియా పతాకం గర్వంగా ఎగురుతోంది. ఖాక్సార్ రజాకార్ల ముఠాలకు సంబంధించిన సైనికులు నినాదాలు చేస్తూ సగర్వంగా ధ్వజానికి వందనాలు సమర్పిస్తున్నారు. "షాహెఉస్మాన్ జిందాబాద్, ఆజాద్ హైద్రాబాద్ జిందాబాద్, కాయదె మిల్లత్ జిందాబాద్" అనే నినాదాలు సరిగ్గా 1947 అగష్టు 15 నాడే హైద్రాబాద్‌లో ప్రతిధ్వనిస్తున్నాయి. హైద్రాబాద్ సంస్థానానికి చెందిన పాలకవర్గ మహమ్మదీయులు కోలాహలంగా తమ స్వతంత్ర హైద్రాబాద్ ఉత్సవాలను జరుపుకొంటున్నారు.

హిందువులకు "ఆజాద్ హైద్రాబాద్" అంటే యేమిటో ప్రత్యక్షంగా తెలుసు. స్వతంత్ర ప్రతిపత్తి అనగానే హిందువుల ప్రాణాలకు, ఆస్తులకు ముప్పు వాటిల్లినదనే అర్థం. శాశ్వతంగా ఆత్మాభిమానం మట్టిలో కలిసిపోతుందని భయం. ఆరోజు భారతావని నాలుగు చెరగులా స్వతంత్ర భారత


నిజాం ఉస్మాన్ ఆలీఖాన్

త్రివర్ణ పతాకం భారతీయులలో నూతనోత్తేజాన్ని ప్రస్ఫుటిస్తూ స్వేచ్ఛగా ఆడుతోంది. కాని ఆ భారతదేశంలోని భూభాగమైన హైదరాబాద్‌లో హిందువులు దానిస శృంఖలాలలో మ్రగ్గుతున్నారు. మృత్యు ఛాయలు క్రమ్ముకుంటున్నాయి. తమ పిత్రార్జితమైన ఆస్తిపాస్తులను వదలి ఆలుబిడ్డలతో సహా రాజ్యపు సరిహద్దులను దాటి చాలామంది హిందువులు వెళ్ళిపోతున్నారు. చివరకు నాయకులు కూడా సంస్థానంలో నుండటం మేలు కాదనుకున్నారు.

1947లో భారతదేశం విముక్తి చెందినా, దేశంలోని పెద్ద సంస్థానమైన హైద్రాబాద్‌లో అధిక సంఖ్యాకులు భయాందోళనలతో జీవిస్తున్నారు. ఎంతో కాలం నుండి స్వతంత్ర హైద్రాబాద్‌కై కలలు గంటున్న నిజాం ఆ అవకాశాన్ని చేజిక్కించుకున్నాడు. హిందువులు అధిక సంఖ్యలో ఉన్నా వారికి సాధారణమైన ప్రాథమిక హక్కులు కూడా లేకుండా చేశాడు. హైద్రాబాద్‌ను సార్వభౌమాధికారాలు గల ఇస్లాం రాజ్యంగా రూపొందించాలని ప్రయత్నించాడు.

లార్డ్ రీడింగ్ హయంలోనే నిజాం "విశ్వాస పాత్రుడైన మిత్రుడుగ" పరి గణన పొందాడు. ఆ నమ్మకంతోనే స్వతంత్ర ప్రతిపత్తి రాగాన్ని అలా

పించ మొదలుపెట్టాడు. కాని బ్రిటిషు ప్రభుత్వం చాకచక్యంగా తన ఉద్యోగులను కీలకస్థానాల్లో నియమించి నిజాం కలలను వమ్ముచేసింది.

ఆ తర్వాత స్వతంత్ర భారత్‌లోని హైద్రాబాద్ పరతంత్ర ప్రజలు స్వేచ్ఛకోసం ఆందోళన ప్రారంభించారు. నిజాం దమన నీతిని చేపట్టి నిరంకుశంగా పాలనా యంత్రాంగాన్ని బిగించాడు. తనకు సహాయంగా "ఇత్తెహాదుల్ ముసల్మీన్" అనే మతసంస్థనొకదానిని సంపాదించాడు. మహమ్మదీయులు పాలకులని, హిందువులు పాలితులని నిజాం తమ సత్తాకు ప్రతీక అని ఈ సంస్థ ప్రచారం సాగించింది. ఈ మత సంస్థ రజాకార్లనే సైన్యాన్ని కూడా రంగంలోకి దింపింది. సంస్థానంలోకి ఇతర ప్రాంతాలలోని మహమ్మదీయులను రప్పించి సంఖ్యను పెంచుకుంటూ పోయ్యాడు. సిడ్నీ కాటన్ వంటి విదేశీయుల సహాయంతో ఆయుధాలు సేకరించడం మొదలయింది. రహస్యంగా విమానాల ద్వారా ఆయుధాలు హైద్రాబాద్ జేరుతున్నాయి. హైద్రాబాద్‌లోని కర్మాగారాలను ఆయుధాల ఫ్యాక్టరీలుగా మార్చి వేశారు. నిజాం తన సైనిక బలాన్ని వృద్ధి చేస్తూ మరొకవైపు భారత ప్రభుత్వంతో సంధి మంతనాలు ఆడుతున్నాడు. హిందువులపై ద్వేషం వెదజల్లుతూ 'జహాద్' (ధర్మయుద్ధం) పేరిట అత్యాచారాలు సాగించాడు. రజాకార్లు స్వేచ్ఛగా లూటీలు, మానభంగాలు చేస్తూ భయావహమైన వాతావరణాన్ని సృష్టించారు.

## విప్లవవీరుడు నారాయణబాబు

ద్వేషపూరితమైన ఈ విషవాతావరణంలో నారాయణబాబు అనే యువకుని రక్తం ఆవేశంతో పరవళ్ళు తొక్కింది. "మీ రక్తాన్ని ఇవ్వండి–స్వాతంత్ర్యాన్ని ఇస్తాను" అనే సుభాష్ పిలుపు ఈ యువకుణ్ణి ప్రేరేపించింది. హైద్రాబాద్‌లో విచ్చలవిడిగా కొనసాగుతున్న అత్యాచారాలను



బాలకృష్ణ

ధృఢంగా ఎదుర్కొనాలని నారాయణబాబు ఆలోచించ సాగాడు. స్వతంత్ర హైద్రాబాద్ అనే హైద్రాబాద్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయాలని అతను కృతనిశ్చయుడైనాడు.

ఈ ఆశయంతోనే మరో హైద్రాబాద్ యువకుడు తన వ్యక్తిగత హోదాలో పూర్వరంగాన్ని సృష్టిస్తున్నాడు. అతనే బాలకృష్ణ అనే తెనుగు యువకుడు. ఇతను స్వాతంత్ర్యేచ్ఛతో నిజాం విమోచనోద్యమం లేవదీయాలని దేశంలోని పలుప్రాంతాలు పర్యటించాడు. పంజాబ్ తదితర ప్రాంతాలలో విప్లవకారులతో ఐదారు నెలలు గడిపి అనేక విషయాలు నేర్చుకున్నాడు. ఆ తర్వాత బాలకృష్ణ హైద్రాబాద్‌లోని సిద్ధిఅంబర్ బజార్‌లో "స్పెషల్ బాంబే టైలర్స్" అనే దుకాణం తెరచి రహస్య కార్యకలాపాలు ప్రారంభించాడు. పైకి మాత్రం ఆర్యసమాజ్ కార్యకర్తగా చెప్పుకుంటూ రహస్యంగా విప్లవ కారులను సమీకరించాడు. అతని దగ్గరే నారాయణబాబుకు విప్లవకారులకు సంబంధించిన సాహిత్యం లభించింది. తన నిశ్చయం మరింతగా సుదృఢమై మనస్సులో లక్ష్యంగా వేళ్ళూనింది. చచ్చినా బ్రతికినా నాదేశం కోసమేననే భావం ఉప్పొంగింది.

నారాయణబాబు తండ్రి పండరీనాథ్‌రావ్, బీదర్ జిల్లాలోని సౌలదాబ్


నా రా య ణ బా బు

గ్రామం వదలి 1900 లో జీవనభృతికోసం వరంగల్ విచ్చేశాడు. బాల్కి తాలూకా లోని సౌలదాబ్ గ్రామంలో ఆరోజుల్లో కాటక పరిస్థితులు ఏర్పడి నందువల్ల ఆయన వరంగల్ వచ్చి కొత్తగా నిర్మాణంలో వున్న రైలు మార్గంలో కూలీగా చేరాడు. క్రమంగా 'ముకద్దమ్‌గా' ఉన్నతిపొందాడు. 1926 లో వరంగల్‌లోనే నారాయణబాబు జన్మించాడు. అక్కడి హైస్కూలులో మెట్రిక్యులేషన్‌లో ప్రథమ శ్రేణిలో అందరికన్నా ఎక్కువ మార్కులతో ఉత్తీర్ణుడై, ఇంటర్మీడియట్ కాలేజీలో చేరి ఇంటర్ పరీక్షలో ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. న్యాయవాద విద్య నభ్యసించాలనే ఉద్దేశంతో హైద్రాబాద్ చేరుకున్నాడు. పండరీనాథ్‌కు తన ఏకైక కుమారునిపై అతని భవిష్యత్తుపై అపారమైన విశ్వాసం ఉండేది.

నారాయణబాబుకు ఎనిమిదవ తరగతి చదువుచున్న కాలంలోనే పాఠ్యపుస్తకాలు కాకుండా ఇతర గ్రంథాలు చదవడమంటె చాల యిష్టం. ఆర్యసమాజ్ సంస్కరణ వాద ఉద్యమాలు అతన్ని ప్రభావితం చేశాయి. హరిజనులపట్ల జరుగుతున్న అన్యాయాలుచూసి గుండె ద్రవించేది. అందువల్ల హరిజనులకు చదువు చెబుతూండేవాడు. తండ్రికిది నచ్చేదికాదు. పురాతన భావాలు ఆయన్ని వెనక్కులాగుతుండేవి. అయినా నారాయణబాబు పట్టుదల,

ఆదర్శభావాలు తండ్రినికూడా మార్చివేశాయి. ఫలితంగా తమ ఇంటిదగ్గరే హరిజన పిల్లలకు చదువు చెబుతుండేవాడు. సహపంక్తి భోజనాలు జరుగుతుండేవి. నారాయణబాబు స్వభావం పండరీనాథ్‌రావును ముగ్ధునిగా చేసింది. నారాయణబాబు సహజ సిద్ధమైన వినయం, దృఢసంకల్పం, మితభాషణం ఎవరినైనా సులభంగా ఆకర్షించేవి.

ఆనాటి ఘోరపరిస్థితులు నారాయణబాబు సంవేదన శీలత్వాన్ని ప్రజ్వలింపజేశాయి. దేశభక్తి రక్తంలో ప్రవహిస్తోంది. న్యాయవాదవిద్యను అభ్యసిస్తూఉన్నా దేశంకోసం సర్వం త్యాగం చేయాలనే తపన రగుల్కొన్నది. న్యాయవాది కావాలన్న కోరిక క్షీణించింది. తాను జన్మించిన ప్రాంతము బానిసత్వంలో ఆక్రందిస్తుంటే చూడలేక పోయాడు.

## జిన్నా ఉపన్యాసం:

1947 ప్రారంభంలో మహమ్మదాలీ జిన్నా హైద్రాబాద్ వచ్చి ఒక పెద్ద సభలో ప్రసంగించాడు. జనాన్ని రెచ్చగొట్టే విధంగా పరుషంగా మాట్లాడాడు. నారాయణబాబు ముసల్మాన్ వేషంతో అక్కడికెళ్ళి ఉపన్యాసం విన్నాడు.

"కోడిమెడలను విరచినట్లుగా హిందువులను విరిచేస్తాం. ముల్లంగి కాడల్లా త్రుంచివేస్తాం," అని మహా ఉద్రేకంగా మాట్లాడాడు.నారాయణబాబు రక్తం ఉడుకెత్తింది. హృదయం విక్షుబ్ధం కాగా ఏదో ఒకటి చెయ్యాలనే తపన తీవ్రం అయింది. కాయదే ఆజం జిన్నా ప్రసంగం నారాయణబాబు జీవితాన్ని ఒక మలుపుదగ్గర నిలుచోబెట్టింది.

బాలకృష్ణ, నారాయణ తమ విప్లవ సహచరులను సమీకరించి కార్యక్రమాలను నిర్ణయించుకున్నారు. అడుగడుగునా ధనాభావం ఆయుధాల వెలితి ఉన్నా, సహనంగా స్వతంత్ర హైద్రాబాద్‌ను తుదముట్టించాలనుకు


జగదీష్

న్నారు. నారాయణబాబు, బాలకృష్ణలతో బాటు నారాయణస్వామి (మాజీ నిజాం రైల్వేలో కో ఆఫీసర్) విశ్వనాథ్ (గన్ ఫౌండ్రి) రెడ్డిపోచ్‌నాథ్, గంగారాం హాలంకోలీ, జగదీష్ ప్రధానంగా రహస్య మంతనాలు సాగించారు.

మొట్టమొదటి ప్రయోగంగా నిజాం సైనికదళానికి చెందిన రిజర్వు పోలీస్ ఆశ్వికదళం వున్న ప్రాంతాన్ని టైంబాంబుతో ధ్వంసం చేయాలని నిశ్చయించుకున్నారు. ప్రజలలో చైతన్యం కలిగించాలని నిజాం దుష్కృత్యాలను ప్రతిఘటించే జనం ఉన్నారనే అంశం తెలియజేయాలనీ, ప్రయోగాత్మకంగా ఈపని చేసి చూడాలనే ఈ నిర్ణయానికి వచ్చింది. సిటీకాలేజ్‌కు పశ్చిమంగా ఉన్న రిజర్వు పోలీస్ పెరేడ్ గ్రౌండ్ దగ్గరలోనే (పేటలా బురజ్‌దగ్గర) ఆశ్వికదళంతబేలా, రిజర్వ్ పోలీస్ కార్యాలయం ఉండేవి. రోడ్డుకు మరో ప్రక్కన పోలీస్ బ్యారక్స్ కూడ ఉండేవి.

పథకం ప్రకారం నిర్ణీత స్థలంలో నారాయణబాబు గంగారాంలు వెళ్ళి అతిరహస్యంగా టైంబాంబును నాటివచ్చారు. రాత్రి సరిగ్గా రెండు గంటలకు ప్రేలుడు జరిగింది తబేలా పైకప్పు లేచిపోయి అగ్ని వ్యాపిం

చింది. కొన్ని గుణ్డాలు తీవ్రంగా కాలి గాయపడ్డాయి. వేలాది రూపాయల నష్టం జరిగింది. ఆ తర్వాత గూఢచారిశాఖ ఎంతో గాలించింది. కాని ఎవరూ పట్టుబడలేదు. నారాయణబాబు, ఆయన సహచరులు పొందిన ప్రప్రథమ విజయం అది.

## కాందిశీకుల రైలు
## పేల్చివేతకు పథకం

నిజాం తన హైద్రాబాద్ సంస్థానంలో హిందువులను అణచివేయాలనే ప్రయత్నంలో భాగంగా ముస్లిం జనసంఖ్యను పెంచుతున్నాడు. ఇరుగు పొరుగు రాష్ట్రాలనుండి వేలాదిమంది మహమ్మదీయులను తీసుకువచ్చాడు. ప్రత్యేకించి నిజాంరైల్వేవాళ్ళ స్పెషల్ ట్రైన్స్ ద్వారా కాందిశీకులను తరలించారు. పటేల్ లోక్‌సభలో ప్రకటన చేస్తూ హైద్రాబాద్‌లో ఎనిమిది లక్షలమంది కాందిశీకులకు నివాసం ఏర్పాటు చేశారని, అందులో పదివేల, నాల్గువందలమందిని నిజాం సైన్యంలో చేర్చుకున్నారని చెప్పారు.

ఇలాంటి వాతావరణంలో ప్రతిఘటన కొనసాగాలని నారాయణబాబు స్నేహితులుతీవ్రంగాఆలోచించారు.మొదటరెఫ్యూజీగుంపులను తగులబెట్టాలని అనుకున్నారు. చేతిబాంబు కావాలని శ్రీవందేమాతరం రామచంద్రరావును కోరారు. కాని అది తరుణం కాదని ఆయన సలహా యిచ్చారు. అయినా నారాయణబాబు నిరుత్సాహం చెందకస్వయంగాప్రయత్నాలు కొనసాగించాడు. చివరకు కాందిశీకుల రైలును పేల్చివేయాలని ఆయన నిశ్చయించుకున్నాడు. రైలును పేల్చివేయటం వలన కాందిశీకులు భయపడి రావడం మానేస్తారని నారాయణబాబు అనుకున్నాడు.

రెఫ్యూజీ ట్రెయిన్ వచ్చే వేళలు కనుక్కొని కార్యక్రమం రూపొందించుకున్నారు. బలార్షా నుండివచ్చే రైలు ఘట్‌కేసర్ గుండా హైద్రాబాద్‌కు

వస్తోంది. హైద్రాబాద్‌కు షుమారు 15 మైళ్ళ దూరంలో ఉన్న ఘటకేసర్ - మౌలాలీ స్టేషన్ల మధ్య ఒక చోటును ఎన్నుకున్నారు. నారాయణబాబు లోకో ఆఫీసులో పని చేస్తున్న నారాయణస్వామి, విశ్వనాథ్‌ల సహాయంవల్ల పరికరాలు సంపాదించాడు. నారాయణబాబు రెండుగంటలు కష్టపడి ఫిష్ ప్లేట్లను తొలగించాడు. నారాయణస్వామి, విశ్వనాథ్‌లు రెండువైపులా ఉండి కాపలా కాశారు. ఆ తర్వాత ముగ్గురూ కలిసి దగ్గరలోనే ఉన్న పొదలో దాక్కొని రైలుకోసం చూస్తున్నారు. అనుకోకుండా ఇద్దరు లైన్‌మెన్‌లు చెకింగ్‌చేస్తూ వచ్చారు. తొలగించ బడిన ఫిష్‌ప్లేట్లను చూసి,వచ్చే రైలును ఆపి వేశారు. రైలు కూల్చివేత కార్యక్రమం విఫలమైంది. ఆ తర్వాత రైల్వేశాఖవారు గాంగ్‌మన్‌లను తీవ్రంగా బాది చూశారు. కాని ఎవరూ పట్టుబడలేదు.

## లక్ష్యసిద్ధికై :

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్న డాక్టర్ సయ్యద్ అబ్దుల్ లతీఫ్ ముస్లిం పక్షపాతి. ఒక విధంగా ద్విజాతి సిద్ధాంతం యితని కల్పనే. దాని ఆధారంగానే భారతదేశం ముక్కలై పాకిస్తాన్ యేర్పడింది. మత కల్లోలాలు చెలరేగి భయంకర రక్తపాతం అయినా డాక్టర్ లతీఫ్ ద్విజాతి సిద్ధాంతాన్ని హైద్రాబాద్‌కు వర్తింపచేయాలని ప్రచారం కొనసాగించాడు. ప్రత్యేకించి ఇంగ్లీషులో "క్లెరియన్" అనే వార్తా పత్రిక ఇతని సంపాదకత్వాన వెలువడేది. నారాయణబాబు ఈ వ్యక్తిని హత్యచేయాలని నిశ్చయించుకొని రివాల్వర్ కోసం ప్రయత్నించాడు. కాని సమయానికి ఎవరూ ఇవ్వలేదు. నారాయణబాబు వెనుకాడక ముస్లిం వేషంలో అఫజల్‌హుస్సేన్ పేరుతో ఇంటికివెళ్ళి కలుసుకున్నాడు. డాక్టర్ లతీఫ్ వారపత్రిక "క్లెరియన్" ప్రతులుకూడా ఇచ్చాడు. వరంగల్‌లో ముస్లిం ఉద్యమాన్ని తీవ్రం చేయాలనీ , మీలాంటి యువకులే మాకవసర

మని డాక్టర్ లతీఫ్ వీపుతట్టాడు. కాని తన కోరిక తీర్చుకోకుండానే నారాయణబాబు తిరిగి రావలసివచ్చింది.

ఆ తర్వాత నారాయణబాబు తన లక్ష్యసిద్ధి కోసం అనేక మార్గాలు అన్వేషించసాగాడు. ఒకసారి నయాపూల్ దగ్గర నిజాం కారులో వెడుతుండగా చూశాడు. రోజూ సాయంత్రం నిజాం అన్నికట్టుదిట్టాలతో నగరంలో నుండి కారులో వెళుతుండేవాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని నిజాంను తుదముట్టించాలని నారాయణబాబు నిశ్చయించుకున్నాడు. నిజాం హత్యవల్ల అతని ఇద్దరి కొడుకుల్లో ఘర్షణరేగవచ్చు. హిందువుల మూకుమ్మడి హత్యాప్రయత్నాలు సాగితే కేంద్రప్రభుత్వం తప్పనిసరిగా జోక్యం చేసుకోవచ్చునని నారాయణబాబు అంచనా. ఏమైనా బానిసగా బ్రతికే కంటే వీరుడిగా మరణించడమే మేలని భావించాడు.

తనలాగే ఆలోచిస్తున్న మరో బృందంతో పరిచయమైంది. అందులో ముఖ్యులు దేవయ్య, భీష్మదేవ్. ప్రయత్నించగా చివరకి రెడ్డి షోచ్ నాథ్ ద్వారా ఒక చేతిబాంబు లభించింది. ఆర్యసమాజ్ నాయకులు పండిత నరేంద్రజీ శతృవుల్ని ఎదుర్కోడానికి ఆర్యసమాజ్ కార్యకర్తలకు కొన్ని బాంబులు పంచారు. కాని అవి కేవలం ఆత్మరక్షణ కోసం మాత్రమే. ఆ రోజుల్లోనే షోలాపూర్‌లో కీ. శే. రాజపాల్ నిర్వాసితుల శిబిరం నిర్వహిస్తుండేవాడు. అక్కడికి శ్రీ కొండాలక్ష్మణ్ సహాయంతో వెళ్ళి మూడు బాంబులు రెండు రివాల్వర్లు సంపాదించుకుని నారాయణబాబు హైద్రాబాద్ తిరిగివచ్చాడు.

## రక్తంతో ప్రతిజ్ఞ :

మిత్రులంతా కలసి నిజాంపై దాడిచేసే పథకాన్ని సిద్ధం చేసుకున్నారు. తేదీ, సమయం కూడా నిర్ణయించుకున్నారు. మొదట నారాయణ

బాబు నిజాంపై బాంబు విసరాలని ఒకవేళ తప్పి ముందుకు వెళ్ళిపోతే గంగారామ్, జగదీష్‌లు దాడి చేయాలని నిశ్చయించుకున్నారు. అన్ని విధాలా ఏకాభిప్రాయాన్ని కుదుర్చుకొని ముగ్గురుమిత్రులు తమ రక్తంతో ప్రతిజ్ఞా పత్రాలపై సంతకాలు చేశారు.

ప్రతిరోజూలాగే ఆ సాయంకాలం నిజాం సవారి బయలుదేరింది. కింగ్ కోఠినుండి కారు బయలుదేరి ఆల్ సెంట్స్‌స్కూలు దగ్గరకి రాగానే పక్కనే నిలుచున్న గుంపులోంచి సూటులోవున్న ఒక యువకుడు సరాసరిన కారు దగ్గరకు పరుగెత్తి బాంబును బలంగా కారుకు విసరికొట్టాడు. బాంబు కారు తలుపుకుతాకి రోడ్డుమీదపడి పేలింది. నారాయణబాబు వెంటనేరెండో బాంబు తీసి వేసేలోగానే అక్కడి జనం, పోలీసులు వచ్చి విరుచుకుపడ్డారు. అందరూ కలిసి విపరీతంగా కొట్టగా నారాయణబాబు ముఖం రక్తసిక్తమైంది. "నేరస్తుడు చస్తే మిగతావాళ్ళు తప్పించుకుపోతారు-"అని ఒక ఇనస్పెక్టర్ హెచ్చరించగా నారాయణబాబు ప్రాణాలతో మిగిలాడు. ఈలోగా నిజాం కారును డ్రైవర్ చాకచక్యంగా వెనక్కు తిప్పి కింగ్ కోఠికి తీసుకుపోయాడు. బాంబుప్రేలుడు చప్పుడువిన్న నారాయణబాబు సహచరులు తలపెట్టిన పని విజయవంతమైనదని తలచి తప్పించుకుని పారిపోయారు.

## చిత్రహింసలు :

4 డిసెంబరు, 1947 నాటి రాత్రి 8 గంటలకు హైద్రాబాద్ రేడియో ప్రత్యేక ప్రసారంలో నిజాంపై జరిగిన హత్యా ప్రయత్నాన్ని ప్రకటిస్తూ "అల్లా దయవల్ల అల్లా హజరత్ క్షేమంగా వున్నార"నే వార్తను ప్రసారం చేసింది.

ఆ తర్వాత పోలీసుస్టేషన్‌లో నారాయణబాబును నిర్బంధించి అమానుషంగా కొట్టారు. కుట్ర వివరాలు చెప్పమని కిరాతకంగా హింసించారు.


గంగారాం పాలంకోల్

దాహంవేస్తే ఉచ్చపోసి తాగమన్నారు. ఈ హింస వల్ల స్పృహతప్పిపోయినా ఊరుకోలేదు. నిజాంమంత్రి లాయవేతీ ప్రత్యేకంగా వచ్చి నారాయణబాబును ప్రశ్నించాడు. దాహంఅంటే నీళ్లు యిప్పించాడు. ఏ పరిసితుల్లోనైనా సరే నేరస్థుడు చావకూడదని తాఖీదువేసి వెళ్ళిపోయాడు. మూడు రోజులదాకా చేతులు పైకి విరిచికట్టి మోకాళ్ళపై తీవ్రంగా బాదారు. ఆ బాధను భరిస్తూ తనపేరు "బాబు" అని, తానుతప్ప యీ కుట్రలో మరెవ్వరూ లేరని నారాయణబాబు స్పష్టంగా చెప్పాడు.

పోలీసులు నారాయణబాబు సహచరుల్లో గంగారామ్‌ను పాలమ్‌కోల్ గ్రామంలో పట్టుకోగలిగారు. జగదీష్ తప్పించుకుని వెళ్ళిపోగలిగాడు. బాలకృష్ణ తండ్రిని అరెస్టుచేశారు. బాలకృష్ణ మాత్రం చిక్కలేదు. బాంబు విసిరినచోట దొరికిన ఒకసైకిలు ఆధారంగా యీ ఆచూకీ తీయగలిగారు.

పదిహేనురోజుల్లో – చాలచురుకుగా నారాయణబాబు, గంగారాంలపై నేరవిచారణజరిగింది. ఫౌజుదారి, బల్దా, సెషన్, హైకోర్టు చివరకు జుడీషియల్ కమిటీలోకూడా విచారణ జరిగింది. ప్రతీచోటా ఇద్దరు వీరులూ ఒకేమాటను స్పష్టం చేశారు. "మా భారత మాతృభూమికి నిజాం పరమద్రోహి, నిస్సందే

హంగా నిజాంను హత్యచేయాలనే మా ప్రయత్నం. జనాన్ని జాగృతం చేయాలనేది మా రెండో ఉద్దేశ్యం. మేము మా కర్తవ్యాన్ని నిర్వహించాం.

ఒకసారి సెషన్స్‌కోర్టులో విచారణ జరుగుతుండగా రాంలాల్ కిషన్ అనే న్యాయవాది వీరిద్దరికీ నేరాన్ని అంగీకరించవద్దని సలహాయిచ్చాడు. కాని నారాయణబాబు నిరాకరిస్తూ యిలా అన్నాడు. "మా బలిదానంవల్ల ప్రజలు మేల్కొంటారు. మా ప్రాణాలకోసం ప్రయత్నించకండి."

చివరకు నారాయణబాబుకు మరణశిక్ష, గంగారాంకు యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. తన ధర్మాన్ని నెరవేర్చాననే తృప్తితో నారాయణబాబు జైల్లో మృత్యుచ్ఛాయలలో సైతం నిర్విచారంగా గడుపుతున్నాడు. జుడీషియల్ కమిటీ హైద్రాబాద్ ప్రివీకౌన్సిల్ నిర్ణయం కాగానే నిజాం సంతకంతో మరణశిక్ష అమలులోకి రావలసివుంది.

## పోలీసు చర్య :

హైద్రాబాద్ సంస్థానంలో శాంతి భద్రతల రక్షణకోసం కేంద్ర ప్రభుత్వం 1948 సెప్టెంబరులో సైన్యాన్ని పంపింది. మూడు రోజుల ప్రతిఘటన తరువాత నిజాం మోకరిల్లాడు. సెప్టెంబరు 17 వ తేదిన హైద్రాబాద్ విముక్తి చెందింది.

హైద్రాబాద్‌లో సైనిక ప్రభుత్వం నెలకొంది. నారాయాణబాబు మృత్యువు జీవనాభిలాషలోకి పరిణితి చెందింది. తనకు రాజకీయ ఖైదీ హోదా యివ్వాలని కోరాడు. కాని సైనిక ప్రభుత్వం గమనించలేదు. ప్రభుత్వ ఔదాసీన్యం, ఉపేక్షాధోరణి వల్ల ఆయనకు బాధవేసింది. ఫలితంగా 19 రోజులపాటు నిరాహారదీక్ష వహించాడు. మూత్రంలోంచి రక్తం రాసాగింది. డాక్టర్ మేల్కొటే వ్యక్తిగతంగా వెళ్ళి నచ్చ చెప్పి నిరహారదీక్ష విరమింపచేసి, చివరకు రాజకీయ ఖైదీ హోదాను యిప్పించ

గలిగారు. నారాయణబాబు, గంగారాంల విడుదలకు ప్రజల వత్తిడి తీవ్రం కాసాగింది. అయినా జైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ వీరిద్దరిని క్షమాపణ పత్రం వ్రాసియిమ్మని అడిగాడు. "తమకు విముక్తి భిక్ష అక్కరలేదని వారిద్దరు తీవ్రంగా మందలించారు. తన కుమారుని క్షమాభిక్ష వేడుకొమ్మని చెప్పి విడిపించుకోటం తండ్రి పండరీనాథ్‌రావ్‌కు కూడా యిష్టంలేదు. గంగారామ్ తల్లి కూడ స్వాభిమానంతో క్షమాపణపత్రం వ్రాయడానికి నిరాకరించింది. చివరకు బేషరతుగానే 1949 ఆగష్టు 10 వ తేదీన నారాయణబాబు, గంగారాంలను విడుదలచేశారు. వీరిద్దరు ఆ తర్వాత ఢిల్లీ వెళ్ళగా దేశబంధు గుప్తాగారు, సర్దార్ వల్లభాయి పటేల్‌గారి దగ్గరకు తీసుకువెళ్లారు. పటేల్ నారాయణబాబు వీపు తడుతూ, "నువ్వు నిజాంపై బాంబులు వెయ్యవలసి వచ్చింది. నేను కాల్పులు జరపవలసివచ్చింది" అని ప్రశంసించారు.

హైద్రాబాద్‌ను విముక్తం చేయాలనే స్వప్నం సాఫల్యం చెందిన తర్వాత కుటుంబ పోషణార్థం యేదో ఉద్యోగం చేయక తప్పలేదు. అసంపూర్ణంగావున్న విద్యాయోగ్యతవల్ల ఎలక్ట్రిసిటీ శాఖలో క్లర్కుగా ఉద్యోగం సంపాదించారు. కాని నలభై ఐదు రోజులు ఉద్యోగం చేసిన తరువాత ఉద్యోగంలోంచి తీసివేశారు. నారాయణబాబు పేరు పోలీసు బ్లాక్ లిస్టులో వుందనీ, అందువల్ల ప్రభుత్వోద్యోగం చేయడానికి వీల్లేదని అన్నారు. ఆ నలభై ఐదు రోజుల జీతంకూడ యివ్వలేదు. ఈ నిర్లక్ష్యం చాలమంది దేశభక్తులపట్ల జరిగింది. ఆ తరువాత ఎప్పటికో నారాయణబాబు పేరు బ్లాక్ లిస్టులోంచి తొలగించబడింది.

# 2. ఉమ్రీ బ్యాంక్ దోపిడీ

1947 తర్వాత ఉక్కుమనిషి సర్దార్ పటేల్ భారత దేశంలోని చిన్న పెద్ద సంస్థానాలన్నింటినీ కేంద్రంలో విలీనంచేశారు. కాని నిజాంపెత్తనం క్రిందవున్న హైద్రాబాద్ మాత్రం మొండిగా స్వతంత్ర ప్రతిపత్తిని కోరింది. అందువల్ల శస్త్రచికిత్స అవసరమైంది. ఆ శస్త్ర చికిత్సయే పోలీస్ చర్యగా పరిణమించింది. అంతకు పూర్వమే అనేకమంది విప్లవవీరులు మాకీ సంస్థాన నిరంకుశ పాలనకు అనేక బాకుపోట్లు పొడిచారు. అనేకమంది యువక వీరులు ప్రాణాలు అర్పించారు. ఆ సంఘటనలలో ఒకటి ఈ "ఉమ్రీబ్యాంక్ దోపిడీ."

## ముదఖేడ్కర్ బలిదానం :

1946 డిసెంబరు 16 నాటి సాయంత్రం ఉమ్రీస్టేట్‌బ్యాంక్ (హైద్రాబాద్) ఆవరణలో అకస్మాత్తుగా తుపాకీ కాల్పులకు దత్తాత్రేయ ముదఖేడ్కర్ భూమిమీదకు వొరిగాడు. ఆతని అన్న దిగంబర్‌రావ్ కూడ తీవ్రంగా గాయపడ్డాడు. కాల్పుల చప్పుడు తర్వాత స్తబ్దత వ్యాపించింది. బ్యాంక్ వాచమన్ అరబ్బీవాడు జరిపిన కాల్పులకు ముదఖేడ్కర్ సోదరులలో ఒకడు నే-కొరిగాడు.



దత్తాత్రేయ ముదఖేకర్

మాజీ హైద్రాబాద్ సంస్థానంలోని ఉమ్రీపట్టణం ప్రత్తి వ్యాపారానికి ముఖ్య కేంద్రం. ఆరోజుల్లో ప్రత్తితో నిండిన బండ్లు ఉమ్రీ మార్కెట్టుకు వందల సంఖ్యలోవస్తున్నాయి. అది ప్రత్తి పంట కోసిన కాలం.

కాల్పులకు దారితీసిన అసలు విషయం చాలా మామూలైనది. ఉమ్రీ పట్టణంలో మతకలహాలు రెచ్చగొట్టేవారున్నారు ఆ రోజుల్లో. ఒక ముస్లిం ఒక దుకాణానికి వెళ్ళి అగ్గిపెట్టె కొన్నాడు. ఆరుపైసల హోలీకి బదులు ఏడుపైసలహోలీకి ఆ దుకాణదారుడు అగ్గిపెట్టెని అమ్మాడు. ఒక్క పైసాపై గొడవ బయలుదేరింది. హైద్రాబాద్‌సంస్థానంలో ఆరోజుల్లో ముస్లింలందరు తమను తామే పాలకులుగా, హిందువులను పాలితులుగా భావించేవారు. అందువల్ల ప్రతిచిన్న విషయంపై ముస్లింలు హంగామా చేసేవారు. ఈ వాతావరణంలో ఆ చిన్న సంఘటన పెద్ద తగాదాగా మారింది. అక్కడే వున్న ముదఖేడ్‌కర్ సోదరులు కలుగజేసుకున్నారు. దిగంబరరావు స్థానిక ఆర్యసమాజ శాఖకు కార్యదర్శి. ఆ రోజుల్లో హిందువుల ఆత్మ గౌరవాన్ని కాపాడడానికి ఆర్యసమాజ్ అన్ని విధాల ప్రయత్నాలు జరిపేది. అందువల్ల కార్యదర్శి దిగంబరరావు, ఆయన తమ్ముడు దత్తాత్రేయ అక్కడ ముస్లింలకు శత్రువులుగా కనపడేవారు. ఆ నాటి సందర్భాన్ని పురస్కరించుకొని దగ్గరలోనే వున్న స్టేట్ బ్యాంక్ ఆవరణలోని చెట్లవెనకాలనుండి

అరబ్బీ వాచ్‌మన్ కాల్పులు జరిపాడు. ఫలితంగా దత్తాత్రేయ చనిపోయాడు. దిగంబరరావు తీవ్రంగా గాయపడ్డాడు.

ముదఖేడ్‌కర్ కుటుంబంలో శోకజ్వాలలు వ్యాపించాయి. దేవీదాస్‌రావు ముదఖేడ్‌కర్ ఇద్దరు కుమారులలో చిన్నవాడు దత్తాత్రేయ మరణించాడు. అతను ఎనిమిది నెలల క్రితమే వివాహమాడిన అమ్మాయి విధవ అయినది. గాయపడిన పెద్దవాడు దక్కుతాడో లేడో? ఒకవేళ దక్కినా నిజాం పోలీసులు అతన్ని వదులుతారా? సంస్థానంలో ఎక్కడ చూసినా రజాకార్ల అత్యాచారాలు మితిమీరిపోతున్నాయి. దిగంబరరావు కోలుకొని ఇంటికి రాగానే నిజాం పోలీసులు అల్లరి, హత్యాప్రయత్నం అనే నేరాలు మోపి అరెస్టు చేశారు. నిజాం పరిపాలనలో విచిత్రమైన న్యాయం కొనసాగేది. హత్య చేయబడినది తమ్ముడు. చేసినది అరబ్బీ వాచ్‌మన్. హత్యాప్రయత్నం నేరాన్ని గాయపడిన అన్నపై మోపారు. హత్యచేసిన అరబ్బీ వాడు నిర్దోషిగా మిగిలాడు.

## ప్రతీకారం :

ఈ సంఘటనతో ఉమ్రీ యువకుల్లో గొప్ప సంచలనం చెలరేగింది. ప్రతీకార వాంఛతో యువకులు ఆలోచించ మొదలుపెట్టారు. దేశం స్వతంత్రమైనా నిజాం మాత్రం తాను తన సంస్థానాన్ని స్వతంత్రంగా నిలుపుకోవాలని రజాకార్లను పెంచాడు. అన్నిచోట్ల ముస్లింలు మతకల్లోలాలను సృష్టిస్తున్నారు. హిందువులు విపరీతమైన అన్యాయాలకు గురి అవుతున్నారు. ఆ సమయంలో హిందువులు భారతదేశంలోని ఇతర ప్రాంతాలకు వలస పోతున్నారు. ఉమ్రీనుండి బరార్‌నుండి ఉమర్‌ఖేడ్ అనే ప్రాంతానికి అనేక హిందూ కుటుంబాలు శరణార్థులుగా వెళ్ళిపోయాయి. అందులో ముదఖేడ్‌కర్ కుటుంబం కూడా ఒకటి. దిగంబరరావు పూచీకత్తుపై విడుదలై బయటికి వచ్చాడు. ఆ అవకాశాన్ని వినియోగించుకొని అతడు

ఉమర్‌ఖేడ్‌కు పారిపోయాడు. అక్కడ స్టేట్ కాంగ్రెస్ హిందూ శరణార్థుల సహాయార్థం ప్రత్యేక శిబిరాలను నిర్వహించింది. ఈ శిబిరాలలో సహాయ కార్య కలాపాలతో బాటు హిందూ యువకులకు ఆయుధాల ఉపయోగంలో శిక్షణ కూడా ఇచ్చేవారు. బెరార్ సరిహద్దును తాకి వున్న ఉమ్రీనుండి రజాకార్లు దాడి చేస్తుండేవారు. ఆ దాడులను ఎదుర్కొడానికి ఆ హిందూ యువకులు సంసిద్ధంగా వుండేవారు. అంతలో ఉమ్రీ నుండి వచ్చిన యువ కులు అవకాశాన్ని చూచి దత్తాత్రేయ మరణానికి ప్రతీకారం చేయాలని పథకాలు వేశారు. అందరికీ ఒక పథకం నచ్చింది. ఉమ్రీ స్టేట్ బ్యాంక్‌పై దాడిచేసి లూటీ చేసిన డబ్బుతో స్టేట్ కాంగ్రెస్‌కు సహాయపడాలని. కాని ఆ దాడికి కావలసిన ఆయుధాల సేకరణ సమస్యగా మారింది.

## ఉమ్రీ బామాషా :

అంతకు పూర్వమే ఉమ్రీ ప్రాంతపు యువకులు, స్టేట్ కాంగ్రెసు కార్యకర్తలు నాగపూర్, జబల్‌పూర్‌లలో హోమ్‌గార్డ్స్ దళాలలో శిక్షణ పొంది వచ్చారు. ఆయుధాలతో దాడి చేయడం వగైరా అంశాలలో తర్ఫీదు పొంది సిద్ధంగా ఉన్నారు. ఉమ్రీ బ్యాంక్‌పై దాడి చెయ్యాలంటే మాటలతో అయ్యే పనికాదు. దాదాపు 30 మైళ్ళ వరకు ఆయుధాలను తీసుకుపోవడం; అందులో రజాకార్లతో నిండిన నిజాం సంస్థానంలోకి చొరబడడం కష్ట సాధ్యం. అయినా ఆధునిక ఆయుధాలు కావాలి. ఆ సందర్భంలో ధన్‌జీ అనేవ్యక్తి తన ఆస్తినంతా అమ్మి నలభై వేల రూపాయలు విరాళంగా యిచ్చాడు. ధన్‌జీ ఆ కష్ట సమయంలో అంత డబ్బు విరాళంగా ఇవ్వడం అపూర్వం. మొగల్ రాజులను ఎదుర్కొడానికి రాణాప్రతాప్‌కు సర్వస్వం దానం చేసిన "రాజస్థాన్ భామాషా" అనే సంపన్నుడు ఈ సందర్భంలో అందరికీ జ్ఞాపకం వచ్చాడు. ధన్‌జీని "ఉమ్రీభామాషా" అని పిలిచేవారు.

విరాళంగా వచ్చిన డబ్బుతో కావలసిన ఆధునిక ఆయుధాలను



ధన్జీ సేఠ్ (ఉమ్రీ ఖామూవా)

కొనడం జరిగింది. యువకులందరూ అమితోత్సాహంతో సన్నాహాలు ప్రారంభించారు. ఉమ్రీ బ్యాంక్ పై 12 జనవరి, 1948 నాడు దాడి చేయాలని నిర్ణయించారు.

ఉమర్ ఖేడ్ నుండి సాయుధులైన యువక బృందం 30 మైళ్ళు ప్రయాణంచేసి ఉమ్రీ చేరింది. క్రమేణా ఉత్సాహం చల్లబడి ఆలోచన రేకెత్తింది. రాత్రి దాడిచేస్తే చీకట్లో అనేక మంది అమాయకుల ప్రాణాలు పోవచ్చును. అలజడిలో మిత్రులు పరస్పరం కాల్పులకు గురికావచ్చును. అందువలన అన్ని జాగ్రత్తలతో ఒక పథకాన్ని రూపొందించుకొనటానికి ఉమర్ ఖేడ్ కు తిరిగి వచ్చేశారు.

ఆ తర్వాత ఈ రహస్యం వదంతులుగా వ్యాపించింది ఉమ్రీబ్యాంక్ మీద దాడి చేయడానికి ఒక జట్టు వచ్చిందనే విషయం ప్రజలు అనుకోసాగారు. నిజాం పోలీసు, రజాకార్ల బృందం ఈ వదంతులను నమ్మలేదు. తామందరు ఇన్ని కట్టుబాట్లతో వుండగా 30 మైళ్ళు దాటి రహస్యంగా దాడి చేయాలంటే ఎవరికైనా ఎన్ని దమ్ములుండాలి. నిజాం బలగం ప్రజల వదంతులను ఖండించింది. అయినా తన జాగ్రత్తలో తాను ఉంది. ఉమ్రీలో సాయుధ పోలీసు బలగాన్ని ఇంకా పెంచింది. ఉమ్రీ సరిహద్దు పొడవునా అశ్వికదళాన్ని కాపలా ఉంచింది. ఈ పరిస్థితుల్లో ఉమ్రీ బ్యాంక్ పై దాడి చేయటం అంత సులభంకాదు. అందువల్ల సాయుధ దళాన్ని మరోచోటికి

దృష్టి మళ్ళింపజేసి తమ ప్రయత్నాన్ని సాగించాలని యువక బృందం ఎత్తుగడ వేసింది.

## తలణి జాగీర్‌పై దాడి :

ఉమ్రీ సరిహద్దులో ఉన్న తలణి జాగీర్‌పై మొదట దాడి చేయాలని నిశ్చయించుకున్నారు. 1948 జనవరి 23న బహుశా ఈ దాడి జరిగింది. హదగాంవ్‌కు పడమరగా నున్న ఈ జాగీర్‌లో ఆ రోజుల్లో 'లెవీ' వసూలు చేయడానికి నిజాం సాయుధ పోలీసులను పంపించాడు.

ఆ వెన్నెల రాత్రి తలణిలోని ఒక భవనం పైఅంతస్థులో ఈ సాయుధ పోలీసులు విశ్రమించారు. బయట జాగీర్‌కు చెందిన హరిజనులు మంట కాచుకుంటూ కాపలా కాస్తున్నారు. అకస్మాత్తుగా కొద్ది దూరంలో చప్పుడైంది. ఒక హరిజన కాపలాదారుడటు వైపెళ్ళాడు. అతని మెడలు వంచి పిస్టల్ కణతలపైగురిచూపి బంధించింది యువకబృందం. అరిస్తే యమలోకం పంపిస్తామని బెదిరించారు. అతని నుంచి సమాధానం సేకరించారు. అంచనాను మించి సాయుధ పోలీసులు ఎక్కువసంఖ్యలో ఉన్నారని తెలిసింది. అయినా ధైర్యంగా చాక చక్యంగా ఎదుర్కోడం తప్ప మరోమార్గం కనిపించలేదు. ప్రాణాలకు తెగించి యువకులు సిద్ధమైనారు.

నిలుచున్న చోటినుండి యువకులు ఏకధాటిగా కాల్పులు కొనసాగించారు. వచ్చేముందు దాదాపు రెండు ఫర్లాంగులు మోకాళ్ళపై పాకుతూ వచ్చిన శ్రమను మరచి సాహసాన్ని ప్రదర్శించారు. మొత్తం యువకులు ఆరుగురు మాత్రమే. అయినా ఏకధాటిగా అనుకోకుండా సాగిన కాల్పులకు పోలీసులు తట్టుకోలేకపోయారు. పైగా పైఅంతస్థుమీద టిన్ను రేకుల కప్పు. కాల్పులకు ఆ రేకులు ప్రతిధ్వనించి అల్లకల్లోలాన్ని సృష్టించాయి. చాలమంది పోలీసులు కాల్పులకు గురై చనిపోయారు. ఎదురు కాల్పులు

జరిపినా ప్రయోజనం లేక పోయింది. ఆరుగురు యువకులూ కాల్పులు సాగిస్తూనే వెనక్కు వెళ్లిపోయారు. ఒక్కరికి కూడా చిన్న గాయం తగుల లేదు.



నాగనాథ్ పరంజపే

మరునాటిరోజు ఈదాడి వార్త విని జిల్లా కలెక్టర్ శహాబుద్దీన్, డి. యస్. పి. రషీద్ తన బలగంతో సహా వచ్చి సంఘటన జరిగిన స్థలాన్ని పరీక్షించారు. వేలసంఖ్యలో కాంగ్రెసు కార్యకర్తలువచ్చి కాల్పులు జరిపారని, తాము ఎదురుకాల్పులుజరిపితే శవాలను తీసికొని పారిపోయారని అక్కడి పోలీసులు రిపోర్టు ఇచ్చారు. కాని అసలు ఆరుగురు సాయుధయువకులుమాత్రమే ఈ అల్లకల్లోలాన్ని సృష్టించారని హరిజన కాపలాదార్లు చెప్పారు. ఈవాస్తవాన్నివిని తమ పోలీసులను చివాట్లుపెట్టారు. దేశభక్తితో సాహసంగా ముందుకువచ్చి విజయవంతముగా ఈ దాడిని జరిపిన ఆరుగురు యువకుల పేర్లు: శ్రీయుతులు బన్సీలాల్ (హదగావ్), సాహెబ్‌లాల్ దేశ్‌ముఖ్ (బారడ్) నాగనాథ్‌పరంజపే. కేశవరామ్‌శహానే, అణాసాహెబ్ లహాంకర్, శంకరలాల్‌శర్మ.

జాగీర్‌పై జరిగినదాడి ఆశించిన ఫలితాన్నిచ్చింది. ఉమ్రీలోని పోలీసుబలగం కొంత జాగీరువైపు వెళ్ళిపోయింది. సరిహద్దుప్రాంతాలలో గస్తీ తిరుగుతున్న అశ్వికదళాన్ని జాగీర్‌కు దగ్గరగా పంపించారు. ఇక ఉమ్రీలోని పోలీసు అధికారి జాగీర్ సంఘటనను ఉదాహరణగా చూపి

ఉమ్రీపై దాడి జరిగే అవకాశంలేదని చెప్పాడు. తనపై అధికారులకు హామీయిస్తూ వివరాన్నిరాశాడు. తర్వాత ఉమ్రీలోని మార్కెట్టుకు సరుకు రావడం, బాంక్‌లో డబ్బు పోగుకావడం జరుగుతోంది. పోలీసులు తమ పైసంపాదనలో పడివున్నారు. మొట్టమొదట్లోనే ఉమ్రీ బ్యాంక్‌పై దాడి జరిగివుంటే ఏబది అయిదు లక్షల రూపాయలు చేతికి వచ్చే అవకాశం వుండేది. కాని దాడి జరుగుతుందనే వదంతి విని కొందరు ఖాతాదారులు డబ్బు వాపసు తీసుకున్నారట. బాంక్‌లోవున్న మొత్తం విలువగూర్చి యెప్పటికప్పుడు సమాచారం అందుతుండేది.

## ఉమ్రీ బ్యాంక్‌పై దాడి :

రెండు వారాలు గడచిపోయాయి. ఉమర్‌ఖేడ్ నుండి మళ్ళీ యీ యువక బృందం 1948 జనవరి 30 న దాడి చేయాలని నిర్ణయించుకుని 28 న ఉమర్‌ఖేడ్ నుండి ప్రయాణం మొదలుపెట్టింది. ఒక ఎద్దుబండిలో కూరగాయలు, గడ్డి వుంచి వాటికింద ఆయుధాలను దాచారు. ప్రయాణం కొన సాగింది. ఆగినచోటల్లా ఆయా గ్రామ ప్రజలు వీరికి తినటానికి రొట్టెలు వగైరా సరఫరా చేసేవాళ్ళు. జనవరి 30 ఉదయాన బండితో సహా యీ బృందం ఉమ్రీకి 5 మైళ్ళు దూరంలోవున్న కామన్‌గాంవ్ చేరింది. అక్కడ పథకం ప్రకారం ఆ బృందం మూడు జట్లుగా విడి పోయింది.

మొదటి జట్టులో ఆయుధాల బండితో సహా దిగంబరరావు, శంకర లాల్ వున్నారు. మామూలుగడ్డి, కూరగాయల బండిగా ఆ ఆయుధాలబండి ఉమ్రీ బ్యాంక్‌కు ఎదురుగా 3-30 గంటలకు చేరింది. పక్కన ధన్‌జీ దుకాణంవుంది. బండిలోపల గడ్డిలో దిగంబరరావు, శంకరలాల్ శవాల్లాగా పడుకునివున్నారు.



మోహన్‌శర్మ

రెండో జట్టు సరిగ్గా సాయంత్రం 5-30 గంటలకు పోలీసు స్టేషన్‌పై దాడి చేసింది. పోలీసులు తాగడానికి వెళ్ళారేమో ఒక్క సిపాయిమినహా మరెవ్వరూ లేరు. నాగనాథ్ పరంజపే నాయకత్వాన దాడి చేసిన యీజట్టు ఆఒక్కపోలీసును స్టేషన్‌లోనే కట్టిపడేసింది. చేతికందిన ఆయుధాలను తీసుకుని ఆ జట్టు బ్యాంకువైపు వెళ్ళింది.

ఈలోగా మూడోజట్టు ఉమ్రీ రైల్వే స్టేషన్‌కు ఎదురుగానున్న కొండలపై నుండి మెల్లిగా వచ్చి చేరింది. ఈ జట్టులో జగదీష్, మోహన్ శర్మ, బాబూరావు కుంటార్‌కర్ మొదలగువారున్నారు. (జగదీష్ నిజాంపై బాంబువేసిన శ్రీ నారాయణబాబు జట్టులోకూడా పనిచేశాడు. ఆనాడు నిజాం బాంబు కేసులో పట్టుబడకుండా తప్పించుకుని వచ్చి యీ జట్టులో పాల్గొంటున్నాడు.) ఈ జట్టు యువకులు రాగానే రైల్వే స్టేషన్‌మాస్టర్ని బంధించి రికార్డులను తగులబెట్టారు. రెండువైపులావున్న టెలిగ్రాఫిక్ వైర్లను కత్తిరించారు. స్టేషన్‌లోని ప్రయాణీకులు ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు. అప్పుడే ఉమ్రీమార్కెట్ ప్రాంతం నుండి కాల్పులు మొదలయ్యాయి. దిక్కులు మారుమ్రోగుతున్నాయి. రైల్వేస్టేషన్‌లో కూడ యీ జట్టు కాసేపు గాలిలో కాల్పులు జరిపింది. ప్రయాణీకులు చుట్టుప్రక్కలవాళ్లు భయపడి యెక్కడికక్కడే కదలకుండా ఆగిపోయారు. ఈ జట్టుకూడా ఆ తర్వాత బ్యాంక్‌వైపు దారితీసింది.

చలికాలపు సాయంత్రం 5-30 గంటలకు మొదటిజట్టు బ్యాంకుపై దాడిచేసింది. దాడిచేసిన యువకులలో అనంతభాలేరావ్, ఆబాసాహెబ్, సాహెబ్‌రావ్, దిగంబర్ ఉత్తర్‌వార్, బన్సీలాల్‌జీ తోషణీవాల్, కిశోర్‌సహానే, శంకర్‌లాల్ శర్మ, ధన్‌జీ పురోహిత్ రఘునాథ్‌పండిత్ తదితరులు వున్నారు. తుపాకులతో కాల్పులు జరుపుతూ వీరంతా బ్యాంకులోకి చొచ్చుకొనిపోయారు. ఈలోగా బ్యాంక్ వాచ్‌మన్లు పైనుండి కాల్పులు ప్రారంభించారు. కాని ఆ వాచ్‌మన్ల కాల్పులకు ఎవరూ అందలేదు. దత్తాత్రేయను చంపిన అరబ్బీ వాచ్‌మన్‌ను మొదలే బ్యాంక్ కాంపౌండులో యీ జట్టు కాల్చి చంపింది. అందువల్ల మేడపైవున్న మిగతా వాచ్‌మన్‌లు ప్రాణభయంతో పైనే దాక్కున్నారు. లోపలికి వెళ్లిన జట్టు సరాసరి క్యాషియర్ దగ్గరికి వెళ్ళింది. క్యాషియర్‌ను తాళంచెవులు అడిగారు. అతను నిరాకరించగానే వెంటనే ఫైరింగ్ జరిగింది.పాపం! దేవిదాస్ గిర్‌గావ్‌కర్ అనే ఆక్యాషియర్ ప్రాణాలు కోల్పోక తప్పలేదు. క్రమంగా డబ్బు భోషాణాలు తెరుచుకున్నాయి. దగ్గరవున్న సంచుల్లో డబ్బు నింపారు. అరబ్బీవాళ్ల లుంగీలు దొరికితే వాటిలో డబ్బు మూటగట్టారు. ఈలోగా మిగతా సహచరులు మార్కెట్‌నుండి బలమైన ఎద్దులువున్న 20 బండ్లను తీసుకుని బ్యాంకు ఎదురుగా సిద్ధంచేసి పెట్టారు. బండివాడు ఒక్కడు కూడా నోరు మెదప లేదు. కాల్పులు గాలిలో కొనసాగుతునే వున్నాయి. భయానకమైన వాతావరణం నెలకొన్నది. పట్టణవాసులు భయంతో కాలుకదప లేదు. దాదాపు రెండువేల దాక గుండ్లు ప్రేల్చబడ్డాయి. ఇరవై బండ్లలో డబ్బు సంచులను అమర్చారు. కేవలం 45 నిముషాల్లో ఎంతో నాటకీయంగా ఈతతంగం జరిగిపోయింది. దాడిలో పాల్గొన్న యువకుల్లో దేవరావ్ ఖడకీకర్ ఒక్కడే గాయపడ్డాడు.

గాయపడిన మిత్రుణ్ణి తీసుకున్న 20 బండ్లతో సహా ఈజట్టు తిరుగు ప్రయాణం సాగించింది. దారిలో మిగతా జట్ల యువకులు వచ్చి కలుసుకున్నారు; ఉమ్రీవదలి నిజాం సంస్థానపు సరిహద్దులుదాటాలని రాత్రంతా



అనంత భాలేరావ్

వేగంగా ప్రయాణం కొనసాగించి, ఉదయం ఆరు గంటలు కాగానే బరార్ సరిహద్దుల్లోకి యీ బృందం ప్రవేశి సరిహద్దు గుండా ప్రవహించే పెన్‌గంగానదిలో యువకులు ఉదయభాస్కరుణ్ణి దర్శించుకున్నారు.

ఇక్కడ ఉమ్రీపట్టణం మొత్తం భయంతో హడలిపోయింది. అసలు ఎవరు, యెంతమంది దాడిచేశారు. కాల్పులు ఇంకా యెంతసేపు కొనసాగుతాయి–అనే అనుమానాలతో ఉమ్రీ ప్రజలు సతమతమయ్యారు. ఈ దాడివార్త చేరగానే రిజర్వు పోలీసులతో ఒక స్పెషల్ ట్రైన్ నిజామాబాద్‌నుండి బయలుదేరింది. అర్ధరాత్రి రెండు గంటల ప్రాంతంలో రిజర్వుపోలీసు ట్రైన్ ఉమ్రీస్టేషన్ చేరింది. కాని చీకట్లో ఎక్కడ పొంచివుండి కాల్పులు జరుపుతారో అనేభయంతో పోలీసులు రైలుపెట్టెల్లోనే వుండిపోయారు.

దాడిచేసిన యువకుల బృందం పెన్‌గంగా నది దాటి దేవసరాచేరింది. ఈ దేవసరా గ్రామం బరార్‌లోనిది. దేవసరాలో బృందం విశ్రాంతి తీసుకోసాగింది. కాని గాయపడిన దేవరావును వెంటనే ఉమర్‌ఖేడ్ చేర్చవలసి వుంది. అందువల్ల దిగంబరరావు అతణ్ణి ఒక బండిలో వేసుకొని విశ్రాంతి లేకుండానే ఉమర్‌ఖేడ్‌వైపు బయలుదేరాడు. బండిలో పడుకున్న దేవరావ్ తీవ్రమైన జ్వరంతో కలవరించడం మొదలుపెట్టాడు. పెన్‌గంగా నదీతీరం

గుండా సాగిన ఆ ప్రయాణం యెంతో కష్టంగా కొనసాగింది. ఉమర్‌ఖేడ్ పోయిన ప్రత్తిబండ్లు ప్రత్తితో సహా ఎదురువచ్చాయి. అప్పుడే తెలిసింది, గాంధీజీ హత్య జరిగిందనే సంగతి.

చివరకి ఉదయం 10-30 గంటలకు గాయపడి ప్రమాదస్థితిలోవున్న దేవరావుతో దిగంబరరావు ఉమర్‌ఖేడ్ చేరుకున్నాడు. పోలీసు అధికారి దక్షిణకర్ వేళకు తోడ్పడి గాయపడిన వ్యక్తికి చికిత్సకు యేర్పాటుచేశాడు. ఆ తర్వాత సాయంత్రం 4 గంటలకు మిగతా మిత్రులందరూ దేవసరానుండి ఉమర్‌ఖేడ్ వచ్చేశారు. వీరంతా అక్కడనుండి జీపులో పుసద్ ప్రాంతం చేరుకున్నారు. దోపిడి చేసి తెచ్చిన డబ్బు మొత్తం గోదాజీరావ్ ఇంట్లో కాంగ్రెస్ నాయకుల సమక్షంలో లెక్కపెట్టారు. మొత్తం ఇరవై లక్షల అరవై అయిదు వేల హాలీ రూపాయలతోబాటు మూడువేల కల్దార్‌రూపాయలు కూడా పున్నాయి. ఇవికాకుండా ఇరవై బండ్లవాళ్ళకు ఒక్కొక్కరికి అయిదు వందల చొప్పున మొత్తం పదివేల రూపాయలు అదనంగా యిచ్చి వున్నారు.

ఈ దోపిడీ తర్వాత ఉమర్‌ఖేడ్ బిడూల్‌లో వున్న శిబిరాలను ఎత్తి వేశారు. దాడిలో పాల్గొన్న యువకు లందరికీ రెండు వందలు చొప్పున యిచ్చి దేశంలో పర్యటించి రమ్మని పంపించివేశారు.

జట్టుజట్టుగా వెళ్ళి దేశాటన ముగించుకొని యువకులు తిరిగివచ్చారు. ఈలోగా నిజాం సంస్థానానికి బరారుకు మధ్య ఒప్పందం కుదరనందువల్ల నిజాం పోలీసులు ఉమర్‌ఖేడ్‌లో గాలింపు ప్రారంభించారు. బ్యాంక్ దోపిడిలో పాల్గొన్న యువకులకు ఉమర్‌ఖేడ్ ప్రభుత్వాధికారులు రక్షణ కల్పించారు. గాలింపులుకోసం పోలీసులు వచ్చేముందు ఒక పైలట్‌జీప్ అడ్వాన్సుగా వెళ్ళి యువకులను తప్పించింది. ఆ తర్వాత మూడున్నరమాసాలు గడిచిపోయిన పిదప ఉమర్‌ఖేడ్ బిడూల్ శిబిరాలు తిరిగి ప్రారంభమైనాయి.

కొంతకాలం తర్వాత (సెంట్రల్ ప్రావిన్స్) హోం మంత్రి శ్రీ ద్వారకాప్రసాద్ మిశ్రా యీ యువకుల నందరినీ తన ఇంటికి ఒకరోజు తేనీటి విందుకు పిలిచాడు. తేనీరు త్రాగిన తర్వాత శ్రీ మిశ్రా గంభీరంగా యిలా అన్నారు: "ఇక మీ అందరినీ నిజాంపోలీసులకు అప్పగించే సమయము ఆసన్నమైంది." వాతావరణం స్తంభించిపోయింది. అప్పుడు యువకులు యిలా సమాధానమిచ్చారు: "మీరు మమ్మల్ని అప్పగించవచ్చును. కాని మా శవాలుమాత్రమే వాళ్ళకి దొరుకుతాయి. మా దగ్గిరవున్న పొటాషియం సైనైడ్ తీసుకోనివ్వండి." నిశ్శబ్దంగా వున్న వాతావరణంలో శ్రీ మిశ్రా నవ్వుతూ ఆ యువకుల సాహసాన్ని ప్రశంసించారు.

పోలీసుచర్య సాగింది. నిజాం లొంగిపోయాడు. హైద్రాబాద్ సంస్థానం భారతదేశంలో విలీనమై స్వేచ్ఛావాయువులు పీల్చింది. కాని ఈ విప్లవవీరులను తర్వాత ఎవరూ పట్టించుకోనలేదు. కొందరి కుటుంబాలు చెదరిపోయాయి. మరికొందరు రోగగ్రస్తులై చికిత్సా సౌకర్యాలు లేక మరణించారు.

ఈ విప్లవ వీరులలో ముఖ్యంగా ఇద్దరు వ్యక్తుల గురించి ప్రత్యేకించి పేర్కొనవలసిన అవసరంవుంది. ఉమ్రీ బ్యాంక్‌పై జరిగిన దాడికి నాయకత్వం వహించిన వ్యక్తి శ్రీ నాగనాథ్ పరంజపే. ఇతను బి; ఎస్సి. యల్. యల్. బి. పట్టా పొందిన ఉన్నత విద్యావంతుడు. తండ్రి ఆనాటి రైల్వేలో ఒక అధికారహోదాలో వున్నాడు. పరంజపే ఆనాడు నిజాం సర్వీసులో పైలట్‌గా శిక్షణ పొందాడు. మరో ఇద్దరు ముస్లిం యువకులతో బాటు బెంగుళూరు వెళ్ళి పైలట్‌శిక్షణను పూర్తిచేసి రమ్మని ప్రభుత్వం ఆదేశించింది. అతను ప్రయాణమవుతుండగా మిత్రులు వచ్చి మందలించారు. మేమంతా దేశవిముక్తికి ప్రాణాలు అర్పిస్తూవుంటే నువ్వు పైలట్‌గా నిజాంకు సేవచేస్తూ మాపైన బాంబులు వేయబోతున్నావా అని విమర్శించారు. పరంజపే తాను చేయబోతున్న విద్రోహాన్ని గ్రహించుకొని ఉద్యోగానికి

స్వ స్తి చెప్పాడు. ఆ తర్వాత, హైద్రాబాద్ విముక్తి పిదప పరంజపే పక్షవాతంతో బాధపడ్డాడు. అయినా దృఢదీక్షతో తనవంతు కృషిని కొనసాగించడం మాత్రం మానలేదు. పరంజపే నాందేడ్‌లోని ఖాదీ గ్రామోద్యోగ సంస్థలో పరిశోధనలో నిమగ్నమై వున్నాడు. విద్యుత్ కర్మాగారాల్లో పనికివచ్చే కాగితాన్ని తయారుచేయడంలో ఆయన విజయం పొందాడు. ఆ కాగితంవల్ల మనదేశానికి విదేశీ మారక ద్రవ్యం బాగా ఆదాయం అయ్యే అవకాశంవుంది. దేశం కోసం జీవించడం మరణించడం అంటే యేమిటో పరంజపే నిరూపించాడు.

రెండోవ్యక్తి ఉమ్రీ బాసూషాగారు పొందిన ధన్‌జీపురోహిత్. ఇతను తన ఆస్తిని సర్వస్వం అమ్మి నలభై వేల రూపాయల సొమ్మును విప్లవకారులకు యిచ్చాడు. ఆ డబ్బుతోనే ఆనాడు బొంబాయినుండి హైద్రాబాద్ విముక్తదళాలు ఒక రహస్యరేడియో కేంద్రాన్ని నిర్వహిస్తూ వుండేవి.

బ్యాంక్ దోపిడీ తర్వాతకూడా పదివేల రూపాయల సొమ్మును తిరిగి యిచ్చినా ధన్‌జీ తీసుకోలేదు. తానుచేసిన త్యాగానికి ప్రతిఫలం కోరలేదు. ఆ తర్వాత అతని కుటుంబం దారిద్ర్యానికి లోనై అనేక బాధలను సహించింది. కొంతకాలం క్యాంటీన్ నడిపించాడు. మరికొంతకాలం చిన్నఉద్యోగం– ఇలా చివరికి వృద్ధాప్యంలో రోగంతో కాలాన్ని గడుపుతూవచ్చాడు. ఈనాడు హర్యానా రాష్ట్రంలో ఎక్కడో కోటదగ్గర శేషజీవితం గడిపేస్తున్నారని తెలుస్తున్నది.

ఉమ్రీ బ్యాంక్ దోపిడివల్ల చేజిక్కిన డబ్బును కాంగ్రెస్ దుర్వినియోగం చేసినట్లు ఆరోపణలు వున్నాయి. ఏది యేమైనా విప్లవకారుల అంతిమ దినాలు మాత్రం విషాదకరంగా ముగిశాయి.

"స్వాతంత్ర్య వీరుల త్యాగాలను విస్మరించే
పాలకుల గుండెలు నిజంగానే రాతిగుండెలు."



# 3. తెగించిన గూఢచారి

సభాస్థలం వేలాది ముస్లిం ప్రజలతో క్రిక్కిరిసివుంది. ఇస్లామియా గీతాలతో, నినాదాలతో వాతావరణం మార్మోగుతోంది. మజ్లిసే ఇత్తెహాదుల్ ముసల్మీన్ అధ్యక్షుడు కాసిం రజ్వీ వందనం స్వీకరిస్తూ వేదికవైపు వస్తున్నాడు. సాయుధులైన రజాకార్లు రెండువైపులా వున్నారు. "ఆలీజనాబ్ సిద్దికె మిలత్, రజాకారుల "సాలారెఅజమ్" (సర్వసేనాధిపతి) కాసింరజ్వీ వేదిక యెక్కగానే జనం నినాదాలు చేశారు. "షాహె ఉస్మాన్ జిందాబాద్, ఆజాద్ హైదరాబాద్ పాయంవాబాద్ సిద్దికె మిల్లత్ కాసింరజ్వీ జిందాబాద్" అనే నినాదాలు ప్రతిధ్వనించాయి.

కాసింరజ్వీ ఆవేశంతో ఉపన్యసిస్తూ హైదరాబాద్ సంస్థానాన్ని సర్వస్వతంత్ర ప్రాంతంగా కొనసాగించాలన్న తమ నిశ్చయాన్ని వ్యక్తంచేశాడు. భారతప్రభుత్వంతో జరిగిన యధాతధ స్థితి ఒప్పందం గురించి చెబుతూ రెసిడెన్సీ నివాసం ప్రసక్తి తీసుకువచ్చాడు. ఆ భవనంలో అప్పుడు భారత ప్రభుత్వ ఏజెంటు జనరల్‌గా శ్రీ కె. యం. మున్షీ బస చేస్తున్నారు.



కె. యం. మున్షీ

ఆ భవనం సార్వభౌమాధికారాలకు చిహ్నం కాబట్టి దానిలో మున్షీ వుండడానికి వీల్లేదని, అతను మకాం మార్చనిపక్షంలో రెసిడెన్సీ భవనాన్ని నేలమట్టం చేస్తామని రజ్వీ బెదిరించాడు. ముస్లిం జనం జయ జయ ధ్వానాలతో ఆమోదించింది

ఫలితంగా నిజాం "ప్రభువు" శ్రీ కె. యం. మున్షీని మకాం మార్చవలసిందని ఆదేశించాడు. బొలారంలో నివాసం ఏర్పర్చుకోమని హుకుం జారీచేశాడు. రెసిడెన్సీ భవనంలో పోలీసు ప్రధాన కార్యాలయం వెలిసింది. ఇది ఒకవిధంగా కాసింరజ్వీకి రాజకీయమైన విజయం. నిజాంరజ్వీల ఎత్తుగడలలో యిది మరొక మెట్టు.

## పూర్వ చరిత్ర :

1947 నాటి పరిస్థితి ననుసరించి ఇండియా ప్రభుత్వం ఆనాటి సంస్థానాలకు ఒక సౌకర్యాన్ని కలుగజేసింది. భారత్‌లో లేక పాకిస్థాన్‌లో విలీనం కాదలచుకొనని సంస్థానాలు స్వతంత్రంగా వుండవచ్చుననే సౌకర్యం అది. ఈ మిషతో నిజాం తన హైదరాబాద్ సంస్థానాన్ని సర్వ స్వతంత్రంగా నిలుపుకోవాలని పన్నాగం పన్నాడు.



వందేమాతరం రామచంద్రరావు

కాని నిజాం చరిత్ర మరో చారిత్రకసత్యాన్ని వెల్లడించింది. గతంలో ప్రతిసామ్రాజ్యశక్తి యెదుట నిజాం రాచరికం మోకరిల్లింది తొలుత మరాఠా, ఆ తరువాత ఫ్రెంచి– చివరకు ఇంగ్లీషువాళ్లకు నమ్మినబంటుగా వ్యవహరించాడు. ఇంగ్లీషు సామ్రాజ్యం భారతదేశంలో అస్తమిస్తున్నప్పుడు నిజాం తమను అసహాయులనుగా వదలి వెళ్లిపోవద్దని ఇంగ్లీషువాళ్ళను వేడుకొనడం దీనికి పరాకాష్ఠ.

శీఘ్రగతిని మారిపోతున్న రాజకీయ పరిస్థితులలో నిజాం తనమతం అనే ముసుగులో స్వతంత్రంగా వుండాలని తీవ్రప్రయత్నాలు ప్రారంభించాడు. ఆయనయొక్క ఇస్లాం మూఢభక్తి, రాచరికమైన కటుత్వం అతనే రచించిన యీ పద్యపాదాలలో వ్యక్తమౌతుంది.

"సలాతీనే సల్ఫసబ్ హోగయే నజరె అజల్ ఉస్మాన్
ముసల్మానోంకా తేరీ సల్తనత్ సేహై నిశాన్ బాకి"

(ఇస్లాం సామ్రాజ్యాలు రాజకీయ పరిణామాలకు బలిఅయిపోయాయి కాని ఈనాడు హే ఉస్మాన్ నీ రాజ్యమే ముస్లింలకు గుర్తుగా మిగిలిపోయింది.)

"బంద్ నాఖూస్ హువా సున్‌కే నారహే తకిబీర్
జిల్‌జిలా ఆహీ గయా రిశ్తఏ జున్నార్‌పర్."



ఎ. రామారావు

(అల్లాహో అక్బర్ ఉద్ఘోషవల్ల శంఖనాదాలు ఆగిపోయాయి. యజ్ఞోపవీతాలు ధరించిన వాళ్ళపై ప్రళయం వచ్చినట్లుంది.

స్వతంత్ర భారత్‌లో విలీనం కావడం తనకు అవమానమని రాచరిక గౌరవానికి భంగకరమని భావించాడు. నిజాం రాజ్యాంగ సలహాలకోసం ప్రత్యేకించి ఇంగ్లండ్‌నుండి ప్రఖ్యాత న్యాయవాది మాలకన్‌ను అన్ని ఖర్చులు భరించి పిలిపించాడు. అతనికి ప్రతిరోజు ఫీజు కింద విడిగా లక్షరూపాయలు చెల్లించాడు. తన పన్నాగానికి ఆధారంగా ముస్లిం ప్రజల్లో ఇస్లాం మతావేశాన్ని రేకెత్తించాడు. తన సంస్థానంచుట్టూ స్వతంత్ర భారత రాష్ట్రాలు వుండడం ప్రమాదకరం. కాబట్టి తనకు రేవుపట్టణం అవసరం. అందుకు పోర్చుగీసు ప్రభుత్వం నుండి గోవాను ఖరీదు చేయాలనే ఆలోచనకూడా చేశాడు.

తన కాంక్షలకు వ్యతిరేకంగావున్న భారత ప్రభుత్వ వైఖరిని నిజాం గ్రహించాడు. తనకంటే ఎన్నోరెట్లు శక్తివంతమైన భారతసైన్యంతో తలపడటం సాధ్యంకాదు. అందువల్ల కొత్త ప్రయత్నాలు ప్రారంభించాడు.

గెరిల్లా పోరాటపద్ధతిలో భారతసైన్యాన్ని ఎదుర్కోడానికి తనసైనికుల సంఖ్యను పెంచసాగాడు. అవసరమైన ఆయుధాలను విదేశాల నుండి తెప్పించుకోవాలని తన సంస్థానంలోనే కొన్ని ఆయుధాలను తయారుచేసుకోవాలని నిర్ణయించుకొన్నాడు. సెకండ్ ఫ్రంట్‌గా రజాకార్ల దళాన్ని

నిర్మించాడు. తన సరిహద్దుల రక్షణకు పఠాన్‌లను ప్రత్యేకించి చేర్చుకున్నాడు. విమానాలద్వారా రహస్యంగా ఆయుధాలు దిగుమతి చేసుకునే ఏర్పాట్లుచేసుకొన్నాడు. బీదర్, వరంగల్, రాయచూర్‌లలోని విమాన స్థావరాలను పునర్నిర్మించాడు.



అట్టిలర్ లక్ష్మినారాయణ్ సుభేదార్

హైద్రాబాద్ సంస్థానములో హిందువులసంఖ్యతో సమంగా ముస్లింల జనసంఖ్యను పెంచాలనే ఉద్దేశ్యంతో పొరుగు రాష్ట్రాల నుండి లక్షలాది ముస్లింలను యెన్నో ఆశలుచూపించి ఆకర్షించాడు. మతం మార్పిడిని ప్రోత్సహించాడు. హరిజనులకు – సవర్ణులకు మధ్య తగాదాలు సృష్టించి, హరిజనులకు – హిందువులకు మధ్యలో కల్లోలాలను సృష్టించాడు. రజాకార్లు ఇష్టానుసారం దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలు చేయడం ప్రారంభించారు.

నిజాం తన మంత్రివర్గంలో విశ్వాసపాత్రులైన హిందువులను ఉంచాడు. భారత ప్రభుత్వం అనుకూలంగా యెన్ని సూచనలు చేసినా తిరస్కరించి తన పన్నాగాలు కొనసాగించాడు.

## ఏజంట్ జనరల్ :

ఈలోగా భారత ప్రభుత్వం తన ప్రతినిధిగా ఏజంట్ జనరల్ హోదాలో శ్రీ కె. యం. మున్షీని హైద్రాబాద్ పంపించింది. ఆయనపట్ల నిజాం వ్యవహరించిన తీరు ముందే తెలుసుకున్నాం. మున్షీ అసలు అంతర్థాన్ని పసి

చీఫ్ ఆర్మర్ హీరాలాల్

గట్టారు. స్థానికంగా వున్న కొందరు యువకుల సహాయంతో నిజాం చేస్తున్న పన్నాగాలను బట్టబయలు చేయాలని నిశ్చయించుకున్నారు. హైద్రాబాద్‌లో అప్పుడు న్యాయవాదిగా వున్న శ్రీ వినాయకరావ్ విద్యాలంకార్ ప్లీడర్ ప్రొటెక్ట్ కమిటీ అధ్యక్షులు. ఆయనతో మున్షీ గారు సలహాసంప్రదింపులు జరిపారు. నిజాం వ్యవహారాన్ని, రహస్యాల్ని లాగడానికి గూఢచారులుగా శ్రీ వందేమాతరం సోదరుల్ని ఉపయోగించుకొనడం సముచితంగా వుండగలదని శ్రీ వినాయకరావు సూచించారు. వందేమాతరం సోదరులలో శ్రీ వీరభద్రరావు పెద్దవారు. తమ్ముడు శ్రీరామచంద్రరావు. ఒకసారి ఆయన 'వందేమాతరం' అని నినాదం చేసినందుకు నిజాం పోలీసులు బెత్తంతో కొట్టారు. అయినా రామచంద్రరావుగారు ఆపకుండా ప్రతి బెత్తం దెబ్బకు 'వందేమాతరం' అంటూ స్పృహతప్పిపోయేవరకు దెబ్బలు తిన్నారు. ఆనాటినుండి ఆయన 'వందేమాతరం రామచంద్రరావు'గా ప్రసిద్ధి చెందారు.

వరంగల్ దగ్గరలోనున్న మామ్‌నూర్ ప్రాంతంలో విమానాలు దిగడానికి చిన్న స్థలం ఉండేది. దట్టంగా అలుముకున్న చీకట్లో దూరంగా పొలంలో గుడిసెలో యువకుడైన రైతు యింకా మేల్కొనేవున్నాడు. అర్ధరాత్రి-అంతా నిశ్శబ్దం, ఎయిర్‌స్ట్రిప్‌దగ్గర మాత్రం దీపాలు వెలుగుతున్నాయి.

అంతలో ఆకాశంలో విమానం చప్పుడు, ఆ విమానం స్థావరంలో దిగుతుండగా యీ రైతు యువకుడు కంబళి కప్పుకొని స్థావరం దగ్గరగా పాకుతూ మొత్తం దృశ్యాన్ని చూచాడు. విమానంలోంచి రకరకాల ఆయుధాలను క్రిందికి దించి అక్కడే సిద్ధంగావున్న ట్రక్కులలో నింపారు. ఆ తర్వాత ఆ ట్రక్కు హైద్రాబాద్‌వైపు సాగిపోయింది.

నిజాం రహస్యంగా ఆయుధాలు కొన్ని తెప్పించుకుంటున్నాడనే వదంతి నిజమని రూఢిఅయింది. సముద్రపు దొంగ అని పేరుమోసిన ఇంగ్లీషు నావికుడు సిడ్నీకాటన్ రహస్యంగా ఆయుధాలను తన నౌకలో పశ్చిమ పాకిస్తాన్, గోవాలగుండా తీసుకొచ్చి ఆ తర్వాత విమానాలద్వారా బీదర్, వరంగల్ స్థావరాలకు చేర్చేవాడు. అక్కడనుండి ట్రక్కులలో హైద్రాబాద్‌కు ఆయుధాలు చేరేవి.

వరంగల్ ఎయిర్‌స్ట్రిప్ దగ్గర రాత్రి జాగారం చేస్తూ కూపీ లాగుతున్న రైతుయువకుడు అసలు విద్యార్థి. అతడే శ్రీ ఎ. రామారావు. ప్రాణాలకు తెగించి యీ రహస్యాలను లాగుతూ అతను మారుపేరుతో ఉత్తరాల ద్వారా హైద్రాబాద్‌కు సాంకేతిక భాషలో సమాచారం అందజేసేవాడు. శ్రీ రామారావు చూడడమే కాకుండా విమానస్థావరం ఉద్యోగుల్ని కొందరిని కలుసుకొని వివరాలు సేకరించేవాడు. అదేవిధంగా రాయచూర్ విమాన స్థావరం దగ్గర శ్రీ టి. రాజగోపాలాచార్య అనే విద్యార్థి యీ రహస్యాలను సేకరించేవాడు.

ఇక్కడ హైద్రాబాద్‌లోని భికాజీపటేల్ అనే న్యాయవాది చిరునామాపై ఎల్. ఎన్. సింగ్ అనే పధ్నాలుగేళ్ళ కుర్రవాడికి ఉత్తరాలు వస్తుండేవి. పోస్టుమన్ వచ్చేసమయానికి శ్రీ వందేమాతరం అక్కడే ఒక పేపర్లు అమ్మే దుకాణంలో కూచొని వుండేవారు. సింగ్‌వెళ్ళి తన ఉత్తరాలు తీసుకొచ్చేవాడు. ఆ ఉత్తరాలు వరంగల్‌నుండి శ్రీ రామారావు వ్రాసినవే

శ్రీ ఎల్. ఎన్. సింగ్, శ్రీ రామారావులు కలిసి నాసిక్‌లోని భోంసా మిలిట్రీ స్కూలు నిర్వహించిన క్యాంప్‌లో శిక్షణపొందిన విప్లవవీరులు ఎల్. ఎన్. సింగ్ మామూలుగా నిక్కర్ వేసుకొని ఒక్కోసారి బొలారంవరకూ కాలినడకన వెళ్ళేవాడు. వందేమాతరం అందించిన సమాచారాన్ని మున్షీ స్థావరానికి చేర్చేవాడు.

మొదట్లో బీదర్ దగ్గరవున్న పాపనాస్ ఎయిర్‌స్ట్రిప్‌లో సిడ్నీకాటన్ తన విమానాలద్వారా ఆయుధాలు దింపేవాడు. కాని ఒకరోజు స్నేహితుడైన తన విమాన పైలట్‌తో కాటన్‌కు తగాదా వచ్చింది. ఆ పైలట్‌ను నిజాం అరెస్టుచేసి అక్కడే కాల్పించాడు.

నిజాం సైన్యంలో వివిధ హోదాలలో పనిచేస్తున్న అనేకమంది హిందువులు సైనిక రహస్యాలను వందేమాతరంకు అందజేస్తుండేవారు. గవర్నర్ హోదాలోవున్న శ్రీ లక్ష్మినారాయణ ఒక ముఖ్యమైన వార్తను అందజేశాడు. పాప్‌నాస్ విమానస్థావరంలో 30—ఎం. ఎం. ఒ. టి. ఎయిర్ క్రాఫ్టుగన్‌ను దిగుమతి చేసుకున్నారనే అంశం అది. ఇక మిగతా హిందూ ఉన్నత సైనికాధికారులు ఆనాటి పరిస్థితుల్లో భయంవల్ల సమాచారం అందజేసేవారు కాదు. అయినా లెఫ్టినెంట్ కల్నల్ సుదర్శన్‌సింగ్ అనే ఒక్క శిక్కు అధికారి వీలున్నప్పుడల్లా రహస్యాలు చెప్పేవాడు. నిజాం సైన్యంలో అంత పెద్ద హోదాలోవున్న యీ అధికారి ఈనాడు స్వతంత్ర భారతదేశంలో సైకిల్‌పై తిరుగుతూ జీవిస్తున్నాడు.

సాహసంతో ముందుకువచ్చి దేశభక్తితో తమ కర్తవ్యాన్ని నిర్వహించిన విద్యార్థి విప్లవవీరులు శ్రీ ఎ. రామారావు, శ్రీ ఎల్. ఎన్. సింగ్‌లు హైద్రాబాద్ విముక్తి తర్వాత పోలీసు శాఖలో చేరదలచుకున్నారు. వాళ్ళిద్దరిని మొదట సబ్‌ఇన్‌స్పెక్టర్ల హోదాకు ఎన్నుకున్నారు. ఆ తర్వాత వాళ్ళ పూర్వచరిత్ర కారణంగా అధికార్లు ఉద్యోగం ఇవ్వలేదు. నిరుద్యోగా

నికి గురై కొంతకాలం తర్వాత శ్రీ రామారావు క్షయవ్యాధితో బాధపడి నప్పుడు కూడా చికిత్సా సౌకర్యాలు సమకూరలేదు. ఈరోజు అతను కరీం నగర్ జిల్లాలో యెక్కడో కుట్టుమిషన్ ద్వారా జీవితాన్ని గడుపుకుంటు న్నాడు. దేశభక్తికి విప్లవ కార్యకలాపాలకు ప్రతిఫలాన్ని ఆశించడం కాదు, కాని ఈ విప్లవ వీరులపట్ల ప్రభుత్వం ప్రజలు నిర్లక్ష్యం చూపడమే బాధాకరమైన అంశం.

శ్రీ వందేమాతరం తన రహస్య కార్యకలాపాలద్వారా యెంతో విలువైన సమాచారాన్ని మున్షీ గార్కి అందజేస్తూవచ్చాడు. శ్రీ మున్షీ వద్ద అసిస్టెంట్ సెక్రటరీగా పనిచేస్తున్న శ్రీ వెంకటవర్ధన్ అయ్యంగార్ స్వయ ముగా కారులోవచ్చి రహస్యంగా శ్రీ వందేమాతరాన్ని కలుసుకొనేవారు. అప్పుడప్పుడు శ్రీ వినాయకరావు ఇంట్లోనే సమాచారం అందించేవారు. నిజాం ఆర్డినెన్సు డిపో ఆయుధ కర్మాగారంలో టైపిస్టుగా పనిచేసిన శ్రీ భారత్‌సింగ్ స్వయంగా ఆ కర్మాగారానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్త రాలు కార్బన్ కాపీలను తీసుకువచ్చి ఒక నిర్ణీత స్థలంలో వందేమాతరంకు అందజేస్తుండేవాడు. నిజాం తన ఆయుధ కర్మాగారానికి కావలసిన ఇను మును, ఉక్కును అనేక మార్గాలద్వారా సమకూర్చేవాడు. హైద్రాబాద్‌లో వున్న ఇనుము వ్యాపారస్తులైన హిందువులద్వారా ఆ పని చేయించేవాడు. హిందూ వ్యాపారులు డబ్బు కక్కుర్తికి వ్యాపారం పేరుతో భారత ప్రభు త్వాన్ని మోసంచేసి ఇనుము-ఉక్కు వగైరా సరఫరా చేసేవారు. ఆర్డినెన్స్ స్టోరులోవుండే ఆయుధాల వివరాలు చీఫ్ అడ్మిరల్ హీరాలాల్‌ద్వారా తెలుస్తూ వుండేది. ఆర్టిలరీ విభాగంలో పనిచేసిన సుబేదార్ లక్ష్మినారాయణ హవల్దార్ శివరాం సింగ్‌లు యాంటీఎయిర్ క్రాఫ్టుగన్‌ను ఉపయోగించే శిక్షణపొందారు. ఈ విషయాన్ని శ్రీ లక్ష్మినారాయణ స్వయంగా వెల్లడిచేశాడు. ఇతను నిజాం ఆర్టిలరీలోవుంటూ తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. పోలీసు

చర్య జరగబోయే సమయంలో షోలాపూర్ ఫ్రంట్‌నుండి నిజాం సైన్యం వెనక్కి వస్తున్న పరిస్థితి. ఆ పరిస్థితిలో నిజాం సైన్యంలో గందరగోళం ఆవరించింది. ఆ అవకాశాన్ని వినియోదించుకొని శ్రీ లక్ష్మీనారాయణ విధ్వంసక ఫిరంగిని భారత విమానాలకు గురిపెట్టినా ఎప్పుడూ పేల్చలేదు.

నిజాం ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలో ఆనాడు తయారవుతున్న కొన్ని ఆయుధాల వివరాలు అత్యవసరంగా కావలసివచ్చాయి. ముఖ్యంగా 19–మిల్స్ హాండ్ గ్రైనేడ్స్, జపనీస్ టైప్-303 రైఫిళ్ళ వివరాలు వాటి నకళ్ళతో సహా అవసరమైనాయి. శ్రీ వందేమాతరం స్వయంగా తమ ప్రాణాలతో చెలగాటమాడాలని నిశ్చయించుకున్నారు. మిలట్రీ యూనిఫారం ధరించి వందేమాతరం అన్ని జాగ్రత్తలతో బయల్దేరారు. తోడుగా నిజాం మిలట్రీలో పనిచేస్తున్న ఇద్దరు సైనికులు జగన్నాథ్, గణేష్ సింగ్‌లు వెళ్ళారు. ఫ్యాక్టరీలోకి వెళ్ళాలంటే కోడ్‌వర్డ్ ఉపయోగించవలసివుంటుంది. ఆనాటి వర్డ్ "బోంబే" ఈలాంటి జాగ్రత్తలన్నీ తీసుకొని వందేమాతరంగారు ఫ్యాక్టరీలో ప్రవేశించారు. ఎంతో నేర్పుతో ధైర్యంగా లోపల తమ కార్యక్రమాన్ని కొనసాగించారు.

దాదాపు మూడు గంటలపాటు లోపల వుండిపోయారు. అడ్మిరల్ శ్రీ హీరాలాల్ సహాయంతో లోపలి వివరాలు ఆయన సేకరించారు. నిజాం భారీ ఎత్తున చేస్తున్న సైనిక సన్నాహాలను శ్రీ వందేమాతరం సవివరంగా ఏజంట్ జనరల్ శ్రీ కె. యం. మున్షీకి అందజేశారు. తత్ఫలితంగా భారత ప్రభుత్వం పోలీసు చర్యతీసుకోవాలన్న నిర్ణయానికి వచ్చినది.

# 4. రక్తరంజితమైన భైరవుని పల్లె

రజాకార్లు తెలంగాణా లోని అనేక గ్రామాలపైబడి దోపిడీలు, మానభంగాలు, హత్యలు కొనసాగిస్తున్న ఆ భయంకర వాతావరణంలో అక్కడక్కడ ప్రజలు ధైర్యాన్ని కూడ గట్టుకొని ఎదురు తిరిగారు. ఆ సమయంలోనే నిజాం ప్రభుత్వం ప్రజలను మభ్యపెట్టటానికి "శాంతి సంఘాలు" అనే వాటిని ఏర్పరచి హిందువుల కళ్ళు కప్ప ప్రయత్నించింది. జనగామలోని ఇలాంటి శాంతి సంఘంలోనే పరిశ్రమల శాఖ సూపర్‌వైజర్ శ్రీ. ఎం. ఎన్. రెడ్డి: వ్యవసాయశాఖ సూపర్‌వైజర్ శ్రీ శఠగోపాచార్యులు ఇద్దరూ సభ్యులు. ఈ సంఘాలలో హిందువులు కూడా ఉన్నారని నమ్మించడానికి ఈతతంగం జరుగుతుండేది.

అయితే హిందూసభ్యులునోరెత్తి రజాకార్లకు వ్యతిరేకంగా ఫిర్యాదు చేస్తే ప్రాణాలతో మిగలడం కష్టం. ఒకసారి శ్రీ శఠగోపాచార్యులు శాంతి సంఘ సమావేశంలో మితిమీరి పోతున్న రజాకార్ల చర్యలను ఖండిం

చారు. మరుసటి రోజు ఆయనను జనగామ సిద్ధిపేట దారిలోకి తీసికెళ్ళి కాల్చే శారు. శ్రీ ఎం. ఎన్. రెడ్డి నమ్రతతో ఈ ఆగడం గురించిఫిర్యాదు చేశారు. కాని ఆయనను కూడా తుపాకీతో కాల్చే స్తామని అధికార్లు బెదిరించారు. ఆ రోజుల్లో తిప్పర్తి ప్రాంతంలో ముస్లిం అధికారులు సివిల్ మిలటరీ అనే బేధభావం లేకుండా ఆయుధాల అభ్యాసం చేస్తుండేవాళ్ళు. హిందువులకు కాల్పులలో తర్ఫీదు ఇచ్చి హిందువులనే హత్యచేయించేవారు.

## సజీవ దహనాలు :

గ్రామాల్లో "శాంతిసంఘాలు" స్థాపించి ప్రజలకు రక్షణ కల్పిస్తామని నిజాం ప్రచారం చేస్తుండేవాడు. కాని ఆ శాంతి స్థాపన ఎంత భయానకంగా జరుగుతుండేదో శ్రీ ఎం. ఎన్. రెడ్డి ఒక సంఘటన ద్వారా వివరించి చెప్పారు. ఒకరోజు ఆయన కొడకండ్ల, రంగాపూర్ మార్గం గుండా వెడుతున్నాడు. ఒకచోట చింతచెట్టుకు అయిదు శవాలు వ్రేలాడుతున్న దృశ్యం కనపడింది. ఆయన వెంటనే దగ్గర్లోవున్న గ్రామ వాసులను అడిగి అసలు విషయాన్ని తెలుసుకున్నారు. శవాలు వ్రేలాడుతున్న ప్రాంతం ఇనసూర్ పోలీసుస్టేషన్‌కు సుమారు 6 కి.మీ. (4 మై.) ల దూరంలో ఉండేది. ఆ అయిదు శవాలు బ్రాహ్మణులవి. అంతకు క్రిందటిరోజే శ్రాద్ధ భోజనంచేసి ఏడుగురు బ్రాహ్మణులు తిరిగి వస్తున్నారు. త్రోవలో శాంతిని సంరక్షిస్తున్న రజాకార్ల ముఠా ఒకటి ఎదురైంది. ఆ ఏడుగుర్ని పట్టుకున్నారు. ఇద్దరు బ్రాహ్మణులు మాత్రం తప్పించుకొని పారిపోయారు. మిగిలిన ఐదుగురు ప్రభుత్వం ఏజంట్లని రజాకార్లు నిర్ధారణ చేసికొన్నారు. ఆ ఐదుగుర్నీ వరుసగా చింతచెట్టు కొమ్మకు వ్రేలాడదీశారు. కట్టిన లావాటి తాడు కాలకుండా కింద మంటలుపెట్టారు. ఆ మంటల్లో కాలి మాడి ఉడికి ఆ అమాయకులైన బ్రాహ్మణులు ప్రాణాలు వదిలారు. మిగతా హిందువులకు గుణపాఠంలా వుండాలని ఆ శవాలను అలాగే వేలాడదీసి రజాకార్లు వెళ్ళిపోయారు. ఆ

బ్రాహ్మణుల్లో ముగ్గురి నడుములకు ఉన్న వెండి మొలత్రాళ్ళు కాలి, వంకిపోయాయి. వాళ్ళకు సంభావనగా లభించిన వెండిరూపాయిలు బూడిదలో దొరికాయి.ధోవతులు కాలి శవాలు నల్లగా మసిబారి భయంకరంగా కనబడుతున్న ఆ అమానుషమైన దృశ్యం చూసి ప్రజలు వణికిపోయారు.

## రాక్షసరాజ్యం :

రజాకార్ల ఈ పైశాచిక కృత్యాలు 1857 లో నీల్ చేసిన దురంతాలను మించిపోయాయి. బ్రిటిష్ సైనికాధికారి నీల్ భారతీయుల్ని చెట్లకు వ్రేలాడదీసి ఉరితీసేవాడు. ఫిరంగులకు కట్టి ప్రేల్చివేసేవాడు. కాని ఇలా మంటల్లోకాల్చి భయంకరంగా చంపిన సంఘటనలులేవు. ఈ రాక్షసకృత్యాలు రజాకార్ల ప్రత్యేకతను నిరూపించాయి. చివరికి రాక్షసులుకూడా ఇలాంటి పనులను ఊహించి చేసేవాళ్ళు కారేమో!

రజాకార్లు-ప్రభుత్వ ఉద్యోగులు కలిసి రాత్రిపూట గ్రామాలపై బడి దోచుకునేవాళ్ళు. ఎలాంటి దయాదాక్షిణ్యాలు ఉండేవి కావు. ఆడవాళ్ళ ముక్కుపోగులు చెవుల కమ్మలు లాగి వాళ్ళ ముక్కులు, చెవులు తెగినా లెక్కచేయక దోచుకునేవాళ్ళు. ఆ రక్త సిక్తమైన భూషణాలను మూటలు గట్టి ఎం. ఎన్. రెడ్డి కార్యాలయంలోని టేబిళ్ళ క్రింద పడవేసేవారు. ఉదయమే అందరూ పంచుకునేవారు. ఈ దోపిడీ పట్ల అభ్యంతరం చెప్పినా ప్రయోజనం ఉండేది కాదు. అందువల్ల ఎం. ఎన్. రెడ్డి లాంటి ఉద్యోగులు కుమిలి పోతుండేవారు. హిందువులు ఈ దుష్కృత్యాలను ఖండించినా ప్రభుత్వం తిరుగుబాటు అనే పేరుతో, శాంతి స్థాపన అనే నెపంతో క్రూరంగా హిందువులనే అణచివేస్తుండేది.

ఆ రోజుల్లో భైరవునిపల్లి(భైరోనిపల్లి) నల్గొండ జిల్లాలో ఉండేది.ఈనాడు ఇది వరంగల్ జిల్లాలో అంతర్భాగం. ఈ గ్రామం చెరియాలకు



ఇమ్మడి రాజిరెడ్డి.

సుమారు 12 మైళ్ళ దూరంలో ఉంది. వరంగల్ - నల్గొండ - మెదక్ - కరీంనగర్ జిల్లాలు కలిసే సరిహద్దుల మధ్య ఈ గ్రామం ఉంది. అయితే గ్రామంలోకి ఈనాటికీ వెళ్ళడానికి పక్కా రోడ్డు లేదు.

ఈ భైరవునిపల్లి ప్రజలు ఆనాడు రజాకార్లను ప్రతిఘటించి తమ ఆత్మాభిమానాన్ని నిరూపించుకున్నారు. నాడు నాయకత్వం వహించిన ఆ గ్రామ నివాసి శ్రీ ఇమ్మడి రాజిరెడ్డి నేటికీ సజీవులుగా ఉన్నారు. ఆయన మాటల్లో చెప్పాలంటే 'రజాకార్లు మజాకార్లుగా తయారై' యథేచ్ఛగా గ్రామాలను దోచుకునేవాళ్ళు. తగులబెట్టేవాళ్ళు. చందాల పేరుతో డబ్బులు వసూలు చేసేవారు. ఇవ్వని గ్రామాలపై దాడిచేసి — దోచి — తగులబెట్టి కసి తీర్చుకునేవాళ్ళు.

భైరవునిపల్లెకు పశ్చిమంగా ఉన్న లింగాపూర్ గ్రామానికి ఒక రోజు పగటిపూటనే రజాకార్లు నిప్పుఅంటించారు. ఈవార్త విని భైరవునిపల్లి వాస్తవ్యులు శ్రీయుతులు ఇమ్మడి రాజిరెడ్డి, వంగాల అనంతరామరెడ్డి, మగుటం రామయ్య తదితరులు పది మంది కుండలు వగైరా తీసుకొని లింగాపూర్ బయలుదేరారు. ధూళిమిట్ట నివాసి శ్రీ దుబ్బుల రామచంద్రారెడ్డిని కూడా సహాయం రమ్మని కబురు పంపారు. వీళ్ళు అందరు వెళ్ళేసరికి రజాకార్లు గ్రామంలోనే దోపిడి సాగిస్తున్నారు. ధూళిమిట్టనుండి ముప్ఫైమంది కర్రలు-

గొడ్డళ్ళు తీసుకుని వచ్చేసారు. గ్రామంలో ఎదురుపోరాటం మంచిది కాదని అక్కడే పొలిమేరల్లో ఆగిపోయారు రజాకార్లు దోపిడీ సామగ్రిని బళ్ళలో వేసుకుని నినాదాలు చేసుకుంటూ వచ్చారు. వెంటనే రాజిరెడ్డి బృందం కేకలు వేసుకుంటూ వెంటాడింది. మొదట రజాకార్లు కాల్పులు సాగించారు. అయినా నిర్భయంగా వెంటాడుతున్న గ్రామస్థులనుచూసి రజాకార్లు బెదిరిపోయి పారిపోవడం మొదలుపెట్టారు. కొందరు రజాకార్ల పైజమాలు భయంతో తడిసిపోయినాయి. దోచుకున్న సామాను నాలుగు బళ్ళతోసహా గ్రామస్థులకు చేజిక్కింది.

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజుల తర్వాత మద్దూరుకు చెందిన రజాకార్లు ఆ నాలుగుబళ్ళను తిరిగి యిమ్మని కబురు చేశారు. భైరవునిపల్లి ప్రజలు తిరస్కరించారు. అపుడు రజాకార్లు ఆ ప్రాంతం పోలీసు అమీన్‌కు ఫిర్యాదు చేశారు. అమీన్ ఇమ్మడి రాజిరెడ్డిని పిలిపించాడు. రాజిరెడ్డి ఆ గ్రామం పోలీసు పటేల్‌కూడా కావడంతో వెళ్ళకతప్పలేదు. వెళ్ళి పరిస్థితి నంతా చెప్పారు. తానే స్వయంగా విచారించగలనని అమీన్ హామీయిచ్చి పంపాడు.

ఆ తర్వాత ఇమ్మడి రాజిరెడ్డి; ఆయన మిత్రులు తమ గ్రామాన్ని చుట్టుప్రక్కల ఇతర గ్రామాలను సంరక్షించుకునే ప్రయత్నాలు సాగించారు. భైరవునిపల్లి గ్రామానికి 12 వందలరూపాయలు చందా ఇమ్మని తాఖీదు పంపారు రజాకార్లు.

భైరవునిపల్లి గ్రామం చుట్టూ కోటగోడ ఉండేది. ఈ గోడకి పెద్ద ఎత్తయిన బురుజుండేది. సురక్షితంగా ఎత్తుగా ఉన్న ఈ బురుజు భైరవునిపల్లి గ్రామానికి ఎంతో మేలుచేసింది. ఇదేబురుజుపైన మందుగుండు సామగ్రి వగైరా సేకరించి ఇరువదినాల్గు గంటలపాటు గ్రామస్థులలో ఇద్దరు తుపాకులు చేతబూని కాపలాకాస్తుండేవాళ్ళు. రజాకార్లు కనబడితే బురుజుపై



భైరవునిపల్లి బురుజు

మన్న నగారా మ్రోగించే వాళ్ళు. గ్రామస్థులు పనులు వదలి గ్రామరక్షణకు సిద్ధమయ్యేవారు. ఈ ఏర్పాట్లతో భైరవునిపల్లి గ్రామం దాడులను ఎదుర్కోడానికి సిద్ధంగా ఉంది. చుట్టుప్రక్కల ఉన్న ఆరేడు గ్రామాలను కూడా ఇలాగే తయారుచేసి రక్షణ దళాలను ఏర్పరచారు. యాభై మంది కర్రలతో, గొడ్డళ్ళతో సహా అన్ని గ్రామాల్లో తిరిగి ధైర్యం చెబుతుండేవారు. ఈ గ్రామాలలో వైర్‌లెస్ వార్తాహరుడిగా శ్రీ విశ్వనాథభట్ జోషి సైకిలుపై తిరుగుతూ తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించేవాడు. గ్రామాల పరిస్థితిని రైతులకు సమాచారంగా అందజేసేవాడు. ఈ పరిస్థితుల్లో మద్దూరు రజాకార్లు తాము కోల్పోయిన బల్కు సంపాదించుకోలేకపోయారు.

## రేవర్తి రజాకార్లు :

కొంత కాలం గడిచిన తర్వాత జనగామ రోడ్డుపై ఉన్న రేవర్తి గ్రామం నుండి రజాకార్లు బయలుదేరుతున్నారు. తుపాకులతో అన్నీ సిద్ధం చేసుకుని ఈ రజాకార్లు భైరవునిపల్లిపై దాడిచేయ యత్నించారు. వీళ్ళను చూడగానే నగారా మ్రోగించారు. బురుజుపైనుండి కాల్పులు ప్రారంభమైనాయి. రజాకార్లు తట్టుకోలేకపోయారు. పిక్కబలం చూపెడుతుండగా

గ్రామస్తులు వెంటబడి తరిమారు. దండాల కృష్ణయ్య అనే వ్యక్తి గాయపడి కూడా రజాకార్ల దగ్గర నుండి తుపాకీ లాక్కోగలిగాడు.

ఆ తిరువాత రజాకార్లు మళ్ళీ పోలీసు అమీన్‌తో ఫిర్యాదుచేశారు. ఈసారి ఆ అమీన్ స్వయంగా వచ్చి భైరవునిపల్లి తనిఖీచేశాడు. బురుజు పై ఉన్న మందుగుండు సామాగ్రి వగైరా చూసి వారితో ఇలా అన్నాడు. "మేముండగా మీకెందుకు ఈ ఏర్పాట్ల ఫికర్. కమ్యూనిస్టులను మేము ఎదుర్కొంటాము. మిమ్మల్ని రజాకార్లతో దోస్తీ చేయిస్తాం" అనిచెప్పి గ్రామంలోని తుపాకులను స్వాధీనం చేసుకున్నాడు. రాజిరెడ్డికి రేవర్తిలోని రజాకార్లకు రాజీ కుదిర్చాడు.

కొంత కాలం తర్వాత హైదరాబాద్ రియాసత్ ప్రధాన మంత్రి అయిన లాయక్ అలీ చిరియాల ప్రాంత పర్యటనకు వచ్చాడు. ఇమ్మడి రాజిరెడ్డి నాయకత్వాన వెయ్యిమంది గ్రామస్థులు వెళ్ళి రజాకార్ల దాడుల గురించి చెప్పారు. ఆయన అందరూ కలిసి మెలిసి ఉండాలని నీతులుచెప్పి వెళ్ళిపోయాడు. ఇక లాభంలేదని ఆ ప్రాంతాలలోని గ్రామీణులు తమ ఆత్మ రక్షణకు ఆయుధాలు వగైరా సేకరించటం మొదలు పెట్టారు. భైరవుని పల్లి బురుజుపై వల్లపట్ల రామచంద్రరావు దేశ్‌ముఖ్ నుండి సంపాదించిన ఫిరంగిని పెట్టారు. నాలుగైదు మణుగుల మందుగుండు సామగ్రి తయారుగా ఉండేది. అలాగే గ్రామంలోని కంసాలి ఇనుపగుండ్లను తయారుచేసేపని మొదలుపెట్టాడు.

బెక్కల్, ధూళిమిట్ట, తోరసాల్, జాలపల్లి, కొండాపూర్, కుటిగల్ సోలిపూర్, అంకుశీపూర్ తదితర గ్రామాలు తమ రక్షణ దళాలు ఏర్పాటు చేసుకున్నాయి. వీటన్నింటికి భైరవునిపల్లి కేంద్రబిందువుగా పనిచేస్తూ వచ్చింది. అందువల్ల ఆ గ్రామంపై రజాకార్లు తమ దృష్టిని కేంద్రీకరించారు. భువనగిరి డిప్యూటీ కలెక్టర్ హాషిం కూడా భైరవునిపల్లి గ్రామస్తు

లను తిరుగుబాటుదార్లుగా భావించి దాడి చేయటానికి సిద్ధపడ్డాడు. ఆ గ్రామస్థుల ధైర్యం తనకు సవాలుగా కనిపించింది.

## ఇక్బాల్ హాషిం ఓటమి:

ఈ డిప్యూటి కలెక్టర్ శాంతిస్థాపన నెపం తో తన పోలీసుబలగంతో గ్రామాలమీద పడ్డాడు. కొడకండ్ల గ్రామంలోని దాదాపు సల్ల భై నిర్దోషులను కాల్చి చంపేశాడు. తర్వాత 150 మంది గల తన ముఠాతో భైరవుని పల్లి చేరుకున్నాడు. బురుజు పైనుండి ఈ ముఠాను పసిగట్టిన కాపలాదారులు నగారా మ్రోగించారు. వెంటనే పైనుండి కాల్పులు కొనసాగాయి. మరో వైపునుండి చిన్నఫిరంగి కాల్పులకు హాషిం ముఠా తట్టుకోలేక పోయింది. ఉదయం పదిగంటలనుండి సాయంత్రంవరకు రెండు వైపులనుండి కాల్పులు కొనసాగాయి. ఎంత ప్రయత్నించినా హాషిం తన ముఠాతో ఆ గ్రామంలో ప్రవేశించలేక పోయాడు. ఎనిమిది గంటలపాటు సాగిన ఈ పోరాటంలో హాషిం ముఠా నలుగురు నిరాయుధులను మాత్రం చంపగలిగింది. తమ పక్షాన పదిహేను మందికిపైగా చనిపోయాక, వాళ్ళను ఎళ్ళపై వేసుకొని తిరుగుముఖం పట్టక తప్పలేదు. తనప్రయత్నం విఫలం కాగా హాషిం మరింత కసితో ఆ గ్రామాన్ని నేలమట్టం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

విజయవంతమైన తమ పోరాటం వల్ల భైరవుని పల్లి గ్రామస్థుల ధైర్యం మరింత పెరిగింది. రజాకార్ల ముఠాలను నిశ్చయంగా ఎదుర్కొనగలమనే ధీమా హెచ్చింది. అయితే నిజాం సైన్యం ముందు తాము నిలువగలమా ? అనే అంశాన్ని వాళ్లు తీవ్రంగా ఆలోచించలేదు. సైన్యం వచ్చి చుట్టుముట్టనున్నదనే వార్త తెలిసినా గ్రామం ఖాళీచేసి అడవుల్లోకి పారిపోవాలనే ఆలోచన వాళ్ళకు తట్టలేదు. తత్ఫలితంగానే భైరవుని పల్లి సర్వనాశనం కాక తప్పలేదు.

హైదరాబాద్ – వరంగల్ మార్గంలో ఉన్న జనగామ తాలుకా కేంద్రంలో నిజాం ప్రభుత్వంతాత్కాలికంగా మిలిటరీ క్యాంపు ఏర్పాటుచేసింది. నిజాం సైన్యంలోని ఒక మేజర్, ఇద్దరు కెప్టెన్‌లు తమ దళాలతో సహా వచ్చి విడిది చేశారు. మరో వైపునుండి సాయుధ పోలీసుదళం వచ్చింది. వరంగల్, నల్లగొండ డి.యస్.పి లు; వరంగల్‌కు చెందిన డి.జి. స్వయంగా వచ్చి, ఏర్పాట్లు చూశారు. రజాకార్ల ముఠా తమ నాయకులతో సిద్ధంగాఉంది. వరంగల్, మెదక్ సుబేదారులు (కమీషనర్‌లు) ఇక్బాల్ హాషిం, తమ బలగాలతో వచ్చి కలుసుకున్నారు.

ఇంత పెద్ద ఎత్తున సాగుతున్న సైనిక ఏర్పాట్లు చూసి జనగామ ప్రజలు భీతావహులై పోయారు. రోజురోజుకు పెరుగుతున్న రజాకార్ల అత్యాచారాలు, నిజాం ప్రభుత్వ దమనకాండ ప్రజలను నిస్సహాయుల్ని చేశాయి. ఏదో పెద్ద హత్యాకాండకు పన్నాగం పన్నుతున్నారనే విషయం స్పష్టమైంది. ఆ రాత్రి ట్రక్కుపై సామాన్లు వేసుకొని 500 మంది సైనికులు పోలీసులు, రజాకార్లు జనగామ నుండి సిద్ధిపేట వైపువెళ్ళే రోడ్డు మీదుగా బయలుదేరారు. వెంట 200 మందికి పైగా హిందూ, ముస్లిం సివిల్ అధి కారులు కూడా ఉన్నారు.

## అమానుషమైన నర సంహారం:

సూర్యాస్తమయం అవుతున్న వేళ. పల్లెప్రజలు ఇళ్ళకి తిరిగొస్తున్నప్పుడు చుట్టూరా ప్రశాంత వాతావరణం. వరిచేలు గాలికి రెపరెపలాడుతున్నాయి. గ్రామం ముందు బురుజు కాలం తాకిడికి తట్టుకొని ఆనాటికీ అజేయంగా నిలిచివుంది. గ్రామంలోకి ఆవులు, దూడలను తోలుకుని పశువుల కాపర్లు ఉత్సాహంతో వస్తున్నారు. బావులదగ్గరనీళ్ళు నింపుతూ ఆడవాళ్ళు

కబుర్లు చెప్పుకుంటున్నారు. రేపు ఉదయం జరగబోయే ప్రళయం ఆ సాయంత్రం ఎవరి ఊహకు తట్టలేదు.

భైరవుని పల్లి గ్రామస్థులలో వున్న ఐక్యత పెట్టనికోటగా రూపొందింది. చుట్టు ప్రక్కల గ్రామాలకు ఆ గ్రామస్థుల సాహసం, పట్టుదల ఆదర్శంగా కనబడింది. అనేక గ్రామాల్లో రజాకార్ల దురంతాలు మితిమీరి పోయినా ఈ గ్రామం పైకి మాత్రం రాలేక పోయినారు. నవాపేట్, నెలటోల, యశ్వంతపూర్, కోమల్లా, చింతకుంట, నీలిగొండ తదితర గ్రామాల్లో రజాకార్ల వల్ల జరిగిన మానభంగాలు దోపిళ్ళు, దహనాలు, హత్యలు, మామూలువార్తలై పోయినాయి. అయినాభైరవునిపల్లి ప్రజలు మాత్రంవీటి నుండి దూరంగా సురక్షితులమనే భావంతో నిద్రపోతున్నారు.

భైరవునిపల్లి ఆక్రమించాలని బయలుదేరిన నిజాం సైనికబలగం ముస్త్యాలగుండా వల్లపట్ల చేరుకుంది. వల్లపట్లనుండి సైన్యాన్ని మళ్ళించి మరోవైపునుండి భైరవునిపల్లిని చుట్టుముట్టమని ఆదేశించారు. గ్రామాన్ని అరమైలు పరిధిలో సైన్యం చుట్టుముట్టింది. ఉదయం నాలుగున్నర ప్రాంతంలో ఈ భారీఎత్తున ఉన్న బలం భైరవునిపల్లిమీద దాడికి సిద్ధంగా ఉంది. ఈలోగా ఊరి బయటకి కాలకృత్యం తీర్చుకోడానికి వచ్చిన ఒక వ్యక్తి ఈ సైన్యాన్ని చూసి అదిరి పోయాడు. ఆవ్యక్తి ఎవరోకాదు. ఆఊరి బ్రాహ్మణుడు విశ్వనాథ్ భట్ జోషి. ఆయనను షూట్ చేయాలని అధికారులు అన్నారు. అయితే వెంటవచ్చిన హిందూ అధికారి శ్రీ యమ్. యస్. రెడ్డి జోషిచేత మాట్లాడించి అమాయకుడైన బ్రాహ్మణుడనే విషయం స్పష్టంచేయ ప్రయత్నించాడు. ఈలోగా అక్కడే ఇద్దరుసైనికులు ఆగ్రామవాసి ఉల్యంగల వెంకటనరసయ్య అనే వ్యక్తిని పట్టు కొన్నారు. అతను విడిపించు కొని గ్రామంలోకి పరుగు లంకించుకున్నాడు.



ఊల్యంగల వెంకట నరసయ్య

మరునటిక్షణమే బురుజు పైవున్న నగారా మ్రోగింది. చిన్న ఫిరంగి కాల్పులు ప్రారంభమయ్యాయి. అయితే చుటుముట్టిన సైనిక బలగం దగ్గర పెద్ద ఫిరంగి వుంది. ఇటునుండి వరుసగా పదిమూడు గుళ్ళను సైనికులు పేల్చారు. ఈ ప్రేలుడు చప్పుడు చుట్టుప్రక్కల గ్రామాలకు వినబడింది. గ్రామంలోని అనేకప్రాంతాల్లో నిప్పుఅంటుకుంది. కొన్ని ఇళ్ళు కూలిపోయాయి. అప్పటికి బాగా వెలుగువచ్చేసింది. బురుజుపైన ఇద్దరుయువకులు లేచి నిలబడి చూస్తుండగానే గుండువచ్చితగిలింది. మగుటం రామయ్య, భూమయ్య అనే ఆ ఇద్దరు వ్యక్తులు అక్కడే కూలిపోయారు. బురుజుపైవున్న మందుగుండు సామాగ్రి అంటుకొని ప్రేలిపోయింది. అక్కడిగది వగైరా అంతాకూలి ముఖ్యమైన రక్షణ ధ్వంసమైపోయింది గ్రామస్తులు ఇది రజాకార్లదాడి కాదనే విషయాన్ని గ్రహించారు. ప్రతిఘటించి ప్రయోజనంలేదని బురుజు పైనుండి తెల్లజెండా చూపారు. అయినా నిజాంసైన్యం ఫిరంగి కాల్పులు జరుపుతూనే వచ్చింది. గ్రామంలోకి చొచ్చుకొని వస్తున్నసైనికులు అడవి జంతువులులాగా ప్రవర్తించారు. కనబడిన ప్రతి అమాయకుణ్ణీ షూట్ చేశారు. ఒకమూల నిలబడి సైనికులు పదిమంది యువకుల పైకి చేతిబాంబులువేసి చంపివేశారు. అందులోనే విశ్వనాథ్ భట్ జోషి తదితరులు ప్రాణాలుకోల్పోయారు. ఎంతోమంది నిరపరాధులైన గ్రామస్తులు హత్యచేయబడ్డారు.

అందులో అప్పుడే ప్రసవించిన తల్లికూడ ఉంది. తర్వాత శవాలను గుర్తిస్తున్నప్పుడు సజీవంగా వున్న శిశువు లభించింది. గ్రామంలోని ప్రతిఘటనా శక్తి సర్వస్వం నాశనమై పోయింది.

నిజాం ప్రభుత్వ అధికారులు, సైనికులు విజయోన్మాదంతో పాశవిక చర్యలకు దిగారు. నిజాంకు వ్యతిరేకంగా జరిగిన ఏదో పెద్ద తిరుగుబాటును అణచి వేశామనే గర్వంతో విర్రవీగుతూ భైరవునిపల్లిని నేలమట్టం చేశారు. ప్రతియింట్లోకి వెళ్ళి యువకులను ఏరి పశువుల్లా బంధించి తీసుకువచ్చారు. స్త్రీలను బలాత్కరించారు. ఇళ్ళను దోచుకున్నారు. గడ్డివాములను తగుల బెట్టారు. మత పిచ్చి ఎక్కి దుష్కృత్యాలు జరిపిన గూండాలకు ఈ నిజాం ప్రభుత్వం అధికారులకు మధ్య తేడాలేదు అనిపించింది.

ఊరు అవతలకి 92 మంది యువకులను పట్టితెచ్చి నిలబెట్టారు. వాళ్ళల్లో ఇద్దరు ముసలివాళ్ళు కూడా వున్నారు. అధికారులు తమ షూటింగ్ నైపుణ్యాన్ని పరీక్షించుకోడానికి సిద్ధమై నిల్చున్నారు. త్రీనాట్ త్రి రైఫిల్‌తో వరుసగా ఒకేసారి ఒకేగుండుతో ఎంతమందిని చంపవచ్చునో అంచనా వేసుకున్నారు. నాలుగు వరుసలలో ఒకరి వెనుక ఒకరిని నిలబెట్టారు. కట్టివేయబడిన యువకులు బలిపశువుల్లా నిలుచున్నారు. మొదట ఒక సైనికాధికారి కాల్పులు జరిపాడు. ఒకేగుండు వరుసగా నలుగురి శరీరాలగుండా దూసుకుపోయి మరోవైపు మళ్ళింది. ఫలితంగా ఆ నలుగరు యువకులు నేలకూలిపోయారు రెండోసారి ఒకపోలీసు అధికారి ఫైరింగ్ చేయగా ముగ్గురు చనిపోయారు. ఇక సివిల్ అధికారులు తమ బలాన్ని ప్రదర్శించుకోవడానికి ముందుకువచ్చారు. భువనగిరి డిప్యూటి కలెక్టర్ హాషిం కసితో ఎనిమిది మందిని కాల్చి చంపాడు. ఇద్దరు ముసలి వాళ్ళను వదలి దాదాపు అందరిని స్టెన్‌గన్‌తో కాల్చి హత్యచేశారు. ఈ దారుణ హత్యాకాండలో రజాకార్ల సర్వసైన్యాధికారియైన కాసింరజ్వీ ముఖ్య అనుచరుడైన



శవాలతో నిండిన బావి

మొహజ్జింహుస్సేన్ (నల్లగొండ కలెక్టర్) అత్యధికమైన భాగాన్ని పంచుకున్నాడు.

తర్వాత గ్రామంలోని హరిజనులను పిలిచి 90 మంది శవాలను నిరుపయోగంగా వున్న ఒక బావిలో పడవేయించి సామూహిక సమాధి చేశారు. గ్రామంలో చచ్చిన జనం ఈ లెక్కలోకి రాలేదు. 11 గంటల ప్రాంతంలో ఈ సైన్యం కుటిగల్ గ్రామం గుండా తిరుగు ప్రయాణం సాగించింది. ఆ గ్రామంలోని పట్వారీ నరసింహారావుతో సహా 25 మందినిహత్య చేశారు ఈ గ్రామం కూడా రక్షణ ఏర్పాట్లు చేసుకున్నదనే నేరంపై ఆ శిక్షను అధికారులు విధించారు. దాదాపు 15 మందిని క్రూరంగా హత్యచేసి సైన్యం దుమ్ములేపుకుంటూ వెళిపోయింది. వాతావరణం హాహాకారాలతో నిండిపోగా ఆకాశం మాత్రం "అలాహో అక్బర్", "షాహే ఉస్మాన్ జిందాబాద్'' అనే విజయనాదాలతో మార్మోగింది.

భైరవుని పల్లి ప్రజలకు నాయకత్వం వహించిన ఇమ్మడి రాజిరెడ్డి మాత్రం సజీవంగా మిగలడం ఆశ్చర్యకరమైన సంఘటన. ఆ దారుణ

హత్యాకాండ వివరాలను చెప్పడానికి ఈనాటికీ ఆ గ్రామంలోనే నిరాడంబరంగా జీవిస్తున్న రాజిరెడ్డిని నేను కలిసినప్పుడు ఆయన చెప్పిన వృత్తాంతం ఇది:

దాడి జరుగబోయే ముందురాత్రి ఇమ్మడి రాజిరెడ్డి తన చేను కాపలాకు వెళ్ళాడు. రాత్రి అక్కడే గడిపి ఉదయమే తిరిగివస్తుండగా ఫిరంగి కాల్పుల చప్పుడు వినబడింది. గ్రామంలోకి వెడదామంటే చుట్టూవున్న నిజాం సైన్యం తనను సులభంగా కాల్చివేయగలదు. గత్యంతరం లేక అసహాయుడిగా తన కళ్ళముందే తన గ్రామం సర్వనాశనాన్ని చూస్తూ వుండిపోయాడు. తాను మిగిలిపోవడం కేవలం దైవికమని అతని అభిప్రాయం.

నిజాం ప్రభుత్వంపై పోలీసు చర్య జరిగిన తర్వాత భైరవునిపల్లి ప్రజలకు ఆనాటి ప్రభుత్వం ఏదోకొంత చిన్న సహాయం చేసిందని కూడా ఆయన చెప్పాడు.

నేను భైరవునిపల్లి గ్రామాన్ని చూసి అక్కడి బురుజును పరిశీలించాను. చిత్రకారుడు శ్రీ నరేంద్రరాయ్ సహాయంతో ఫోటోలు తీసుకొని గ్రామం వెలుపలికి వచ్చి మైదానంలో నిలబడ్డాను. సర్వీసు బస్సుకోసం వేచి వున్నాము ఈలోగా మైదానంలో నిలుచున్న నాదగ్గరికి ఒక గ్రామవాసి వచ్చి నమస్కరించాడు. ఆనాడు జరిగిన దాడిలో తన తమ్ముడు సోమలింగం ప్రాణాలు కోల్పోయాడని, ఆ నాటి భీభత్సదృశ్యాన్ని వర్ణించి చెప్పాడు. ఒక మామూలు గ్రామవాసిగా తన అంతరంగాన్ని విప్పి చెబుతూ ఇలా అన్నాడు. "ఇక్కడ ఈ మైదానంలో రక్తపుటేరు పారింది. అయినా యీనాటికి ఆ బలిదానానికి స్మృతిగా ప్రభుత్వం ఒక చిహ్నాన్ని కూడా స్థాపించలేదు. అందరూ మరచిపోయారు. చివరికి ఆ దాడి జరిగిన తర్వాత నన్ను పోలీసులు యేదో నేరంపై నాలుగున్నర సంవత్సరాలు జైల్లో పెట్టారు. (పోలీసు చర్య జరిగిన తర్వాతకూడా) మా ఊరి ప్రజలు నన్ను విడిపించడానికి చందాలు వసూలు చేస్తామని వస్తే నా స్వాభిమానం దెబ్బ

తిన్నది. పందిగా పది సంవత్సరాలు బ్రతికేకన్నా నందిగా నాలుగు సంవత్స రాలు బ్రతకటమే గౌరవమని మా వాళ్ళకు చెప్పాను." ఆ గ్రామస్థుని మనో బలాన్ని చూసి నోటిమాట రాలేదు.

తిరుగుప్రయాణంలో అనుకోకుండా జనగామ రైల్వే స్టేషనులో ముస్త్యాల వాస్తవ్యుడైనా శ్రీ కె. హన్మంతరెడ్డితో పరిచయం కలిగింది. ఆయన మిగతా వివరాలు చెప్పారు. భైరవునిపల్లి, లింగాపూర్, గ్రామాలపై జరిగిన రాక్షసదాడులను చూసి జనగామ ప్రజలు నిజాం ప్రభుత్వాన్ని విపరీతంగా అసహ్యించుకున్నారు. కాని నిజాం మాత్రం విదే శాలనుండి పత్రికా విలేఖరులను వేల రూపాయలు ఖర్చుచేసి రప్పించి భైర వునిపల్లి సంఘటనలను మరో రకంగా వక్రంగా చిత్రించి విదేశాల్లో ప్రచారం చేశాడు. అసలు హిందువులే తిరగబడి దాడికి తలపడితే తాము శాంతిభద్రత లను కాపాడడానికి ఆ చర్య తీసుకున్నామని ప్రచారం చేశాడు. అయినా ప్రజల రక్తపాతం నిజాం అమానుషచర్యల నిజస్వరూపం ప్రపంచానికి బహిర్గతం కాక తప్పలేదు. జనగామ ప్రాంతపు ప్రజలు తమ కోపాన్ని వ్యక్తం చేయడానికి ఆనాడు జనగామ రోడ్డుమధ్యవున్న ఒక చిన్న వంతె నను కూలగొట్టారు. కాని తర్వాత నిజాం పోలీసులు ఆ వంతెన కూలిన ప్రాంతం దగ్గర్లోనేవున్న అమాయకులైన తొమ్మిది మంది రైతులను పొలాల్లో పనిచేస్తుండగా కాల్చివేశారు. వాళ్ళలో దారిన పోతూ నుయ్యిలో నీళ్ళు తాగి నిలుచున్న ఒక చాకలికూడా కాల్పులకు గురై పోయాడు. పోలీ సులు శవాలను లాక్కెళ్ళి పొలాలలోనే గడ్డివేసి దహనంచేశారు తమ తుపాకీ తూటాల వేడికి ప్రజల క్రోధం చల్లారిందని పోలీసులు భావించారు. కాని నిర్దోషులైన వేలాదిమంది ప్రజలు రక్తప్రవాహం నిజాం రాజ్యాన్ని కూలదోసింది. ఒక చిన్న వంతెనను కూల్చిన నేరానికి తొమ్మిది మంది నిరపరాధులైన ప్రజల ప్రాణాలు విలువ గట్టగలిగారో లేక ప్రజల రక్తం నిజాం నిరంకుశాధికారాన్ని శాశ్వతంగా సమాధిచేసి వేసిందో తర్వాత చరిత్రే నిరూపించింది.

# 5. రేణుకుంట అమరవీరుడు

తెలంగాణాలో రజాకార్ల దురంతాలను సాహసంతో ప్రతిఘటించిన అమరవీరులలో శ్రీ చింతపూడి రామిరెడ్డి ఒకరు. ఆయనవల్ల నల్లగొండ జిల్లాలోని గ్రామం రేణుకుంట హైదరాబాదు చరిత్రలో చిరకాలం నిలిచిపోయింది. భువనగిరి తాలూకాలో ఉన్న ఈ గ్రామానికి యాదగిరిగుట్ట మార్గంగా వెళ్ళవలసి వుంటుంది. ఈ నాటికీ సరియైన మార్గం లేనందువల్ల భువనగిరి నుండి 20 మైళ్ళు ప్రయాణంచేసి సర్వీసు బస్సు ద్వారా ఈ గ్రామం చేరడానికి దాదాపు రెండు గంటలు పట్టింది.

ఒకనాడు హైద్రాబాద్ రేడియో, ఆనాటి వార్తాపత్రికలు రేణుకుంట గురించి ఆగ్రామవాసి రామిరెడ్డి గురించి ప్రత్యేకించి వార్త ప్రకటించవలసి వచ్చింది. కొంతకాలం నిజాం సాయుధబలగాన్ని, రజాకార్ల దుండగాలను విజయవంతంగా అరికట్టిన రామిరెడ్డి గురించి ఈ నాటికి ప్రజలు చెప్పుకుంటూ వుంటారు. ఈ చుట్టుప్రక్కల గ్రామాల్లో బాలసంతులు అనే భిక్షుకులు రామిరెడ్డిగారి వీరగాథను గానంచేస్తూ తిరుగుతుంటారు. ప్రత్యక్షంగా ఆ గ్రామాన్ని అక్కడి ప్రజలను చూడాలనే ఉద్దేశంతో ఈ మధ్య అక్క-

డికి చిత్రకారుడు శ్రీ నరేంద్రరాయ్‌తో వెళ్ళాను. ఆనాడు రామిరెడ్డితో పాటు పోరాడిన గ్రామవాసులను కనుగొన్నాము.ఆనాటి గ్రామ రక్షణ దళంలో ప్రముఖ పాత్ర వహించిన మహ్మద్‌యాకూబ్‌అలీని నల్లూరులో కలసుకొని రామిరెడ్డి గురించి వాస్తవ వృత్తాంతాన్ని తెలుసుకున్నాము.

రేణుకుంటలో ఈనాడు మొత్తం 340 ఇళ్ళుఉన్నాయి. ఆ రోజుల్లో కేవలం 260 గడపలు మాత్రమే ఉండేవి. ఆ గ్రామానికి మైలు దూరంలో రాజాపేట సంస్థానము, ఎనిమిది మైళ్ళ దూరంలో ప్రసిద్ధ జైన దేవాలయం ఉన్న కొలనుపాకగ్రామం, ఆరుమైళ్ళ దూరంలో జగదేవపురం గ్రామం ఉన్నాయి.

రేణుకుంటలో సుఖజీవితం గడుపుతున్న పటేలు ఒంతపూడి రామిరెడ్డి నిజాంబలగం దృష్టిలోకిరావడానికి ఈక్రిందిసంఘటన దారితీసింది. ఆ గ్రామానికి దాదాపు మూడుమైళ్ళ దూరంలోఉన్న బేగంపేట్‌గ్రామం ఆనాడు ఒక ముక్తా (చిన్నజాగీరు)గా ఉండేది. మహమ్మదీయుడైన ముక్తేదార్ చనిపోగానే ఆ జాగీరుకోసం తగాదా ప్రారంభమైంది. ఆ ముక్తేదారు కూతురు, కొడుకుల మధ్య సాగిన వివాదంలో రామిరెడ్డి కూతురు పక్షం వహించాడు. ఆమెకు సహాయంగా ఉంటూ అక్కడ భూములను సాగు చేయించి రక్షణగా నిలుచున్నాడు. ముక్తేదారు కొడుకు తన చెల్లెలు భూములను స్వాధీనము చేసుకోవాలని తన ప్రయత్నాలు కొనసాగించాడు. రామిరెడ్డిని భయపెట్టి తరిమి వేయాలని అతడు హైద్రాబాద్ నుండి అరబ్బుల ముఠాను రప్పించాడు. ఆ రోజుల్లో నిజాం పరిపాలనలో అరబ్బులకు ప్రత్యేకస్థానం ఉండేది. వాళ్ళు నిజాం ఖజానాలకు కాపలాదార్లుగా ఉండేవాళ్ళు. అందువల్ల వారికి కొన్ని ప్రత్యేక అధికారాలు సౌకర్యాలు వుండేవి. ఎవరైనా ఎదురు మాట్లాడితేచాలు, ఆనాటి అరబ్బులు బొడ్లోనుండి బాకు దూసి చంపడానికి సిద్ధమయ్యేవాళ్ళు. నిజాం పోలీసులుకూడా వాళ్ళకు భయపడుతుండేవారు.

ఈ అరబ్బుల ముఠా బేగంపేట వచ్చి రామిరెడ్డిని సవాలు చేసింది. రామిరెడ్డి నిర్భయంగా ఇతర గ్రామవాసుల సహాయంతో వాళ్ళను ముఖా ముఖిన ఎదుర్కొన్నాడు. రామిరెడ్డి దళం ముందు అరబ్బులు నిలువలేక పోయారు. అరబ్బుల నాయకుల్ని పట్టుకొని ముక్కు, చెవులు కోసి పంపించాడు రామిరెడ్డి. "వీరులైన" అరబ్బులు పిక్కబలంచూపి హైద్రాబాద్ త్రోవపట్టారు. రామిరెడ్డి ధైర్యాన్నిచూసి గ్రామస్థులంతా మెచ్చుకున్నారు. ముక్తేదార్ కూతురుకు భూములపై న్యాయంగా యాజమాన్యం దక్కింది. చుట్టుప్రక్కల గ్రామాలలో రామిరెడ్డిపట్ల ఆదరాభిమానాలు పెరిగాయి.

## సబ్ — ఇనస్పెక్టర్ హత్య :

ఆ తర్వాత మూటకొండూరు గ్రామంలో మరో భూమి తగాదా వచ్చింది. ఒక పక్షం వహించిన రామిరెడ్డి ఈసారి పోలీసులను ఎదుర్కోవలసివచ్చింది. ఘర్షణ తీవ్రస్థాయికి వెళ్ళేసరికి పోలీసుకానిస్టేబులు తుపాకి పేల్చాడు. రామిరెడ్డి వెంట్రుకవాసిలో తన ప్రాణం రక్షించుకొని ఎదురు కాల్పులు జరిపాడు. ఫలితంగా పోలీసు సబ్-ఇన్స్పెక్టర్ నేలకు ఒరిగాడు. హత్యానేరంపై రామిరెడ్డిని అరెస్టుచేశారు. చివరికి ఈ విధంగానైనా పులి బోనులో చిక్కిందని రజాకార్లు సంతోషపడ్డారు. కానీ రామిరెడ్డి ధైర్యం కోల్పోకుండా తాను హత్యచేయలేదనే అంశాన్ని నిరూపించాడు. పోస్ట్ మార్టమ్ రిపోర్టులో అసలు హతుని శరీరంలో నుండి తూటా బయటపడలేదని, కానిస్టేబుల్ మాత్రమే కాల్పులు జరిపాడని సాక్ష్యాధారాలుదొరికాయి. కోర్టులో కేసునెగ్గి రామిరెడ్డి తన గౌరవాన్ని నిలుపుకున్నాడు. తాలూకా సాంతం అతనిపేరు మారుమ్రోగిపోయింది.

రామిరెడ్డి ఈ కేసు వ్యవహారాలలో ఇతర పనుల్లో తలమునకలై ఉంటూ కూడా దేశరాజకీయ పరిణామాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుండేవాడు. 1947 ఆగస్టు 15 నాడు దేశం స్వేచ్ఛావాయువుల్ని పీల్చ

గానే రామిరెడ్డి మార్గదర్శకత్వంలో రేణుకుంట స్వాంతంత్ర్యోత్సవాన్ని ఘనంగా జరుపుకుంది. కొంతకాలం గడిచినతర్వాత గాంధీజీ హత్య జరిగింది. ఈలోగా నిజాం తన స్వాతంత్ర్య ప్రతిపత్తి కోసం మొండిగా వ్యవహరిస్తూనే ఉన్నాడు. రజాకార్లు మతోన్మాదంతో హిందువుల్ని పీడిస్తూ నిజాంకు అండగా నిలుచున్నారు. గ్రామాలను దోచుకుంటున్నారు. రామిరెడ్డి నాయకత్వాన ఉన్న రేణుకుంట తదితర గ్రామాలను మాత్రం దోచుకోలేకపోయారు.

## గ్రామీణ రక్షణదళం :

రేణుకుంట చుట్టుప్రక్కల దూగానఉన్న గ్రామాలలో రజాకార్లు సాగిస్తున్న అమానుషమైన హింసాకాండ గురించి రోజూ వార్తలు తెలుస్తూనే ఉన్నాయి. రామిరెడ్డి స్వయంగా మరో ప్రాంతానికి వెళ్ళిపోయే అవకాశాలున్నా వెళ్ళిపోలేదు. ఆయన భార్య, చిన్నపిల్లలు తెనాలి వెళ్ళిపోయారు, తాను మాత్రం పెద్దకొడుకు రంగారెడ్డితోబాటు గ్రామంలోనే ఉంటూ గ్రామీణ రక్షణదళాన్ని ఏర్పాటు చేశాడు. కొనఊపిరివరకు పోరాడి తన గ్రామాన్ని కాపాడుకోవాలనే దృఢదీక్ష రామిరెడ్డిలో నెలకొంది. అరవై తుపాకులను తెప్పించి గ్రామీణ రక్షణదళానికి తర్ఫీదు ఇప్పించాడు. తాను స్వయంగా ట్వెల్వ్‌బోర్ తుపాకిని తెప్పించుకున్నాడు. కొలిపాక నుండి పగడాల సత్తెయ్య, వేచల్ల పుల్లారెడ్డి ఆయుధాల శిక్షణ ఇవ్వటానికి వచ్చారు. రామిరెడ్డి తన రెండంతస్తులమేడ పైభాగములో తుపాకులు అమర్చి శత్రువుల్ని ఎదుర్కొటానికి ఏర్పాట్లుచేశాడు. రాజాపేటనుండి రజాకార్లువస్తే ఎదురుగా కాల్పులు జరపడానికి వీలుగా తన మేడకు ముందువున్న చెట్లను నరికించివేయించాడు. గ్రామస్తులు, రైతులు పొలాల్లో పనిచేస్తున్నా అవసరమైనపుడు జట్లు జట్లుగా వచ్చేయాలని కట్టుదిట్టం చేశాడు. ఈ ఏర్పాట్లు స్థానిక ముస్లిం అధికారులకు తెలిసింది. రేణుకుంటను దోపిడిచేసే

అవకాశం చిక్కడంలేదని రజాకార్లు గోలపెట్టారు. హైద్రాబాద్ సంస్థానం భారతదేశంలో విలీనమైపోవాలనే అభిప్రాయాన్ని రామిరెడ్డి ప్రజల్లో ప్రచారంచేశాడు. జాతీయభావాన్ని ప్రజల్లో మేల్కొల్పాడు. ఈపరిణామాన్ని చూచి ముస్లిం అధికారులు కళ్ళల్లోనిప్పులు పోసుకున్నారు. రామిరెడ్డిని ఏవిధంగా నిర్మూలించాలని పన్నాగాలు పన్నసాగారు.

ఈ పన్నాగంకిందనే ఒక చతుష్టయం పథకం వేసింది. కొలిపాకలోని ముస్లింతహసీల్దార్, జగదేవ్ పూర్ లోని అబ్దుల్ రహ్మాన్, రాజాపేట్‌లోని రజాకార్లనాయకుడు హషీంఅలీ. ముస్త్యాలలోని రజాకార్లసైనికాధికారి ఛోటేమియా కలసి సాయుధ రజాకార్లు నిజాంసైనికుల సహాయంతో రేణుకుంటపై దాడిచేయాలని కుట్రపన్నారు.

నిజాంసైనికదళానికిచెందిన 50మంది సిపాయిలు,200మంది సాయుధులైనపోలీసులు, రజాకార్లు, ముస్లిం అధికార్ల నాయకత్వంలో బయలుదేరారు. 12 ట్రక్కులలో, జీపులలో హైద్రాబాదు నుండి బయలుదేరిన ఈ దళం ఆలేరు కొలిపాక మార్గంద్వారా రాజా పేట్‌వైపు వస్తున్నది.

## శత్రువుల రాత్రి మేల్కొండి :

మాఘమాసం (ఫిబ్రవరి). ఆకురాలు కాలం సమీపిస్తున్న రోజులు. చలిగా వున్న రాత్రులు. మూడుగంటలు కావొస్తున్నది. రేణుకుంటకు తూర్పుదిశలో కొండపై వడ్డరి వాళ్ళు రాళ్ళు కొడుతున్నారు. తమగ్రామంలో నిర్మించనున్న గాంధీ మందిరానికి అవసరమైన రాతిని తొలుస్తున్న ఒక వడ్డరి దూరంగా రేగుతున్న దుమ్మును చూసాడు. అకస్మాత్తుగా కొండదూకి గ్రామం వైపు పరిగెత్తు కొచ్చాడు. పటేల్ రామిరెడ్డికి తానుచూసిన దృశ్యం గురించి వివరించి చెప్పాడు. రాజాపేట్‌వైపుకు వెళ్ళిన జీపుల గురించి రజాకార్లదళం గురించి చెబుతూ "పటేల్ దొరా? ఇది పగవాళ్ళ రాత్రి మేల్కొని ఉండాలి" అనిహెచ్చరించాడు.

వడ్డరివాడు అందజేసిన వార్త పిని రామిరెడ్డి తన గ్రామ రక్షణ దళాన్ని అయత్తం చేశాడు. దళంతోపాటు తుపాకులు పుచ్చుకుని గ్రామం వెలుపలవున్న "ఇసుకవాగు" దగ్గరికి వచ్చి పొంచి చూశాడు. రాజాపేట నుండి వచ్చిన ట్రక్కులు రేణుకుంటకు రెండు ఫర్లాంగుల దూరంలో ఆగిపోయాయి. శత్రుముఠా రెండు దళాలుగా విడిపోయి రేణుకుంటను చుట్టుముట్టుతున్నవి. ఈలోగా రామిరెడ్డి దళంలోనుంచి ఒకతను కాల్పులు జరిపాడు. అయినా ఎదుటిపక్షంనుండి ఎదురు కాల్పులు జరగలేవి. రామిరెడ్డి తన దళాన్ని వెనక్కి నడిపించి గ్రామంలోని తన మేడపైకి ఎక్కి చురుగ్గా శత్రువుని ఎదుర్కోటానికి ఏర్పాట్లు సాగించాడు. ఈలోగా గ్రామస్థులందరు తుపాకి కాల్పులు విని మేల్కొన్నారు. కొన్ని కుటుంబాలు వచ్చి రామిరెడ్డి భవంతిలో తల దాచుకున్నాయి. పైనవున్న రామిరెడ్డి తన దళం సహాయంతో తుపాకి కాల్పులు సాగించాడు. ఉదయం ఆరు గంటలనుండి పది గంటలదాకా కాల్పులు కొనసాగుతూనేవున్నాయి. రజాకార్ల దళం నిజాం సైనికుల సహాయంతో మరింత దగ్గరగా భవంతిని చుట్టుముడుతున్నది. వాళ్ల లక్ష్యం మొదట రామిరెడ్డిని అంతం చేయాలని. ఆ తర్వాత గ్రామస్థులందరు సునాయాసంగా లొంగిపోతారని భావించారు. రెండువైపులనుండి కాల్పులు కొనసాగుతున్నాయి. భవంతిపైన దళం సభ్యులు ఇద్దరు మరణించారు. ఈలోగా పదిహేనుమంది కల శత్రుదళం తప్పించుకుంటూ భవంతి గోడదగ్గిరగా వచ్చి చేరింది. రామిరెడ్డి వెంటనే చేతిబాంబులు విసిరి మొత్తం దళాన్ని తుదముట్టించాడు. బాంబు ప్రేలుడుకు భవనం గోడ పగిలింది. రామిరెడ్డి చేతికి గాయం తగిలింది. అయినా గాయానికి కట్టు వేసుకొని తుపాకి కాల్పులు జరుపుతూనేవున్నాడు. అనుకోకుండా ఎదురుకాల్పులు ఆగిపోయాయి. ఉదయం పది గంటలు దాటినతర్వాత అకస్మాత్తుగా ఖా స్తబ్దత నెలకొంది. రెండువైపులనుండి కాల్పులు నిలిచిపోయాయి. నిశ్శబ్దంగా



చింతపూడి రామిరెడ్డి భవనం

ఇలాగే ఒక గంట కొనసాగింది. దాదాపు పదకొండు గంటల ప్రాంతంలో రామిరెడ్డి భవంతిపై కాస్త అలికిడి కలిగింది.

శత్రు ముఠానుండి ఎలాంటి అలజడి వినిపించడంలేదు. అసలు ఆ ముఠా వెనక్కి వెళ్ళి పోయిందేమో చూడాలని రామిరెడ్డి పైన ఉన్న పిట్ట గోడను ఆనుకొని తలను పైకి లేపి దృష్టి సారించాడు. హటాత్తుగా వెన కాలనుండి పేలిన తుపాకీ తూటా రామిరెడ్డి తలలో నుండి దూసుకు పోయింది, వెంటనే రామిరెడ్డి క్రిందికి పడిపోయాడు. తన ప్రతిన ననుసరించి కొన ఊపిరిదాకా రామిరెడ్డి తన గ్రామ రక్షణకోసం పోరాడి అమరవీరుడిగా ప్రాణాలు వదిలాడు.

అసలు జరిగిందేమిటంటే రామిరెడ్డి భవనం వెనకాల డెబ్భైగజాల దూరంలో ఒక పాతగడిని ఆనుకొని ఉన్న ఒక ఇంటి పెరట్లో చింతచెట్టు ఉంది. స్తబ్దత వ్యాపించిన ఆ ఒక గంట అవధిలో నిజాం సైనికుడు ఒకడు దొంగచాటుగా వచ్చి ఆ చింతచెట్టుపై కూచున్నాడు. రామిరెడ్డి తల పైకి



అమర వీరుడు రామిరెడ్డి

ఎత్తగానే వాడు సరిగా గురి చూసి కాల్పులు జరిపాడు.

రామిరెడ్డి మరణించగానే మిగతా దళం సభ్యులు హడలెత్తి పోయారు. తిరిగి కాల్పులు కొనసాగించలేక పోయారు. ఈలోగా ముస్లిం ముఠా భవనాన్ని చుట్టుముట్టి లోపలికి చొచ్చుకొనివచ్చింది కింది గదిలో వంద మంది పైగా గ్రామస్థులు గడియ బిగించుకొని తలదాచుకొని వున్నారు. వాళ్ళను బైటకు లాగాలనే ఉద్దేశ్యంతో నిప్పుపెట్టారు. పొగ వ్యాపించింది. పై అంతస్తు గదిలో వున్న వాళ్ళను కిందకు దిగాలనే ఉద్దేశ్యంతో సిపాయిలు ఒకరి భుజంపైకి మరొకరు ఎక్కి చూశారు. పైన 20 మందిసాయుధులైన దళ ాలు ఉన్నారు.

వాళ్ళను కిందికి దిగి రమ్మని నిజాం సైనిక ముఠా బెదిరించింది. రామిరెడ్డి చనిపోయాడు. ఇక మమ్మల్ని ఎందుకూ బాధపెడతారు అని పైవాళ్ళు అడిగారు. ఆయినా ఆముఠా ఊరుకోకుండా పోలీసు పటేల్ గుమస్తా బొల్లారామిరెడ్డిని పట్టి తెప్పించి మీది వాళ్ళకు హామీ యిప్పించింది. నిచ్చెన వేయించి అందరిని క్రిందికి దిగి రమ్మన్నారు. దిగి వచ్చిన దళ సభ్యులందరిని వరుసగా తాళ్ళతో కట్టివేయించి బయటికి లాక్కొచ్చారు. పోలీస్ కానిస్టేబుల్ ఆ దళంలో ఉన్న ఒక వ్యక్తిని గుర్తుపట్టి


మహ్మద్ యాకుబ్ అలీ

"ఇతను ముస్లీం, పేరు యాకూబ్ అలీ" అని చెప్పాడు. అయితే ముస్లిం అధికారులు నమ్మలేదు. యాకూబ్‌ను కల్మా చదవ మన్నారు. మొదట్లో యాకూబ్ బెదిరిపోయి మాట్లాడలేక పోయాడు. తర్వాత ధైర్యం తెచ్చుకొని కల్మా చదివాడు. ముస్లిం అనే నమ్మకం కుదిరాక యాకూబ్‌ను వదిలివేశారు. మిగతాహిందూ సభ్యులందరిని వరుసగా నిల్చోబెట్టి స్టెన్‌గన్‌తో కాల్చివేశారు. చనిపోయినవాళ్ళలో రామిరెడ్డి పెద్దకొడుకు రంగారెడ్డి, బొల్లా రామిరెడ్డి తమ్ముడు యాదవరెడ్డి కూడా ఉన్నారు. హత్యకాబడిన మిగతా వ్యక్తుల్లో పగడాల సత్తయ్య, వేచల్ల పుల్లారెడ్డి, యేమల్ల నర్సింహారెడ్డి, చాకలి యాదగిరి, మంగలి రాజయ్య, బురుగు చంద్రారెడ్డి, బురుగు వెంకటరెడ్డి తదితరులు ఉన్నారు. ఆ తర్వాత నిజాం బలగం క్రింది గది లోని గ్రామస్థులనందరిని బయటకు లాగి ముసలివాళ్ళను వదిలి వేశారు. కొంతమంది యువకులను బంధించి ఖైదీలుగా వెంటబెట్టుకున్నారు. మొదట్లో ఎవరిని ఏమీ చంపమని హామీ ఇచ్చి యాకూబ్‌ను మిగతా దళ సభ్యుల పేర్లు చెప్పమన్నారు. యాకూబ్ నిజమని నమ్మి యిద్దరి పేర్లు చెప్పాడు. ఆ ఇద్దరిని బయటకు లాగి అ: యాకూబ్ తన కళ్ళ ముందు జరిగిన ఘోరకృత్యాన్ని చూసి వణికిపోయాడు ఆ తర్వాత



అత్యాచార కాండ పిదప

వారెవ్వరి పేరును అతను చెప్పలేదు.

నిజాం పోలీసులు రజాకార్ల ముఠా అక్కడ పడివున్న 25 శవాలను రెండు ఎడ్లబళ్ళలో వేయించి గ్రామస్థులతో ఆ బళ్ళను లాగించారు. ఇసుక వాగు దగ్గరికి వచ్చిన తరువాత అక్కడే ఆ రెండుబళ్ళపై చెత్తా చెదారం వేసి మంటబెట్టారు. సగం కాలీకాలని శవాలు ఆనవాలు లేకుండా మసిబారిపోయాయి.

ముఠా తనతో బాటు డెబ్భైమంది ఖైదీలను హైద్రాబాద్ తీసుకెళ్ళిపోయింది. వెంట మరో రెండు ట్రక్కుల్లో పోలీసుల రజాకార్ల శవాలతో పాటు కొలిపాక, ఆలేర్‌ల గుండా ఈ ముఠా వెళ్ళి పోయిందని గ్రామస్తుల కథనం.

విచారణ లేకుండానే ఆ డెబ్భై మంది గ్రామస్థులను చంచలగూడా జైల్లో తోసివేశారు. రెండు నెలలు తర్వాత వాళ్లలో సగం మందిని వదిలిపెట్టినా మిగతా వాళ్ళను మాత్రం పోలీసు చర్య జరిగేవరకు జైల్లోవుంచారు.

రేణుకుంటపై పోలీసులు, రజాకార్లు దాడి జరిపి రామిరెడ్డిని హత్య చేసిన తరువాత ఆనాటి హైదరాబాద్ రేడియో యీ వార్తను ప్రసారం చేసింది. ''రేణుకుంటలో జరిగిన పోరాటంలో ఎనభై మంది కమ్యూనిస్టులు, ఆ దళం నాయకుడు రామిరెడ్డి హతమయ్యారు. ప్రభుత్వ దళానికి ఏమీ నష్టం వాటిల్ల లేదు. కొందరు మాత్రం గాయపడ్డారు.'' ఆనాటి వార్తా పత్రిక ఒకటి ప్రభుత్వ దళంలోని దాదాపు 118 మంది మరణించారని ప్రకటిస్తున్నది.

ప్రజలుకోసం ప్రాణాలు అర్పించిన అమరవీరుడు చింతపూడి రామి రామిరెడ్డిని యీనాడుకూడా నల్లగొండ జిల్లాలో ప్రజలు తలుచుకుంటూ వుంటారు. ఆయన అనుచరుడు మొహమ్మద్ యాకూబ్ఆలీ ఆనాటి పోరాటం వర్ణిస్తూ యిలా అన్నాడు : "జిల్లా మొత్తంలోనే ఆయన మహా నాయకుడు. చరిత్రలో ఆయనపేరు చెరగనివిధంగా వుండిపోతుంది. అలాటి వీరుడు మళ్ళీ కనపడడు."

# 6. అమరవీరుడు షోయీబ్

**1947** లో అక్టోబరు మాసం ముగియవస్తున్నది. వానా కాలాన్ని వెనుకకులాగి చలి తెరతొలగించుకొని వచ్చే ప్రయత్నంలో వుంది. రాత్రి తొమ్మిదిన్నర ఆ ప్రాంతంలో "రయ్యత్" పత్రికా కార్యాలయంలో యువకుడైన షోయీబ్ ఉల్లాఖాన్ నిలబడి విలపిస్తున్నాడు. 'రయ్యత్' సంపాదకుడైన శ్రీ ముందుముల నర్సింగరావు ఆ యువకుణ్ని ఓదార్చుతున్నాడు. ఏదైనా కౌంటుంబికమైన దుర్ఘటన జరిగిందా? అనే అనుమానం సహజంగానే కలుగుతుంది. కానీ అసలు సంఘటన గురించి వింటే ఆశ్చర్యం గానే ఉంటుంది.

నిజాం హయాంలో స్వతంత్ర అభిప్రాయాలతో వెలువడుతూ వచ్చిన "రయ్యత్" పత్రిక ఇకముందు రాదు. నిజాం ప్రభుత్వం ఆ పత్రికను నిషేధించింది. ఆరోజే గూఢచారీ విభాగం అధికారి ఫజల్ రసూల్ ఖాన్ పత్రికా కార్యాలయానికి వచ్చి నిషేధాజ్ఞలను అందచేశాడు. తత్ఫలితంగా దినపత్రిక "రయ్యత్" మరుసటిరోజునుండి వచ్చే అవకాశం లేదు. అందు

వల్ల ఉపసంపాదకుడైన షోయాబ్ ఉల్లాఖాన్ కన్నీరు కారుస్తున్నాడు. ఆ ఉర్దూ పత్రికా కార్యాలయంలోని హిందూ, ముస్లిం ఉద్యోగులంతా కంట తడిపెట్టారు. స్వతంత్ర అభిప్రాయాలతో ప్రజల అభిమానాన్ని చూరగొన్న సంపాదకుడు శ్రీ ముందుముల నర్సింగరావు నిరంకుశాధికారుల ఆంక్షలను శిరసావహించ వలసి వచ్చింది. సంవత్సరమున్నర క్రితం "రయ్యత్" లో చేరిన ఉప సంపాదకుడు షోయాబ్ మాత్రం తన దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు. సంపాదకుడి కంటే ఎక్కువగా బాధ పడుతున్నాడు. ఆధ్యాత్మిక దృక్కోణంలో జీవితాన్ని గడిపే సంపాదకుడు "కర్మణ్యే నాధి కార స్తే" అనే విశ్వాసానికనుగుణంగా ఆంక్షను ఉపేక్షావైఖరితో స్వీకరించాడు కానీ షోయాబ్ మాత్రం తన భావావేశాన్ని ఆపుకోలేకపోయాడు, తన తల్లిలాంటి స్వతంత్ర దిన పత్రిక నిషేధానికి గురి కాగానే షోయాబ్ విపరీతమైన బాధకు లోనయ్యాడు. ప్రభుత్వం విధించిన అక్రమమైన ఆంక్షఃపట్ల కోపం వచ్చింది. స్వతంత్రమైన పత్రికా రచనను హృదయపూర్వకంగా సమర్థించిన షోయాబ్‌కు నచ్చచెప్పాలనే ప్రయత్నంతో నర్సింగం గారు ఇలా అన్నారు, "నువ్వు కొంచెం నావైపు చూసి ఆలోచించు. సంపాదకుడిగా నీకంటే నేను ఎక్కువగా విలపించాలి. కానీ ఒకవిధంగా సంతోషిస్తున్నాను. నా కర్తవ్యాన్ని నేను నిర్వహిస్తూ వచ్చాను. బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలని ఈ సంస్థానంలో పౌరహక్కులు పునరుద్ధరించ బడాలని నిజాయితీతో పత్రిక ద్వారా కృషి చేశాను. ప్రజలు హృదయ పూర్వకంగా పాల్గొనక పోతే ఏ రాజకీయమైన సంస్కరణ కూడా సాధ్యంకాదు. హైద్రాబాద్ సంస్థానం భారత ప్రభుత్వంలో విలీనం కావాలని విస్పష్టంగా ఎలుగెత్తి ప్రకటించాను. ప్రజలను మేల్కొల్పి ఈ వాస్తవాన్ని గమనించమన్నాను. ఈ నాటికి నిజాం ప్రభుత్వం ప్రజలవల్ల ప్రమాదమున్నదని గ్రహించింది. ప్రజా వ్యతిరేకమైన చర్యగా "రయ్యత్"ను నిషేధించి తన అసలు స్వభావాన్ని బహిర్గతం చేసుకొంది. అందువల్ల నా కర్తవ్యాన్ని నిర్వహించాననే

అనుకొంటున్నాను. ఇంతకు పూర్వం ఇలాంటి ఇబ్బందులు చాలా వచ్చినా ఎదుర్కొన్నాను. ఆశయం కోసం బాధల్ని సహించకతప్పదు."

నర్సింగరావుగారి మాటలవలన షోయాబ్ ప్రభావితుడైనా ప్రభుత్వ నిరంకుశాధికారం ముందు ఓటమిని అంగీకరించ కూడదనుకున్నాడు. "స్వతంత్రమైన పత్రికారచన"అనే ఉద్యమాన్ని ఎన్నికష్టాలైనా సహించి, కొనసాగించాలని నిశ్చయించుకొన్నాడు. ఈ సామంత రాజ్యం తన దమన నీతితో ప్రజావాణిని అణచి వేయాలని ప్రయత్నించినా తాను రచనా సైని కుడిగా నిలబడి పోరాడాలని అనుకొన్నాడు. ఆ నిశ్చయంతోనే షోయాబ్ శ్రీనర్సింగరావుతో ఇలా చెప్పాడు. "పండిట్‌జీ!ఒక విధంగా ప్రభుత్వం తన పతనానికే నాంది పల్కింది. ఇలాంటి విషమ సమయంలోనే ప్రజావాణిని మరింత నిర్భయంగా వినిపించవలసిన అవసరం ఉంది. ప్రజల భావాన్ని వ్యక్తం చేయటానికి ఒక పటిష్టమైన సాధనం కావాలి. "రయ్యత్" లేని కొరతను తీర్చాలని నా ఆశయం. "ఇమ్‌రోజ్" అనేపేరుతో ఒక దిన పత్రిక కోసం డిక్లరేషన్ సంపాదించాను. మీరు నన్ను ఆశీర్వదించి, కావ లసిన డబ్బు సమకూర్చిపెడితే ఈ పత్రికారచన ఉద్యమాన్ని నేను కొన సాగిస్తాను."

శ్రీ నర్సింగరావు తన సహకారం ఉంటుందని వాగ్దానం చేశారు. అయితే హైద్రాబాద్ సంస్థానంలో ఏ రోజుకారోజు ప్రజాజీవితం అన్యా యాలకు లోనవుతూవున్నదని, షోయాబ్ సంస్థానం నుండి వెళ్ళిపోయి ఇతర ప్రాంతాలనుండి పత్రికను నడిపించడం మంచిదని ఆయన సలహా యిచ్చారు. ప్రభుత్వంతో ముఖాముఖీ పోరాడే దానికంటే దూరంగా వుంటూ తన ఆశయాన్ని నెరవేర్చవచ్చునని షోయాబ్‌కి ఆయన కోరారు. కాని షోయాబ్ తాను హైద్రాబాద్‌లోనే ఉంటూ పత్రికను వెలువరించాలనే కృతనిశ్చయాన్ని ప్రకటించాడు.



అమర వీరుడు షోయీబ్

## ప్రభుత్వోద్యోగం నిరాకరణ :

పై సంఘటనకు పూర్వం దాదాపు రెండు సంవత్సరాల క్రితం షోయీబ్ "రయ్యత్" కార్యాలయానికి వచ్చి నర్సింగరావు గారితో తనను తాను పరిచయం చేసుకొన్నాడు. తాను రయ్యత్ దినపత్రికలో పని చేయాలనుకుంటున్నానని చెప్పాడు.

ఆరోజులలో జాతీయ భావాలని నిర్భయంగా ప్రకటిస్తున్న ఉర్దూ దినపత్రిక రయ్యత్. నిజాం సంస్థానంలో ఆనాటి అధికారికభాష ఉర్దూ. పత్రికలు చాలావరకు ఉర్దూలోనే వెలువడుతూవుండేవి. శ్రీ ముందుముల నర్సింగరావుకు పత్రికా సంపాదకుడిగా పత్రికా లోకంలో ప్రముఖస్థానం వుండేది. ఆ రోజులలో రయ్యత్‌కు ఉప సంపాదకుడి అవసరం వుందని ప్రకటన వెలువడింది. ఆ ఉద్యోగం కోసం షోయీబ్ వచ్చాడు. టేబిల్ పై వున్న పత్రికలో ఒక వార్తను చూపి సంపాదకీయాన్ని వ్రాసి యిమ్మన్నారు - సంపాదకులు. షోయీబ్ సంపాదకీయాన్ని కొద్దిసమయంలోనే వ్రాసియిచ్చాడు. ఆ తర్వాత ఒక ఇంగ్లీషు వార్తను యిచ్చి ఉర్దూలోకి

అనువదించమన్నారు. ఆ పనికూడా ఆయన సంతృప్తికరంగా చేశాడు. అభిప్రాయాలు, శైలి, భాషాసమన్వయం సరిగ్గా కుదిరింది. ఆ విధంగా ప్రాథమిక పరీక్ష ముగిసింది.

ఆ తర్వాత సంపాదకులు శ్రీ నర్సింగరావు తన పత్రిక వైఖరి గురించి చెబుతూ యిలా అన్నారు.

"మీరు ఉపసంపాదకులుగా మీ పనిని నిర్వహించగలుగుతారు. కానీ "రయ్యత్" జాతీయభావాలు గల పత్రిక. మీరు రాయిష్టు అభిప్రాయాలు గల వ్యక్తులు. మీ వ్యాసాలను నేను తాజ్ వారపత్రికలో చదివాను. అందువల్ల మీరు ఈ పాలసీతో ఏకీభవించి పని చేయగలుగుతారా? షోయీబ్ సమాధానంగా తాను రయ్యత్‌లో పని చేసినంతకాలం ఎలాంటి భేదభావాన్ని ప్రకటించనని చెప్పాడు.

పత్రికారచయితగా పొందే వేతనం కూడా చాలా నిరుత్సాహకరంగా ఉంటుందని, షోయీబ్ ప్రభుత్వోద్యోగంలో చేరటం మంచిదని శ్రీ నరసింగరావుగారు సలహాఇస్తూ "మీరు ముస్లిం అభ్యర్థిగా, ఉస్మానియా పట్టభద్రుడిగా నిజాం ప్రభుత్వంలో సునాయాసంగా ఉద్యోగం సంపాదించకోవచ్చు. మీ నాన్నగారు పోలీస్‌సబ్-ఇనస్పెక్టరుగా వున్నారు. చిన్నాన్న ఫారెస్టు విభాగంలో అధికారి. పైగా మీరు వివాహితుడనని, ఒక కూతురు కూడా ఉందని చెబుతున్నారు. నేను ఇవ్వబోయే నెలసరిజీతం 50 రూపాయలు మీకు ఏం సరిపోతాయి? ఈ ఆర్థికమైన ఇబ్బందిని కూడా మీరు దృష్టిలో పెట్టుకోవాలి–" అని ఆయన స్పష్టీకరించారు. షోయీబ్ నిరుత్సాహంచెంద కుండా తాను ప్రభుత్వోద్యోగం చెయ్యననీ, స్వల్పవేతనం తనకు ఇష్టమేనని చెప్పాడు. ఆతర్వాత షోయీబ్ "రయ్యత్" ఉపసంపాదకునిగా ఉద్యోగంలో చేరిపోయాడు.

కొంతకాలంలోనే షోయీబ్ తన ప్రతిభావ్యుత్పత్తులను నిరూపించుకు న్నాడు. పత్రికారచనపట్ల అతనికున్న అపరిమితమైన శ్రద్ధాసక్తులను చూసి సంపాదకుడు ముగ్ధుడైపోయాడు. తత్ఫలితంగా షోయీబ్ జీతం75 కు పెరిగింది. రయ్యత్‌లో ఉద్యోగిగా కాకుండా కుటుంబసభ్యుడిగా షోయీబ్ తన ఆత్మీయతను వృద్ధిచేసుకున్నాడు అందువల్లనే ఆ పత్రిక మూతబడే సందర్భంలో ఆయన అంతగా కదలిపోయాడు.

## ఇమ్‌రోజ్ పుట్టుక :

ముందుముల నర్సింగరావుగారి సహాయంవల్ల షోయీబ్ "ఇమ్‌రోజ్" దినపత్రికను వెలువరించే ఏర్పాట్లు చేసుకున్నాడు. శ్రీ బూర్గుల రామకృష్ణా రావుగారు ఆర్థికసహాయం అందచేశారు. 1947 నవంబరు 15వ తేదీనాడు "ఇమ్‌రోజ్" దినపత్రిక మొదటిసంచిక వెలువడింది. సంస్థానంలో క్రమంగా పత్రిక పలుకుబడితోపాటు పాఠకుల సంఖ్యకూడా బాగా పెరిగిపోయింది. కొంతకాలంతర్వాత రామకృష్ణారావుగారి ఇంట్లోకి "ఇమ్‌రోజ్" కార్యాలయం తరలించబడింది. ఆరోజుల్లో శ్రీ రామకృష్ణారావు న్యాయవాదివృత్తిని వదిలి వేశారు. ప్రభుత్వదమననీతికి నిరసనగా చాలామంది న్యాయవాదులు ఆనాడు న్యాయస్థానాన్ని బహిష్కరించారు. "ఇమ్‌రోజ్" ఒకవిధంగా ఆనాటి స్టేట్ కాంగ్రెస్ వాణిగా వెలువడేది. నిజాం సంస్థానం పోకడలను నిశితంగా విమ ర్శిస్తూ షోయీబ్ సంపాదకీయాలు వ్రాసేవాడు. రాష్ట్రంలో ప్రబలుతున్న అరాచకమైన పాలనా దుస్థితిని తీవ్రంగా ఖండిస్తూ ఆయన తనకలం పదు నును మరింతగా పదునుపెట్టేవాడు. 1948 జనవరి 29 నాటి సంపాదకీ యంలో ఇలా వ్రాశాడు. దాని శీర్షిక....

## "పగటి ప్రభుత్వం—రాత్రి ప్రభుత్వం"

"ఈనాడు గ్రామస్తులు ప్రభుత్వ తిరుగలిలో పిండి చేయబడుతు న్నారు. ఇంతవరకు జరిగిన సంఘటనలు ప్రజలఎదుట వున్నాయి. అరాచకం

ఏవిధంగా రాజ్యంచేస్తున్నదో అందరికీ తెలుసు. కొన్నిచోట్ల కమ్యూనిస్టు దళాలు చెదురుమదురుగా హింసాచర్యలు సాగించిన విషయాన్ని మేము సమర్థించటంలేదు. కానీ ప్రతీకారచర్యలనే పేరుతో జరుగుతున్న హింసా కాండ మితిమీరిపోతున్నది

"ఇత్తేహాదుల్ ముసల్ మీాన్" సంస్థ తన సభ్యులకు సైనికశిక్షణ ఇస్తున్నది. తన దళాలను రాష్ట్ర సరిహద్దులపైకి పంపిస్తున్నది. గ్రామా లలో జరుగుతున్న దోపిడులు, మానభంగాలు ఎవరివల్ల జరుగుతున్నాయో ఈనాడు అందరికీ తెలుసు. బీబీనగర్, నిజామాబాద్‌లలో జరిగిన సంఘట నలు మరీ క్రూరంగా ఉన్నాయి. అక్కడక్కడా ఈ దోపిడీ, మానభంగా లకు సంబంధించిన ప్రత్యక్ష ప్రమాణాలు లభిస్తున్నాయి. ఇత్తేహాదుల్ ముసల్‌మీాన్ సభ్యులు గాంధీటోపీలు ధరించి గాంధీజీకీ జై అనే నినాదాలు చేస్తూ గ్రామాలను దోచుకుంటున్నారు. బాధ్యతాయుతమైన పదవుల్లో వున్న వ్యక్తులు వీటి నన్నింటిని సాధారణమైన చోరీ నేరాలక్రింద త్రోసి వేస్తున్నారు.

మా అభిప్రాయంలో ఈ అరాచకమైన వ్యవస్థ ఒక విషవలయంగా పరిణమించింది. ఒక గ్రామీణుడు బాధతో "పగటిపూట ఒక ప్రభుత్వం, రాత్రి మరొక ప్రభుత్వం రాజ్యం చేస్తున్నది."అన్నమాట సత్యదూరమేమీా కాదు. పరిస్థితులు ఇత్తేహాదుల్ సంస్థ దుశ్చర్యలను మాత్రమే ప్రజలకు బాహాటంగా చూపుతున్నాయి. ప్రభుత్వ ప్రచార యంత్రాంగం యీా వాస్త వాన్ని కప్పిపుచ్చలేదు.

హింసా ప్రతీకార చర్యలతో కాంగ్రెసుకు ఎలాంటి సంబంధంలేదని అధ్యక్షులు స్వామీ రామానంద తీర్థ స్పష్టంచేసి వున్నారు. ప్రజలు కూడా శాంతి అహింసలతో తమ ప్రతిఘటన కొనసాగించాలని మేము అభ్యర్థి స్తున్నాము. కమ్యూనిస్టు మిత్రులు ఈ విషయాన్ని గ్రహించి ప్రవర్తించా

ల్లని కోరుతున్నాము. హింసవల్ల ప్రతిహింస, తద్వారా ముగింపులేని ప్రతీకార చర్యలు తప్ప మరేం మిగలవు. సార్వజనీనమైన ఉద్యమాలు సత్యం, అహింసల ఆధారంగానే నైతికబలాన్ని నిలుపుకోగలుగుతాయి. పాలకపక్షం శాంతి భద్రతల సంరక్షణకోసం ఎలాంటి కఠిన చర్యలకైనా సిద్ధమేనని ప్రకటించినంతమాత్రాన లాభంలేదు. ఇత్తేహాదుల్ ముస్లిమీన్ సంస్థ కార్యకలాపాలపై ప్రభుత్వం అంక్షలను ఎందుకు విధించకూడదు? ప్రజలందరికి ప్రాతినిధ్యం వహించే మంత్రివర్గాన్ని యెందువల్ల ఏర్పాటు చేయదు. ప్రజాభిప్రాయాన్ని మన్నించి పరిపాలనను సాగిస్తేనే ఏ ప్రభుత్వమైనా మనగలుగుతుంది ?"

—ఇదే విధంగా నిర్భయంగా యధార్థాన్ని ప్రజలకు చూపుతూ "ఇమ్‌రోజ్" ప్రజల వాణిగా నిలద్రొక్కుకుంది. జూన్ 1948 నాడు కాసిం రజ్వీ ఒకచోట ఉపన్యసిస్తూ త్వరలోనే ఆసఫియాధ్వజం ఎర్రకోటపై ఎగురగలదని డంబాలు పలికాడు! ఇమ్‌రోజ్ తన సంపాదకీయంలో యీ ఉపన్యాసాలను నిశితంగా ఖండించింది. రజ్వీ ఈ పత్రిక విమర్శలను తట్టుకోలేకపోయాడు. ఆ రోజుల్లో దాదాపు ఉర్దూ పత్రికా రచయితలందరూ రజాకార్లను సమర్థించారు. యువకుడైన షోయీబ్ ఉల్లా మాత్రమే ధైర్యంగా రజాకార్ల అమానుషచర్యలను ప్రతిఘటించాడు. తత్ఫలితంగా షోయీబ్ తనకు కంటిలో ముల్లుగా వున్నాడని రజ్వీ గ్రహించాడు.

ఆనాడు భారతప్రభుత్వానికి, నిజాం ప్రభుత్వానికి మధ్య సంబంధాలు విషమించివున్నాయి. సరిహద్దు ప్రాంతాలలో భారత సైనికదళాలకు, నిజాం సైన్యం, రజాకార్ల ముఠాలకు ఘర్షణలు జరుగుతూవుండేవి. ఒకసారి నానజ్ అనే గ్రామంనుండి వెళుతున్న భారతీయ సైనిక దళాన్ని రజాకార్ల దళం ముట్టడించింది. 1948 జులై 24 వ తేదీనాడు జరిగిన సంఘటనలో భారతీయ సైనికులు వీరోచితంగా దాడిని ఎదుర్కొని నిజాం

సైనికులను రజాకార్లను వెనక్కి తిప్పికొట్టారు. చాలా మంది రజాకార్లు చనిపోయారు. నానజ్ గ్రామాన్ని భారతీయ సైనికులు స్వాధీనం చేసుకొన్నారు. అసలు ఈ సంఘటన జరగటానికి ఒక కారణం వుంది. ఆనాటి బొంబాయి ప్రాంతంలోని ఉస్మానాబాద్ జిల్లాలో వున్న బార్షి అనే గ్రామం నిజాం సరిహద్దులోవుంది. ఆ గ్రామానికి వెళ్లాలి అంటే నిజాం రాష్ట్రములోవున్న సరిహద్దు గ్రామం నానజ్ గుండావెళ్లాలి. ఆ నానజ్ నుండి వెళ్ళేటప్పుడు, రజాకార్లు కావాలని దాడి జరిపారు. ఫలితంగా ఎదురు దెబ్బ తిన్నారు.

## షోయిబ్ హత్య :

భారతీయ సైనికులు తమగ్రామం నానజ్‌ను అక్రమంగా ఆక్రమించుకున్నారని ప్రచారంచేస్తూ రజాకార్లు రాజ్యంలో పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శనలు లేవదీశారు. "నానజ్ డే" అనే పేరుతో హైద్రాబాద్ రాజ్యమంతటా నిరసన దినం జరిపారు. 1948 అగష్టు 19వ తేదినాడు నగరంలో జమరుద్ మహల్ సినిమా హాలులో భారీ ఎత్తున బహిరంగ సభ జరిగింది. ఇసుక వేస్తే రాలనంతగా ముస్లిం ప్రజలు ఆ సభకు హాజరైనారు. నానజ్ గ్రామంలో ప్రాణాలు వదిలిన రజాకార్లకు శ్రద్ధాంజలి ఘటించారు. రజాకార్ల సాలారే ఆజమ్ (సర్వసైన్యాధిపతి) కాసిం రజ్వీ ఉపన్యసిస్తూ హిందువులకు, భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా విషం వెళ్ళగక్కాడు. అదే సందర్భంలో తన మనస్సులో ఇమ్‌రోజ్ పట్లవున్న విద్వేషాన్ని కూడా పరోక్షంగా వెదజల్లుతూ తన అనుయాయులను ఉద్దేశించి ఇలా ఆదేశించాడు.

"ముస్లిం ఐక్యతను విచ్ఛిన్నంచేసే శక్తులు సజీవంగా ఉండటానికి వీలులేదు. భారత ప్రభుత్వ ఏజంట్లుగా ఉంటూ మా సమైక్యతను ధ్వంసం చేయాలనే కీలుబొమ్మల చేతులు ఉండడానికి వీలులేదు. ఆ చేతులు క్రిందకి దిగాలి. లేదా నరికి వేయబడాలి."

రజ్వీ ఆ విధంగా పరోక్షంగా తన అనుయాయులను హెచ్చరించాడు. షోయిబ్‌ను ఏ విధంగా ఎదుర్కోవాలో భావ గర్భితంగా చెప్పాడు.

1948 ఆగష్టు 21న రజాకార హింసాకాండ మితిమీరి పోయింది. సంస్థానంలో ముఖ్యంగా హిందువుల ప్రాణాలు, మానాలు, ఆస్తులు అన్నీ రజాకార్ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉన్నాయి. నగరంలో హిందువులందరూ సాయంత్రం ఆరు గంటలు కాగానే ఇంటి దారి పట్టేవారు. ఏడు గంటల తర్వాత వీధులన్నీ నిర్మానుష్యంగా ఉండేవి. బయటినుండి వచ్చిన ముస్లిం శరణార్థులు కూడా హిందువులకు సమస్యగా పరిణమించారు. ఎన్నో హిందూ కుటుంబాలు సంస్థానాన్ని వదిలి వెళ్ళిపోయాయి.

చెప్పుల బజారు చౌరస్తా కూడా ఆ రోజు రాత్రి కాగానే నిర్మానుష్యమైపోయింది. ఈ బస్తీ కాచిగూడా స్టేషన్‌కు వెళ్ళేదారిలో ఉంది. దాదాపు ఇళ్ళలో ఎక్కడా దీపాలు లేవు. బూర్గుల రామకృష్ణారావు గారిఇంటిలోని ఒక భాగంలో ఉన్న "ఇమ్‌రోజ్" కార్యాలయంలో మాత్రమే దీపాలు వెలుగుతున్నాయి. మరుసటిరోజు రావలసిన పత్రిక పని ముగించుకొని సంపాదకుడు షోయిబ్, పత్రికా నిర్వహకుడు మహ్మద్ ఇస్మాయిల్‌ఖాన్ కొద్ది దూరంలో ఉన్న ఇళ్ళకు వెడుతున్నారు. లింగంపల్లి చౌరాస్తా దగ్గర ఉన్న ఇళ్ళకు వాళ్ళు ఇద్దరు వెడుతున్నప్పుడు అర్ధరాత్రి గడచిపోయింది. చౌరస్తా దాటి కొన్ని అడుగులు ముందుకు వెళ్ళేసరికి వెనకాలనుండి కొంతమంది పరిగెత్తుతూ వచ్చారు. అందులో ఒకడు షోయిబ్ ముందుకు వచ్చి ఇప్పుడే ఇలా ఒకడు పరుగెత్తిపోయాడు. మీరు చూశారా? అని ప్రశ్నించాడు. షోయిబ్ లేదు అని సమాధానం ఇవ్వగానే ఆ ప్రశ్నించిన వ్యక్తి నమస్కరించి వెనక్కి తిరిగాడు! వెంటనే షోయిబ్ వెనకాల ఉన్న వ్యక్తి తుపాకీ పేల్చాడు. వరుసగా మూడు తుపాకీ గుండ్లు తగలగానే షోయిబ్ నేలకూలి పోయాడు. వెంటనే ఆ వ్యక్తులు షోయిబ్ రెండుచేతులను



షోయాబ్ మృతదేహం

కత్తితో నరికి వేశారు. అడ్డుపడిన ఇస్మాయిల్ చేతిని గూడా నరికి వేశారు. మరో చేతిలోని ఒకవేలు మాత్రం తెగిపోయింది. హంతకులు పని ముగించుకొని చీకట్లో కలిసి పోయారు. కేకలు విని షోయాబ్ ఇంటి వాళ్ళందరు పరిగెత్తుకు వచ్చారు. షోయాబ్ చివరిక్షణంలో కూడా తనభార్యకు ధైర్యం చెప్పాడు. ఆమెకు శ్రీరామకృష్ణదూత్, శ్రీ రామాచారిలాంటి వకీళ్ళు సహాయ పడతారని చెబుతూ ప్రాణాలు వదిలాడు. అప్పుడు తెల్లవారు జాము మూడున్నర గంటలు కావస్తున్నది.

రజ్వీ ఇచ్చిన ఉపన్యాస ఫలితంగా ఈ హత్యాకాండ జరిగింది. ముస్లిం దుశ్చర్యలకు వ్యతిరేకంగా వ్రాసిన చేతులు నరికి వేయబడ్డాయి. ఒక విధంగా షోయాబ్ తన విద్యార్థి కాలం నాటి నుండి కలాన్ని ఆయుధంగా వాడుతూ వచ్చాడు. ఉస్మానియా విశ్వ విద్యాలయ మాస పత్రికలో



మహమ్మద్ ఇస్మాయిల్

రచయితగా చిత్రకారుడిగా సంపాదక వర్గంలో తనప్రత్యేకతను నిరూపించుకునేవాడు.

వార పత్రిక 'తాజ్'ను తన కలం బలంపై చాలాకాలం నడిపాడు. నిజాం ప్రోత్సహిస్తున్న మత విద్వేషక చర్యలను తాజ్‌లో షోయాబ్ నిర్భయంగా ఖండించాడు. అదేవిధంగా 'రయ్యత్'లో కూడా నిజాం ఫాసిస్టుచర్యలను ప్రజలముందు బట్టబయలు చేశాడు. చివరికి తన "ఇమ్రోజ్" పత్రికద్వారా సాహసోపేతమైన పోరాటాన్ని సాగించాడు. న్యాయం, నీతి, మత సహనం కోసం నిర్భయంగా నిలుచున్నాడు. అడుగడుగునా ఆర్థికమైన ఇబ్బందుల్ని ఎదుర్కొంటూ ప్రభుత్వ సెన్సారింగ్ విధానాలను తట్టుకొంటూ తన స్వతంత్రమైన పత్రికా రచనను కొనసాగించాడు. ఆ రోజుల్లో నిజాం సంస్థానం భారత్‌లో విలీనం కావాలని అన్నందుకే నవాబ్‌మంజూరు జంగ్ లాంటి వ్యక్తి పెన్షన్‌ను నిజాం రద్దుచేశాడు. అలాంటి విపత్కరమైన పరిస్థితుల్లో ప్రాణాలకుతెగించి షోయాబ్ నిజాయితీతో, ఉత్సాహంతో

ధైర్యంతో, సత్యంకోసం తన పత్రికారచనను అంకితం చేశాడు. వ్యక్తిగతంగా షోయిాబ్ గాంధీ విధానాలను సమర్థించేవాడు. తాను ముస్లిం అయినప్పటికి ముస్లిం మతవాదాన్ని నిరసించాడు. సామంత ప్రభుత్వాలను తీవ్రంగా వ్యతిరేకించాడు. ప్రజల్లో సమానత్వం నెలకొనాలని షోయిాబ్ కలలు కనేవాడు. జాతీయ ఆదర్శాలుగల యువకునిగా తను నిస్వార్థ జీవితాన్ని గడిపారు.

షోయిాబ్ హత్య జరిగిన తరువాత నిజాం పోలీసులు శవాన్ని ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చారు. అధిక సంఖ్యలో కాంగ్రెసు కార్యకర్తలు, నాయకులు ఆసుపత్రికి వచ్చారు అక్కడే ఉస్మానియా మెడికల్ కాలేజీ విద్యార్థులు వచ్చినవాళ్ళను హేళనగా మాట్లాడటం మొదలుపెట్టారు. పోస్టుమార్టం జరిగిన తరువాత శవయాత్రకు అనుమతి యివ్వలేదు. గోషా మహల్ కుంట ఎదురుగావున్న స్మశానంలో షోయిాబ్‌ను సమాధి చేశారు. బంధువులు, కాంగ్రెస్ కార్యకర్తలు, ఒకరిద్దరు మహమ్మదీయులు మాత్రమే ఖనన క్రియకు హాజరైనారు. చుట్టూ గూఢచారి విభాగం వాళ్లు కాపలాకాశారు.

మరుసటిరోజు పత్రికల్లో ఒక అధికార ప్రకటన వెలువడింది. గూఢచారి విభాగం దర్యాప్తు జరిగిందని యీ హత్య వెనకాల ఎలాంటి రాజకీయ కారణాలు లేవని, వ్యక్తిగతమైన శత్రుత్వమే హత్యకు దారితీసిందని, పోలీసులు యింకా విస్తృతంగా దర్యాప్తు జరుపుతున్నారని ఆ ప్రకటన స్పష్టం చేసింది. పోలీసులు హంతకులను ఆనాడు పట్టుకోలేకపోయారు.

షోయిాబ్ హత్య హైద్రాబాద్ సంస్థానంపై పోలీసు చర్య అవసరాన్ని మరింతగా స్పష్టం చేసింది. అంతకాలం నిజాం చర్యలను హిందూ ముస్లిం సమస్యగా మాత్రమే తీసుకొన్న నెహ్రూ క్రమంగా వాస్తవాన్ని గ్రహించారని ఆ తరువాత ముందుముల నర్సింగరావుగారు చెప్పారు.

పోలీస్ చర్యల తర్వాత షోయీబ్ హంతకులు పట్టుబడ్డారు, ప్రత్యక్షంగా హత్య చేసినవాళ్ళలో రజాకార్లు మొయినీఖాన్ తదితరులు వున్నారు. ప్రత్యేక న్యాయస్థానంలో విచారణ జరిగింది. ఈ కేసులో కుట్రదారుగా రజ్వీపై కూడా పోలీసులు కేసు నమోదు చేశారు. కానీ మోయిన్ ఖాన్ తదితరులకు శిక్షపడినా, రజ్వీ మాత్రం తప్పించుకోగలిగాడు.

ఆ తర్వాత షోయీబ్ కుటుంబానికి కాంగ్రెస్ సంస్థ శ్రీ పన్నాలాల్ పిత్తిలాంటి వ్యక్తులు ఆర్థికసహాయం చేశారు. కొంత నిధిని సమకూర్చి ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ప్రతియేట "షోయీబ్ పత్రికా రచన"కు స్మారక చిహ్నంగా విద్యార్థులకు అవార్డులు యిస్తున్నారు. ప్రభుత్వం షోయీబ్ కుటుంబానికి పెన్షన్ ఏర్పాటుకూడా చేసింది.

షోయీబ్ తన జీవిత కాలంలో ఎన్నో బెదిరింపులను ఎదుర్కొన్నాడు. పత్రికానిర్వహణలో రోజూ చంపివేస్తామనే బెదిరింపు ఉత్తరాలు వస్తూవుండేవి. కాని వాటిని లెక్కచేయలేదు. "షోయీబ్ హత్య జరిగిన తరువాత షోయీబ్ తల్లి నిశ్చేష్టురాలయి కన్నీరుకూడా కార్చలేదు. తన కొడుకు స్వతంత్ర పత్రికారచన నిర్వహణలో అమరుడైనాడని ఆవిడ గ్రహించింది. షోయీబ్ మరణం అసాధారణమైన సంఘటన.

"నిండుగుండెతో జీవించడమే జీవితానికి వెలుగు.

లేకపోతే రోజూ ఎంతమంది పుడుతున్నారు! చస్తున్నారు."



# 7. "గోర్ట"లో హత్యాకాండ

ఈనాడు కర్ణాటకలో వున్న బీదర్ జిల్లాలో హోనల్లి అనే గ్రామం వుంది. భాల్కి - కళ్యాణ్ రైలుమార్గంలో వున్న ఈ గ్రామం ఆనాటి ఖుర్షీద్‌జాహి జాగీర్‌లోని ఒక భాగం. 1947 తర్వాతకూడా నిజాం సంస్థానంలో రజాకార్లు, కొందరు హరిజన నాయకులు నిజాం అధికారాన్ని సమర్థించారు. గోర్ట గ్రామంలో ఈనాటికీ సజీవంగా వున్న 80 సంవత్సరాల వృద్ధుడు శ్రీ ఇరశెట్టిప్పవంకే మాటలో చెప్పాలంటే ఆనాడు నిజాం గ్రామాలను పీల్చి పిప్పిచేశాడు.

1928 నుండి 1948 వరకు అంటే 20 సంవత్సరాలు హిందువులను బానిసలుగా చేసి వారి కష్టార్జితాన్ని దోచుకున్నాడు. ఎదురు తిరిగిన వాళ్ళను భూస్థాపితం చేశాడు. గోర్టలో జరిగిన మొదటి పోరాటంలో శ్రీ వంకే జుల్మానాతోపాటు సంవత్సరం జైలుశిక్ష అనుభవించాడు.

నిజాం సర్వ స్వతంత్రుడుగా ప్రకటించుకోగానే ప్రతి ముస్లింపౌరుడు తానే పాలకుడైనట్టు వ్యవహరించడం మొదలుపెట్టాడు ముఖ్యంగా అధికారంలో ఉన్నవాళ్ళు గ్రామాల్లో నిరంకుశాధికారాన్ని వెలిగించారు. అనేక


ఇరశెట్టిప్ప వంకే

గ్రామాలతో పాటు హుయానాబాద్, కళ్యాణ్, భాల్కి, రాజేశ్వర్, మోడవాడి, సాయిగాంవ్, మెహేకర్ మొదలైన గ్రామాల్లో ముస్లిం గ్రామాధికారులు ఇష్టానుసారం హిందువులను పీడించడం మొదలుపెట్టారు. హిందువులు ప్రతిఘటించడానికి దళాలుగా యేర్పడ్డారు. ప్రతీకారవాంఛ సర్వత్రా చెలరేగింది.

స్వాతంత్ర్య దినోత్సవంనాడు సంస్థానంలోని హల్‌గోర్టా, హోనలి గ్రామాల్లో హిందువులు త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశారు. ముస్లిం అధికారులు నిజాంను వ్యతిరేకించిన హిందువులను శిక్షించాలనే కక్షతో ఆ గ్రామాలకు పోలీసుల్ని పంపించారు. హల్‌గోర్టాలోని మాధవరావును అరెస్టుచేసి జెండా నేరం మోపారు. ఆ తర్వాత హోనల్లికి ఇద్దరు పోలీసులు వెళ్ళి దర్యాప్తు సాగించారు. జెండా ఎగురవేసిన నేరంపై భావురావుపటేల్‌ను అరెస్టుచేస్తామని ఆ ఇద్దరు పోలీసులు బెదిరించారు. పటేల్ ఆ గ్రామానికి ఒక విధంగా నాయకుడు. అతను ఆ ఇద్దరు పోలీసులను బంధించి గదిలో పెట్టాడు. జమేదార్ అధికప్రసంగం చేశాడని లాగి చెంపదెబ్బ వేశాడు. అరెస్టు చేయాలని వచ్చిన పోలీసువాళ్లు గ్రామంలో అరెస్టు కాబడ్డారు. అసలు గ్రామస్తులు వాళ్ళిద్దరిని తుపాకితో కాల్చివేయాలని సలహా యిచ్చారు. కానీ భావురావు పటేల్ విషమించిన పరిస్థితులదృష్ట్యా మరుసటిరోజు వారిద్దరిని వదిలిపెట్టాడు.



భావురావ్ పటేల్

హానలినుండి గోర్ట రెండు మైళ్ళ దూరంలోనే వుంది. గోర్టలో రజాకార్ల నాయకుడు హిసామొద్దీన్ వుండేవాడు హానలిలో పోలీసులపై భావు రావుపటేల్ చేయి చేసుకున్నాడని, ఒకరోజు బంధించిపెట్టాడనే వార్త చుట్టుపక్కల దావానలంలా వ్యాపించిపోయింది. హిసామొద్దీన్ తాను ఆ ప్రాంతంలో ఉండగా యిలా జరగడం పెద్ద అవమానంగా భావించి ప్రతీకారానికి వేచివున్నాడు.

## హొనలిలో దోపిడీ :

పోలీసులను నిర్బంధించి వదిలిన తరువాత రాబోయే పరిణామాలను భావురావుపటేల్ ఊహించాడు. తన సహాయం కోసం చుట్టుప్రక్కల గ్రామాలనుండి మిత్రుల్ని పిలిపించుకున్నాడు. పాతికమంది పోలీసులు తనను అరెస్టు చేయడానికి గోర్ట వచ్చారని వాళ్లకి అన్నివిధాల సహాయం చేయటానికి రెండు మూడు వందల రజాకార్లు సిద్ధంగా వున్నారనే సమాచారం భావురావుపటేల్‌కు అందింది. అయితే పటేల్ బలగం యెంత వుందో అంచనా దొరకక పోలీసులు అక్కడే ఉండిపోయారు. భావురావుకుసహాయంగా వచ్చినవారిలో కళ్యాణ్ గ్రామవాసి శ్రీ గోపాల్‌దేవ్ ఒకరు. తుపాకులు, ఇతర ఆయుధాలు వున్న పోలీసులు గ్రామాన్ని చుట్టుముడితే ప్రయోజనం లేదని అనవసరంగా ప్రాణాలు వదలడమే అవుతుందని, ఆయుధాలు సేక

రించటం అవసరమని గోపాల్‌దేవ్ సలహా యిచ్చారు. అందరూ ఆ సలహాను ఆమోదించారు. ఆ రోజంతా రజాకార్లు వస్తారేమోనని ఎదురుచూసిన పటేల్ తదితరులు మరుసటిరోజు జానాపూర్, సాయెగాంవ్ గ్రామాలకి వెళ్ళిపోయారు.

హోనల్లినుండి పటేల్ తదితరులు వెళ్ళిపోయారనే వార్త తెలుసుకుని హిసామొద్దీన్ తన రజాకార్ల ముఠాతో దాడి చేశాడు. హోనలి గ్రామాన్ని ఇష్టానుసారం దోపిడీ చేశాడు. భావురావు పటేల్ ఇంటిని దోచుకొని నిప్పు పెట్టాడు. నిరాయుధులైన గ్రామస్తులు ప్రతిఘటించలేక పోయారు.

పటేల్ తన గ్రామానికి పట్టిన దురవస్థను విని కోపంతో వణికి పోయాడు. అతని ఆత్మాభిమానం బాగా దెబ్బతిన్నది. ఏ విధంగానైనా హిసామొద్దీన్‌ను తుదముట్టించాలని ప్రతిజ్ఞ చేశాడు రజాకార్ల వేషాలు వేసుకొని తన మిత్రులతోబాటు దారి కాచాడు. గోర్టానుండి వ్యాపార నిమిత్తం కళ్యాణ్‌కు ప్రజలు వెళ్ళి వస్తూ వుండేవాళ్లు. ఈ దారి మధ్యలోనే హిసామొద్దీన్‌ను యే విధంగానైనా పట్టుకోవాలని పటేల్ వేచి వున్నాడు. నెల రోజులు గడిచిపోయినా హిసామొద్దీన్ ఆ దారిగుండా వెళ్ళలేదు.

చివరికి ఒకరోజు గోర్టా రైతులు హిసామొద్దీన్‌కు లంచమిచ్చి తమ వెంట రక్షణగా రావలసిందని కోరారు. తన నలుగురు అనుచరులతోపాటు హిసామొద్దీన్ తుపాకులు తీసుకొని బయలుదేరాడు.

ఈ విషయం భావురావుపటేల్‌కు తెలిసింది. అతను తన మిత్రులతో బాటు దారిమధ్య ఒక కాలువ గట్టుక్రింద రాత్రంతా వేచివున్నాడు. నలభైయెదు బండ్లు దాదాపు డెబ్భై మందితోబాటు వస్తున్నాయని, వాళ్ళంతా హిందువులనే విషయం పటేల్‌కు తెలుసు. దాదాపు రాత్రి గడిచిపోయింది. తన పద్నాలుగు మందిమిత్రులతో పటేల్ ఎదురుచూచి విసిగెత్తిపోయాడు.

మొదట్లో కొన్ని బండ్లు అటు వైపు రాగా పటేల్ బృందం అటకాయించింది. కానీ బండ్లలో హిసాముద్దీన్ లేడు. తర్వాత తెల్లవారుతుండగా గోర్టా రైతుల బండ్లు కాలువ దగ్గరికి చేరుకున్నాయి. పటేల్ బృందం బండ్లను ఆపవలసిందని హెచ్చరించింది. రజాకార్ల వేషాల్లోవున్న పటేల్ మిత్రుల్ని రైతుల్ని చూసి మొదట బండ్లలోవున్న రైతులు రాళ్లు విసరటం మొదలుపెట్టారు. తాము



రామారావు పాటిల్

హిందువులమని హిసాముద్దీన్ యెక్కడున్నాడో చూపితే చాలునని కేకలేసి చెప్పారు. బండ్లమధ్య నున్న హిసాముద్దీన్‌ను పటేల్ బృందం చుట్టుముట్టింది. ఈలోగా రామారావుపాటిల్ బొరోల్ అనే వ్యక్తి ధైర్యంగా హిసాముద్దీన్ తలపై తుపాకీ మడమతో కొట్టాడు. రజాకార్ల నాయకుడు పడిపోగానే మిగతా నలుగురు అనుచరులు పరుగెత్తి పారిపోయారు. హిసాముద్దీన్‌ను పటేల్ తుపాకీతో కాల్చి తన ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నాడు. హోనలిని దోచిన రజాకార్లకు బుద్ధిచెప్పాడు

ఆ తర్వాత భావురావుపటేల్ తన మిత్రులతోబాటు నిజాం సరిహద్దుల్ని దాటి తప్పించుకున్నాడు. పోలీసు చర్యతరువాత పటేల్ తనదళంతోబాటు లింగదల్లి గ్రామాన్ని విముక్తిపరచి అక్కడ త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశాడు.

## ముచలమ్‌లో హింసాకాండ :

హిసామొద్దీన్ పటేల్ చేతుల్లో చనిపోవడం తమకు ఘోరమైన ఓటమిగా రజాకార్లు భావించారు. పటేల్‌ను ఏవిధంగానైనా నిర్బంధించాలని శతవిధాల ప్రయత్నించారు. కానీ అతను ఏనాడో సరిహద్దుల్ని దాటివెళ్ళి పోయాడు. ప్రతీకారహింసతో చెలరేగిన రజాకార్లను చూసి హిందువులు భయపడిపోయారు.

రజాకార్లు పటేల్‌కు ఆశ్రయం ఇచ్చిన వ్యక్తుల్ని వెదకసాగారు హిసామొద్దీన్‌ను అంతంచేసేముందు పటేల్ ముచలమ్ అనే గ్రామంలో శరణప్ప పటేల్ ఇంట్లో ఉండేవాడని అక్కడనుండి తన కార్యకలాపాలు కొనసాగించాడనే విషయాన్ని తెలుసుకున్నారు. భావురావుపటేల్ బదులు అతనికి ఆశ్రయమిచ్చిన మిత్రుల్ని నాశనం చేయాలని రజాకార్లు నిర్ణయించుకున్నారు. ఆవిధంగా తమ ప్రతీకారవాంఛను చల్లార్చుకోవాలని కుట్రపన్నారు.

ఒకరోజు సాయుధులైన రజాకార్లు ముచలం గ్రామాన్ని నలువైపులనుండి చుట్టుముట్టి వేశారు. తుపాకులు కాలుస్తూ గ్రామస్తులను భయకంపితులను చేశారు. దాదాపు గ్రామమంతా ఇళ్ళలో తలుపు-వెనుక దాక్కున్నది. కాల్పులు కొనసాగిస్తూ రజాకార్లు గ్రామాలలోకి ప్రవేశించారు. శరణప్ప పటేల్ ఇంటిపై దాడిచేశారు, నిరాయుధుడైన శరణప్ప. తనభార్య ఇద్దరుపిల్లలతో ఇంట్లో తలుపులు బిగించుకొని కూచున్నాడు. రజాకార్లు ఇంటిపై కిరసనాయిలుచల్లి నిప్పు అంటించారు. ఎవరూరాకుండా కాల్పులు సాగిస్తూనేవున్నారు. ఇల్లుమొత్తం కాలి ఆ మంటల్లో శరణప్ప, అతనిభార్య, పిల్లలు బూడిదై పోయారు. తర్వాత రజాకార్లు కసిదీరక గ్రామాన్ని దోచుకొని హింసాకాండ సాగించారు. శరణప్ప వంశాన్ని మొత్తం నాశనం చేశా

మని రజాకార్లు తృప్తిపడ్డారు. కానీ ఆ సమయంలో ఇంట్లోలేని శరణప్ప తమ్ముడు మాత్రం బ్రతికిపోయాడు.

## గోర్టలో అమానుషాలు :

ఆ తర్వాత గోర్ట గ్రామంపై రజాకార్లకన్నుపడింది. అసలు 1928 లోనే ఒకసారి ఒక మసీదు నిర్మాణ విషయంలో హిందూముస్లింలమధ్య ఘర్షణజరిగింది. గోర్టలో హిందువులు ఎదురు తిరిగారనే నేరంపై రెండు వందలమంది పోలీసులు ఐదువందలమంది ముస్లింలు హిందువులను దోచు కున్నారు. పైగా నలభై ఆరుమంది హిందూయువకులపై కేసులు పెట్టి అందులో ముప్పై రెండుమందికి పాతికేసిరూపాయచొప్పున జుర్మానావిధించి సంవత్సరంబాటు జైలుశిక్ష విధించారు. ఇదీనిజాంపాలనలో జరిగిన న్యాయం.

తిరిగి ఈనాడు గోర్టపై రజాకార్లు దాడిచేయటానికి కుట్రలు పన్న సాగారు. గోర్టలో ధనవంతులు చాలామంది ఉన్నారు. ముస్లింల కుటుంబాలు కూడా చాలానేఉన్నాయి. ఆ గ్రామంలో చుట్టుప్రక్కల ప్రాంతాల్లో రజా కార్లనాయకులు చాలామంది ఉన్నారు. హిసామొద్దీన్ ఆగ్రామంలో పుట్టిపెరి గినవాడే. అసలు హిసామొద్దీన్ తాత హిందువు. అల్లర్లు జరిగిన సందర్భం లో హిసామొద్దీన్అవ్వ తన చిన్నకొడుకు భద్రప్పతో ఒక ముసల్మాన్ ఇంట్లో ఆశ్రయం పొందింది. తరువాత భద్రప్ప బద్రోద్దీన్‌గామారిపోయాడు. అతని కొడుకే హిసామొద్దీన్. ఇక గోర్టాముస్లింలు ఏవిధంగానైనా ప్రతీ కారాన్ని అమలు జరపాలని ప్రయత్నించ సాగారు. హిసామొద్దీన్ హత్య జరిగినరోజు నలభై ఐదు బండ్లతోపాటు వెళ్ళిన రైతులనందరిని పోలీసులు పట్టుకవెళ్ళి తీవ్రంగా చితుకగొట్టారు. అందులో రామశెట్టిప్ప, సింగప్పదివరే అనే రైతులను ప్రత్యేకంగా పోలీసులు నిర్బంధించి, ఆ హత్యతో గ్రామం లోని షావుకారు మహాదేవప్ప డుమనేకు హరశెట్టిప్పపటేలు సంబంధం



ఢుమనే ఇల్లు

వుందనే అబద్ధాన్ని సాక్ష్యంగా చెప్పమని వొత్తిడి తీసుకువచ్చారు. దెబ్బలు తిని కూడా ఆఇద్దరువ్యక్తులు అబద్ధమాడలేదు.

గోర్టలో శాంతిభద్రతలను కాపాడటంకోసం పోలీసులు క్యాంపు వేశారు. ఈలోగానే రజాకార్లు పగటిపూట పంటపొలంలో పనిచేసుకొంటున్న పోలీస్‌పటేల్ గురుపాదప్పను హత్యచేసి నదిలో సగందాకా పాతిపెట్టారు. హత్యజరిగినపుడు చూసిన రైతులను ఆ విషయాన్ని బయటపెడితే చంపి వేస్తామని బెదిరించారు.

ఆతర్వాత పోలీసులు షావుకారు మహాదేవప్ప ఢమనేను బాధించ సాగారు. ఆయన ఇంట్లోచాలారకాల ఆయుధాలువున్నాయని వాటిని స్వాధీనం చేసుకోవాలని వాళ్ళ ప్రయత్నం చివరికి పోలీస్-సబ్ ఇనస్పెక్టర్ ఇంటిపై దాడిచేసి కూడాఎలాంటి ఆయుధాల్ని పట్టుకోలేకపోయాడు. ఈలోగానే ప్రభుత్వంవారి తాఖీదుననుసరించి లైసెన్సువున్న తన తుపాకిని మహా దేవప్ప పోలీసులకు అప్పగించాడు.

చైత్ర అమావాస్య. నాడు సూర్యగ్రహణంరోజు, గ్రామస్తులు మరుసటి రోజు పండుగ చేసుకొనే ఏర్పాట్లలో ఉన్నారు. రజాకార్లు హత్యాకాండ చేయాలనే ప్రయత్నాలు సాగించారు. సహాయంగా కొందరు పస్తిఅక్వామ్‌లు తోడైనారు. ఆరోజు ఉదయం ఎనిమిది గంటలనుండి హత్యాకాండ ప్రారంభమైంది. మోరవాడి, హుమ్నాబాద్, భాల్కి, కళ్యాణ్, బేటార్ తదితర గ్రామాలనుండి మొత్తం రెండువేలమంది రజాకార్లు గోర్టాలో సమావేశమయ్యారు. ఎవరైన ప్రతి హిందువుని ఇంట్లోకి చొరబడి అమానుషంగా బయటకులాగి తలను నరికి వేయటం మొదలైంది. ఆ ఘోరహింసా కాండను వర్ణించడం సాధ్యంకాదు. భీమ్‌రావ్ పటేల్, ఆయన భార్య తమ పిల్లలను సంరక్షించుకోటానికి విశ్వ ప్రయత్నం చేశారు. రజాకార్ రసూల్‌కు 40తులాల బంగారం ఇచ్చివేసి తమ పిల్లల్నిమాత్రం రక్షించమని వేడుకున్నాడు రసూల్ తాను రక్షణగా ఉంటానని హామీ ఇచ్చాడు. కానీ మరుక్షణంలోనే అతని సైగపై బేలూర్ రజాకార్లు పటేల్ ఇంట్లోకి చొరబడి తల్లిదండ్రుల ఎదుటనే పెద్దకుమారుడైన బసప్పను చంపివేశారు. భీమ్‌రావ్ తలను సగం నరికి పిడకలపై శరీరాన్ని కాల్చివేశారు. చిన్నవాడు తప్పించుకొని పారిపోతుండగా త్రోవలో పట్టుకొని నరికివేశారు. తన కళ్ళఎదుట జరిగిన ఈ హింసాకాండను చూసి ఆ స్త్రీ ఎంత నరకయాతనకు లోనైనదో చెప్పలేము. రామారావుపట్వారి, నారాయణరావు ముక్తేదార్‌లను బయటకు ఈడ్చి బహిరంగంగా కాళికాలయం ఎదుట తలలను నరికి విగ్రహంపై రక్తాన్ని పులిమారు

మాలీపటేల్ బసప్ప. లింగాయత్ మఠంలోని రాజయ్య. స్వామి గునీప్పకణజే తదితరులందరిని క్రూరంగా హత్యచేశారు.

ఒకఇంట్లోని మగవాళ్ళనందరిని లాగి నరకటం ప్రారంభించారు. మిగిలిన ఒక తమ్ముడ్నికూడా బయటకులాగి క్రిందపడవేసేసరికి గర్భవతి

యైన అక్కచెల్లెళ్ళు అతనిపై బడి రోదించసాగింది. రాక్షసులైన హంతకులు పాశవికమైన పద్ధతిలో ఆమెను ఈడ్చి నడుంపైతన్నారు. ఆమె అక్కడే ప్రసవించి చనిపోయినది. ఆనాడు బతికి బయటపడ్డ పిల్లవాడు ఈనాటికి "బాబు" అనేపేరుతో సజీవంగా ఉన్నాడు.

గ్రామంలో ఆరోజు పాశవికపాలన సాగింది. రాక్షసమైన ప్రవృత్తితో కనబడిన ప్రతిస్త్రీపై అత్యాచారం చేశారు. ఎంతోమందిస్త్రీలు రజాకార్ల కామానికి బలై పోయారు. ఎవరూ ఆ రాక్షసచర్యలను అడ్డుకొనేవాళ్ళు కనబడలేదు. ఆ ఒక్కరోజు హత్యకాబడిన యాభై మందిలో కొంతమంది పేర్లుఇవి :—

అనిరుద్దప్ప, మలుశెట్టి, జగశెట్టి, శివప్ప, ధన్‌గర్, శివప్ప మైత్రి, మారుతి అప్పకొనే, ధూలప్పకణజే, రామారావు వటజే, గురప్పకణజే, భీమన్న రాజోలె, శరణప్పకనకటీ, చిన్నప్పబరాదర్, గురప్పబరాదర్, కాశప్ప మఛకంటి, వీరూపాక్షప్ప మశపతి, బసవప్పవంకే మొదలైనవాళ్ళు.

## వీరుడు నాగన్న :

గ్రామంలో కొనసాగుతున్న హత్యాకాండను తప్పించుకొని దాదాపు ఐదువందల మంది పెద్దలు, పిల్లలు షావుకారు మహాదేవప్ప డుమనే ఇంట్లో తల దాచుకున్నారు. డుమనే ఇల్లు చిన్న కోటలాంటిది. రెండంతస్థులమేడ. చుట్టూరా గోడ. రెండో అంతస్థుపై ముగ్గురు వ్యక్తులు తుపాకులతో వారిని కాపాడారు. డుమనే ఇంట్లో చాల ఆయుధాలున్నాయని దాడి చేయడం సాధ్యం కాదని రజాకార్లు ఎదురుగావున్న ఇంటిపై నుండి ఎదురు కాల్పులు కొనసాగించారు. ఫలితంగా మారుతి అప్పకొనే, చిన్నప్పబరాదర్, డుమనే మేడపైనే ప్రాణాలు వదిలారు. మహాదేవప్ప ఇంటిపై నుండి కాల్పులు సాగించిన వ్యక్తులలో ముఖ్యమైనవాడు — హాలంబిరే నాగన్న. అతని

దగ్గర ట్వెల్వ్‌బోర్ తుపాకి, మిగతా ముగ్గురి దగ్గర మూడు తుపాకులు మాత్రం వున్నాయి. వాటితోనే దాదాపు 15 మంది రజాకార్లను నేలకూల్చి వేశారు. శివరాముడి భుజంలోంచి గుండు దూసుకుపోయింది. హాలంబరే నాగన్నతోబాటు, కాశప్పభాల్కె, సిద్ద రామప్పవటవే దినమంతా అలసిపో కుండా రజాకార్లను త్రిప్పికొడుతూనే వున్నారు. నాగన్న వీరోచితమైన చర్యవల్ల ఐదువందల మంది ప్రాణాలు దక్కిపోయాయి. లేనిపక్షంలో ఆనాడు వాళ్ళను రజాకార్లు ఊచకోత కోసేవాళ్ళే. చీకటిపడగానే రజాకార్లు వెనక్కి తగ్గిపోయారు. మహాదేవప్ప ఇంట్లోనుండి దాడి జరగగలదనే భయంతో గ్రామంనుండి రజాకార్లు వెళ్ళిపోయారు. ఆ చీకటి ఆసరాతో ఐదు వందల మంది గోర్టాను ఖాళీచేసి సురక్షితమైన ప్రాంతాలకు తరలిపోయారు. డుమనే ఇల్లు సాంతం ఖాళీ అయిపోయింది.

మరుసటిరోజు రజాకార్లు తిరిగి గోర్టాపై దాడి జరిపారు. కాని స్మశానంగా మారిపోయిన గ్రామంలో ఒక్క ప్రాణి కనిపించలేదు. శవాలపై ఎగురుతున్న రాబందులు, కాకులు తప్ప మరేం కనబడలేదు. రజాకార్లు కాల్పులు జరుపుతూ, డుమనే ఇంటి సమీపానికి వచ్చి ఎదురుదాడి జరుగు తుందేమోనని ఎదురుచూశారు. కానీ ఎలాంటి అలికిడి లేనందువల్ల రజాకార్లు చిన్న కోటలాంటి ఆ ఇల్లును సాంతం దోపిడీ చేశారు. పాతిపెట్టిన బంగారం యేదైనా దొరుకుతుందేమోనని ఇంటి నేలంతా త్రవ్వి పారేశారు. చివరికి నిప్పు అంటించారు. రాతిగోడలు తప్ప అన్ని కాలి కాలిపోయాయి.

డుమనే ఇంటి దోపిడీ జరుగుతుండగా జానాపూర్‌నుండి త్రివర్ణ పతా కాన్ని పట్టుకొని కొందరు హిందూ యువకులు సహాయార్థం గోర్టా చేరు కున్నారు. జెండానుచూసి కూడా కాల్పులు కొనసాగిస్తున్న విషయాన్ని పసిగట్టి ఆ యువకులు తిరుగుముఖం పట్టారు. ఆ బృందంలో ముచలమ్ గ్రామానికి చెందిన నలుగురు యువకులు కూడా వున్నారు. వాళ్లు నలుగురూ

తోగలూర్ గ్రామంలోని తమ బంధువులను కలుసుకోవాలని బృందం నుండి విడిపోయి, మరోదారిన వెడుతుండగా రజాకార్లు పైనుంచి చూసి పసిగట్టారు. వాళ్ళను వెంబడించి తోగలూర్ గ్రామంలోకి పోయి భోజనానికి ఉపక్రమించిన ఆ నలుగురు యువకుల్ని బయటకు లాగి చంపివేశారు. హత్యే చేయబడిన ఆ యువకుల పేర్లు : మాదప్ప, కంటప్ప. రామిశెట్టి, అలడప్ప.

గోర్టాపై సాగిన పైశాచిక హత్యాకాండ తర్వాత నెలల తరబడి ఆ గ్రామాన్ని ముస్లింలు లూటీ చేశారు. కొందరు పస్తీఅక్వాంల సహాయంతో గ్రామంలోని ధాన్యం, రేకులు, రూపాయలు, వెండి బంగారం, తలుపులు, కిటికీలు, బట్టలు, పశువుల్ని ఏది చేతికి దొరికితే అదే దోపిడీచేశారు. అక్కడి భూముల్ని ఇళ్ళను రజాకార్లు పంచుకొన్నారు. ఇంత ఘోర హింసాకాండ, దోపిడీ జరిగిన తర్వాతకూడా పాలకవర్గానికి చీమ కుట్టినట్టు కూడా కాలేదు. పోలీస్ చర్య తర్వాత వినోబాభావే ఈ గ్రామానికి ప్రత్యేకంగా వెళ్ళి నిర్వాసితులైన గ్రామస్థులకు ఆ గ్రామాన్ని తిరిగి అప్పగించారు.

ఆనాటి విషాదకరమైన సంఘటన ఈనాటికీ ఎవరూ మరచిపోలేదు. తాముచేసిన పాశవికచర్యలకు పశ్చాత్తాపంగా ఆ గ్రామంలో ఈనాడు ఒక ముస్లింకూడా నివసించడంలేదు. సగం బూడిదపాలైన గోర్టా స్వాతంత్ర్యం పొందికూడా యీనాటికీ తన గాయాలని మరచిపోకుండా వుంది.

# 8. బీబీనగర్ దోపిడి

నిశ్శబ్దంగావున్న బీబీనగర్ రైల్వేస్టేషను ప్లాట్‌ఫారంపై అకస్మాత్తుగా నినాదాలు వినవచ్చాయి. దాదాపు 12 మంది యువకులు "మహాత్మాగాంధీకి జై, భారతమాతకి జై, స్టేట్ కాంగ్రెస్ జిందాబాద్" అనే నినాదాలతో దిక్కులను మార్మోగిస్తున్నారు. స్టేషను గదులలోని జనమంతా ఆశ్చర్యంగా బయటకువచ్చి చూడసాగారు. పరిచయమున్న యువకులే ఆ నినాదాలు చేస్తున్నారు. బీబీనగర్‌లో బియ్యంకొరత ఉన్నందువల్ల రోజూ జనగామవెళ్ళి బియ్యంసంచులు మోసుకొచ్చే ఆ యువకులే ఈనాడు ఉత్సాహంగా నినాదాలుచేస్తూ రోడ్డువేపు పరుగిడుతున్నారు. అంతకుపూర్వమే దూరంనుండి "జిందాబాద్" అనే చప్పుడు జనానికి వినబడింది.

మెయిన్‌రోడ్డుపైకి వెళ్ళగానే ఎదురుగా రెండులారీలు, ఒక జీపు కనపడ్డాయి. ఆ వాహనాలు ఆగిపోయాయి. వాటిలోనుండి సాయుధులైన రజాకారులు దిగి నినాదాలుచేస్తున్న యువకులను తరమడం ప్రారంభించారు. కాంగ్రెసు కార్యకర్తలని భ్రమపడిన యువకులకు త్వరలోనే వాస్తవం తెలిసిపోయింది. యువకులంతా బీబీనగర్ గ్రామంలోకి పరుగు లంఘించారు. వారిలో లవంగ అచ్చయ్య ఒకడు.



లవంగ అచ్చయ్య

హైద్రాబాద్-విజయవాడ రైల్వే మార్గంలో బీబీనగర్ స్టేషను ఉంది ఇది హైద్రాబాద్‌కు 80 మైళ్ళ దూరంలో ఉన్న గ్రామం. ఒకప్పుడు నిజామ్‌కు సంబంధించిన ఒక బేగమ్‌పేర నెలకొన్న గ్రామం. ఊరు చుట్టూ దాదాపు కూలిపోయిన గోడ – పెద్ద ద్వారాలు–మధ్యలో ఒక కూడలి ఉన్నాయి.

**1948** జనవరి పదవ తేదినాడు ముస్త్యాలపల్లి రజాకార్ల నాయకుడు ఛోటేమియా రజ్వీ గౌరవార్థం పెద్ద విందు చేశాడు. ముజ్లీస్ ఇత్తెహాదుల్ - ముస్లిమీన్ సంస్థ అధ్యక్షుడు, రజాకార్ల సాలారే అజమ్, కాయదేసిద్దిక్ ఫీల్డ్‌మార్షల్ ఆలీజనాబ్ కాసింరజ్వీ ఆ విందుకు హాజరైనాడు. రజ్వీ పలుకుబడి హైద్రాబాద్ సంస్థానంలో అప్పటికే అన్నిరంగాల్లోకి వ్యాపించింది. చివరికి రియాసత్ ప్రధాని మీర్ లాయక్ ఆలీ కూడా అతని సిఫార్సువల్లనే పదవిలోకి వచ్చాడు. మీర్జా ఇస్మాయిల్, నవాబ్ ఛత్రీ లాంటి ప్రధానమంత్రులు రజ్వీ వత్తిడివల్ల పదవుల్లోంచి తొలగించబడ్డారు. ఆదరణలో పాలకుడుగా రజ్వీకి ఛోటేమియా భువనగిరి తాలూకా తదితర ప్రాంతాలలో కుడిభుజంగా పని చేశాడు. రజ్వీని పరోక్షంగా తన ప్రతినిధిగా నియమించి నిజాం తన స్వతంత్ర పాలనను కొనసాగించాలని ప్రయత్నించాడు. రజ్వీ చేతుల్లోవున్న రజాకార్ల సైన్యం రోజుకు మూడువేల రూపాయలు ఖర్చుపెడుతూవుండేది. అలాంటి రజ్వీ

తన విందుకు రావడం ఖోటేమియాకు గర్వకారణమైంది. భువనగిరి తాలూకా లోని ముస్త్యాలపల్లి కేంద్రంగా ఖోటేమియా కొంతకాలం మకుటంలేని మహారాజుగా ప్రజలను ఏలించాడు. రజ్వీ అండదండలతో గ్రామాలను దోచి ప్రజలను వణికించేశాడు.

ముస్త్యాలపల్లిలో జరిగిన ఈ విందుకు రెండు లారీల నిండావున్న సాయుధులైన అంగబలంతో రజ్వీ జీప్‌లోవచ్చాడు. ఆ విందుకు కొలిపాక తహశీల్దార్, మోత్కూరాగద్దం అమీన్, భోనగిరి డిప్యూటీ కలెక్టర్, గూడూర్ మీర్ ఖాదర్ అలీఖాన్, సికింద్రాబాద్ మొహ్మద్ హాజీ మొదలైన భూస్వాములు కూడా హాజరైనారు. వేల సంఖ్యలో రజాకార్లు కూడా యీ విందు భోజనం చేశారు. ఆనాడు సంస్థానంలో బియ్యం కొరతవల్ల విందులపై ఆంక్షలున్నా వీళ్ళకు మాత్రం ఏ అడ్డంకీ లేదు. గ్రామాలపై బడి బల వంతంగా బియ్యం, కోళ్లు, పాలు, నెయ్యి దోచుకవచ్చి పెద్దఎత్తున విందు చేశాడు ఖోటేమియా.

ముస్త్యాలపల్లిలో ఆరోజు విందు ముగించుకొని రజ్వీ తన జీపు, రెండు లారీలతో దారిపొడుగునా నినాదాలు చేస్తూ హైద్రాబాద్ తిరిగి వస్తున్నాడు. సాయంత్రం 4 గంటల ప్రాంతంలో రజాకార్లు "ఆజాద్ హైద్రాబాద్ పాయిందాబాద్, షాహే ఉస్మాన్ జిందాబాద్, కాయదే మిల్లత్ సిద్దిక్ కాసింరజ్వీ జిందాబాద్" అని అరుస్తూ బీబీనగర్ ప్రవేశించారు. అప్పుడే పై సంఘటన జరిగింది. స్టేట్ కాంగ్రెసు కార్యకర్తలు సత్యాగ్రహంచేసి వస్తున్నారేమోనని భ్రమపడి ఉత్సాహంగా ఎదురువెళ్ళిన యువకులకు రజాకార్లు ఎదురైనారు.

## దోపిడీ కాండ :

వెనుకాల తరుముకొస్తున్న సాయుధులైన రజాకార్లు గ్రామంలోమొదట స్టేషను మాస్టర్ ఆంజనేయులు ఇంట్లోని 30 తులాల బంగారం ఎత్తుకు

పోయారు. ఆ తర్వాత గ్రామంలో చొరబడి గుడిసెలకు నిప్పు అంటించారు. క్రమ క్రమంగా చాలా ఇండ్లు తగలడిపోయాయి. గ్రామస్తులను చెదరగొట్టాలనే ఉద్దేశంతో గాలిలో కాల్పులు సాగించారు. భయపడిపోయిన గ్రామ ప్రజలు తలుపులు మూసికొని ఇళ్ళలో తలదాచుకొన్నారు. స్వయంగా కాసిం రజ్వీ జీప్‌తో బాటు గ్రామంలోకి ప్రవేశించి, తనపర్యవేక్షణ కింద ధనవంతుల ఇళ్ళను దోపిడీ చేయించాడు. పట్టండి, కొట్టండి నరకండి అనే కేకలతో వాతావరణం నిండిపోయింది.

ఉపాధ్యాయిని రత్తమ్మ ఇంట్లోకి చొరబడి తుపాకిచూపిఆమెబంగారు కడియాలు, ఉంగరాలు లాక్కున్నారు. అయ్యవారు పురుషోత్తమాచారిఇంట్లోకి వెళ్ళి 1200 తులాల వెండి, బంగారం, డబ్బుదోచుకుని ఆచారిని తాళ్ళతో బంధించి తీసుకువచ్చారు. వ్యాపారస్తుడైన వైశ్యమల్లయ్యగారి శివయ్యను కూడా విపరీతంగాకొట్టి ఆస్తినంతా దోచివేశారు. ఆతర్వాత బంగారు రాజయ్య ఇంటిని దోచారు, కాని రాజయ్య భయకంపితుడై పారిపోతూ బావిలోపడి తీవ్రంగా గాయపడ్డాడు. బంజరి బాలయ్య ఇంటిపై బడి అతన్ని తీవ్రంగా కొట్టారు. దొరికిన వెండి, బంగారు నగలు దొంగిలించారు. చాలా మందిని తాళ్ళతో కట్టి రజ్వీ ముందు వరుసగా నిలచోబెటారు.

ఫీల్డ్‌మార్షల్ కాశింరజ్వీ కళ్ళ ఎదుట బీబీనగర్ పట్ట పగలే దోచుకోబడింది. దాదాపు అన్ని ఇళ్ళలోని డబ్బు, వెండి, నగలు లాక్కోబడ్డాయి, ఇళ్ళు తగులబెట్టి వీలున్న చోటల్లా మానభంగాలు చేయబడ్డాయి. రెండు గంటల పాటు ఆ గ్రామాన్ని పిశాచాలు రాజ్యమేలి విజయోన్మాదంతో ఊగిపోయాయి. నిజాం తన స్వతంత్ర ప్రతిపత్తికోసం రజాకార్ల చేతుల్లోకి తన ప్రజలను ఎంత అమానుషంగా నెట్టివేశాడో బీబీనగర్ ఒక చారిత్ర్యాత్మకమైన ఉదాహరణ.

కాసింరజ్వీ తన సిగ్గుమాలిన విజయోల్లాసంతో ఇరవై మంది గ్రామస్తులను బందీలుగా తీసుకొని ఊరిబయిటికి వచ్చాడు. కస్టమ్సు కార్యాలయం ఎదుట ఆ బందీలను ఉద్దేశించి కాసింరజ్వీ ఉపన్యసించాడు. ప్రభుత్వంతో సహకరించి రజాకార్లకు సహాయపడని పక్షంలో జీవించడం కష్టమని ఊరివాళ్ళను బెదిరించాడు. ఆ బందీలైన గ్రామస్తులందరిని తర్వాత వదిలివేసి నినాదాలు చేసుకుంటూ రజ్వీ తన మందీ మార్బలంతో తిరిగి వెళ్ళిపోయాడు.



కాసిం రజ్వీ

తర్వాత బీబీనగర్‌లో శ్మశానం లాంటి స్తబ్ధత వ్యాపించింది. ఇళ్ళు కాలుతున్నాయి. దోచబడిన వ్యక్తులు విలపిస్తున్నారు. ఎటు చూసినా నీరస వాతావరణం వ్యాపించింది. ఈలోగా రాత్రి పది గంటలకు లారీల చప్పుడు వినబడింది. హెడ్‌లైట్ల వెలుగు చీకటిని చీల్చుకుంటూ వచ్చింది. కుక్కలు మాత్రం మొరుగుతున్నాయి. గ్రామస్తులందరు మళ్ళీ ఏమిటీ కొత్త ఉపద్రవం అని భయకంపితులైనారు.

## నిజాం రెండు కళ్ళు :

స్టేషనుమాస్టర్ ఆంజనేయులు పంపిన టెలిగ్రాఫిక్ వర్తమానం అందుకొని రైల్వే అధికారులు బందోబస్తు కోసం అంబర్‌పేట రిజర్వుపోలీసులను వెళ్ళమని కోరారు. ఆ రిజర్వు పోలీసుల లారీలే రాత్రి పదిగంటలకు

ప్రవేశించాయి ఈ పోలీసు బలగానికి రజ్వీ దళానికి దారి మధ్యలో భేటీ జరిగింది. మంతనాల ఫలితం—పోలీసులు బీబీనగర్‌లోని ముస్లింకుటుంబాలను ఊరి బయిటికి తరలించి సురక్షితంగా కాపలా కాశారు. హిందువులు కోపంతో ప్రతీకారంగా ముస్లింలను చంపివేస్తారనే అనుమానంమీద ఆ పని చేశారు. మరుసటిరోజు ముస్లింలను తిరిగి ఇళ్ళకు పంపించారు.

ఆ తర్వాత పోలీసులు పటేలు, పట్వారీలను పిలిపించి తమ ఆదేశించిన విధంగా చెప్పించుకొని పెద్ద రిపోర్టు రాసుకున్నారు. రిపోర్టు సారాంశం బీబీనగర్‌పై కమ్యూనిస్టులు దాడిచేసి లూటీలు, మానభంగాలు, హత్యలు చేసి వెళ్ళిపోయారని ప్రజలంతా వాళ్ళ అత్యాచారాలకు లోనైనారని ..! పోలీసు పటేల్ ఎ. లక్ష్మీకాంతిరెడ్డి తాము గత్యంతరం లేక అబద్ధమాడవలసి వచ్చిందని తర్వాత స్పష్టీకరించారు. ఆనాడే గూఢచారి విభాగంవాళ్ళు అసలు వాస్తవాన్నికనిపెట్టి పైకి పంపించారు కాని ఫలితం శూన్యం. ఎవ్వర్నీ పట్టుకోలేదు— ఎవ్వర్నీ దండించనూ లేదు.

పై సంఘటన జరిగిన రెండురోజుల తరువాత "డెక్కన్ క్రానికల్" "ఇమ్‌రోజ్" లాంటి దినపత్రికలు నిర్భయంగా ఆనాడు జరిగిన దోపిడి గురించి వాస్తవాన్ని ప్రకటించాయి. అంతకు పూర్వమే ప్రముఖులైన వ్యక్తులు శ్రీయుతులు బి. రామకృష్ణారావు, బి.లక్ష్మారెడ్డి, కాశీనాథ్‌రావ్‌వైద్య, వినాయక్‌రావ్‌విద్యాలంకార్ తదితరులు వెళ్ళి స్వయంగా విచారణ జరిపారు.

పోలీసు బందోబస్తు జరిగినతరువాత క్రమంగా హిందువులు చాలా మంది ఇళ్ళకు తిరిగి వచ్చారు పోలీసు పటేల్ ఎ. లక్ష్మీకాంతరెడ్డిని మాత్రం పోలీసులు తమ నిఘాలో వుంచేవారు. ఆ తర్వాత కూడా ప్రజలు భయానికిలోనై జీవిస్తూవచ్చారు. హిందువులు ముస్లింలు తనకు రెండు-కళ్ళ వంటి వారని గొప్పలు చెప్పుకొనే ఘనత వహించిన నిజాం ప్రభువు నటన డాంబికాలు ఈ సంఘటనవల్ల విస్పష్టమైనాయి.

## అన్నను మించిన తమ్ముడు :

కాసింరజ్వీ తమ్ముడు తయ్యబ్‌రజ్వీ ఆ రోజులలో అన్నతో సమానంగా తన ఘనతనుకూడా నిరూపించుకోడానికి ప్రయత్నించాడు. బీబీనగర్ దోపిడీతర్వాత తయ్యబ్‌రజ్వీ శిస్తు వసూళ్ళకనివచ్చి ప్రత్యేకంగా క్యాంపు వేశాడు. తాను ఇతరులసహాయంతో కమ్యూనిస్టులను అణచివేయడానికి శ్రమపడుతున్నానని చెప్పి గ్రామాలనుంచి బలవంతంగా చందాలు వసూలు చేయించాడు.

స్వతంత్ర హైద్రాబాద్‌కి అడ్డుగా ఈ "హిందూ యూనియన్" (ఇండియన్ యూనియన్‌కు రజాకార్లు పెట్టినపేరు) అనేది నిలుచున్నదని, సంస్థానంలో కొందరు "ద్రోహులైన" ఏజంట్లు నిజాంకు వ్యతిరేకంగా పని చేస్తున్నారని తయ్యబ్ ప్రచారం చేశాడు. బీబీనగర్ దోపిడికి కమ్యూనిస్టులే కారకులని ఆదోపిడీ దుష్ఫలితాలను చిత్రీకరించి (ఫిల్ముగాతీసి) ప్రపంచానికి చూపుతామని అతను అనేవాడు. నిజాం తన సంస్థాన సమస్యను ఐక్యరాజ్య సమితికి తీసుకెడతానన్నాడు—తయ్యబ్ తానుతియ్యబోయె ఫిల్మును అక్కడ ప్రదర్శించి చూపుతానని చెప్పుకొనేవాడు. కాని పాపం పోలీసుయాక్షను వల్ల అతని కలలు కల్లలైపోయాయి.

ఆనాడు అధికారులు తమదుశ్చర్యలను మితిమీరిసాగించిన సంఘటనలు ఎన్నోవున్నాయి. దుండగీళ్లుగా తమ గూండా మనస్తత్వాన్ని ఆ అధికారులు ప్రదర్శించుకొనేవాళ్లు. ఒకసారి బీబీనగర్‌లోనే తయ్యబ్‌రజ్వీ క్యాంపులో ఈ గూండాలంతా చేరారు. కొలిపాక తహసిల్‌దార్, మోతుకూరు గడ్డంఅమీన్, సికింద్రాబాద్—మొహమ్మద్‌హాజీలు రజ్వీతోబాటు వున్నారు. సాయంత్రం 'చాయ్' తాగడానికి పాలు అవసరమైనాయి. గ్రామంలో ఆ సమయానికి ఎక్కడా పాలు దొరకవు. అందరు పెరుగుతోడువేస్తారు. అయినా పటేల్ లక్ష్మీకాంతరెడ్డిగారిని గ్రామంలో గాలించిరమ్మన్నారు.

ఎక్కడా పాలు దొరకలేదు. కంచెలో మేస్తున్న గేదెలను తోలుకువచ్చి న్నారు. యాభై గేదెలను తీసుకొచ్చి హాజరుపరచినా, ఒక్కటీ పాలు ఇవ్వలేదు. ఆ అధికారులు రెచ్చిపోయి – "మీ హిందూస్త్రీలను పితుకితే బోలెడన్నిపాలు వస్తాయ'ని పేలుతూ మాట్లాడాడు. ఈలోగా ఎవరోవచ్చి ఏదోరహస్యం చెప్పారు. లేనిపక్షంలో వాళ్ళు చెప్పినంతపని చేసిచూపించే వాళ్ళే! ఇక పటేల్ లక్ష్మీకాంత రెడ్డి నిస్సహాయుడై వాళ్ళ ఆజ్ఞను శిరసా వహించేవాడు. ఈదుస్థితికి, అతను తన పరిస్థితికి విపరీతంగా బాధపడేవాడు.

## కమ్యూనిస్టుల "సంహారం" :

ఒకసారి తయ్యబ్ రజ్వీ తన దళాన్ని తీసుకొని కమ్యూనిస్టుల వ్యతి రేకచర్యలు జరపడానికి బయలుదేరాడు. పిలాయిపల్లి గ్రామంపై జరిగిన ఈ దాడిలో లారీనిండా సాయుధులైన పోలీసులు పాల్గొన్నారు. కమ్యూనిస్టులను గుర్తించి చూపమని లక్ష్మీకాంత రెడ్డిగారిని వెంట బలవంతంగా తీసుకెళ్ళారు. దారిపొడుగున కనబడిన ప్రతి హిందూ గ్రామస్తుణ్ణి పట్టుకొని విపరీతంగా కొట్టారు. ప్రసిద్ధ కమ్యూనిస్టు దళనాయకుడు పాపిరెడ్డికోసం వాళ్ళు గాలించారు. దారిలో ఆ పాపిరెడ్డి కనపడినా లక్ష్మీకాంత రెడ్డి ఇంటినితగులబెట్టారు. గ్రామస్థులందరిని భయపెట్టడంకోసం కొన్ని ఇళ్ళలో దోపిడీ చేశారు. గ్రామంబయటికి రాగానే చెరువుగట్టు వెనుకనుండి కాల్పులు ఎదురైనాయి. రజాకార్లు ఎదురుకాల్పులు జరిపారు. పోలీసులు 500 రౌండ్లు కాల్చినా ఒక కమ్యూనిస్టునైనా చంపలేకపోయారు. చివరికి పోలీసులు, రజాకార్లు కమ్యూనిస్టుల ధాటికి తట్టుకోలేక ఎంకిర్యాల గ్రామంలో తలదాచుకొన్నారు.

మరొకసారి తయ్యబ్ రజ్వీదళం కమ్యూనిస్టులను పట్టుకోవాలనే యత్నంలో కొండమడుగు గ్రామంపై పడింది. గ్రామస్తులందరిని వరుసగా పడుకోబెట్టి తీవ్రంగా కొట్టారు. రజాకార్లకు ప్రతి ఒక్కడు కమ్యూనిస్టుగా కనపడసాగారు.

మరికొంతకాలం గడచినతరువాత తయ్యబ్‌రజ్వీకి కమ్యూనిస్టులు వున్న స్థలం ఆచూకి తెలిసింది. ఒకపెద్ద లారీలో సాయుధులైన పోలీసులను రజాకార్లను తీసుకొని దాడికి బయలుదేరారు. వెంట విడిగా ఒకజీపులో అధికారులు కూర్చున్నారు. బీబీనగర్ క్యాంపునుండి బయలుదేరిన ఈదళం లో ముస్లిం శరణార్థులుకూడా ఉన్నారు. సంస్థానంలో హిందువుల సంఖ్యతో సరిసమానంగా ముస్లింలసంఖ్య పెంచాలనే వుద్దేశ్యంతో నిజాం రాష్ట్రం వెలుపలినుండి అనేకమంది ముస్లింలను రప్పించాడు. వాళ్ళు ఇస్లాం రక్షణఅనే దీక్షతో రజాకార్లతోబాటు హత్యాచారాల్లో పాల్గొన్నారు. ఈసారి తయ్యబ్ రజ్వీ తమతోబాటు పటేల్ లక్ష్మీకాంతరెడ్డినికూడా వెంటతీసుకొని వెళ్ళి దారిలో అతనిని చంపివేయాలని అనుకొన్నాడు. ఈవిషయం ఎలాగో తెలుసుకొని లక్ష్మీకాంతరెడ్డి తప్పించుకొని పారిపోయాడు.

తయ్యబ్‌దళం బ్రాహ్మణపల్లి గ్రామంచేరుతుండగా దారిలో ముగ్గురు కమ్యూనిస్టులతో ఘర్షణజరిగింది. కానీ ఆ కమ్యూనిస్టులు చేతికి చిక్కకుండా పారిపోయారు. రజాకార్లదళం బ్రాహ్మణపల్లికి ప్రవేశించింది. కమ్యూనిస్టులు ఎక్కడా కనబడలేదు. కాని తమకు ఇంతకాలంనుండి చేతికి చిక్కని రామచంద్రారెడ్డి ఇల్లుమాత్రం కనబడింది. ఆ పటేల్ తన ప్రాణ రక్షణకోసం సర్వస్వంవదలి ఎక్కడోతలదాచుకొంటున్నాడు. ఆ కోపంవల్ల తయ్యబ్ దళం పటేల్ఇంటిని తగులబెట్టి భస్మంచేశారు. తిరిగివస్తుండగా అనుకోకుండా చెదురుమదురుగా కొందరు కమ్యూనిస్టులు దొరికారు. దాదాపు తొమ్మిదిమంది కమ్యూనిస్టులను కాల్చి శవాలను అక్కడేవదిలేసి తయ్యబ్ దళం బీబీనగర్ చేరుకొంది. తాము కమ్యూనిస్టుల వధకచర్యలలో విజయవంతమైనామని, చాలామందిని రూపుమాపి ఆ ప్రాంతాలలో వాళ్ళ బెడద లేకుండా చేశామని మహోఘనంగా ప్రకటించుకున్నారు. నిజాంకు ఈవర్తమానాన్నిపంపి కావలసినంత ప్రచారం చేయించుకున్నారు.



లక్ష్మీకాంతరెడ్డి

మరునటిరోజు సబ్ ఇన్‌స్పెక్టర్ మొహమ్మద్ ఖాన్, నాయబ్‌నాజర్. (డి. ఐ. జి.) మజీదుల్లా అసలు పరిస్థితిని అంచనా వేయడానికి బ్రాహ్మణపల్లికి వచ్చారు. కమ్యూనిస్టుల శవాలను చూడాలనుకొంటే అప్పటికే గ్రామస్తులంతా ఆ శవాలను పూడ్చి పెట్టేశారు. తిరిగి శవాలను బయటికి తీయించి పరీక్షించారు! ఆ చంపబడినవాళ్ళంతా కమ్యూనిస్టులు కానేకాదు. తయ్యబ్ రజ్వీ క్యాంపులో వెట్టిచాకిరిచేసే చాకలి, మంగలి, హరిజనులైన అమాయకప్రజలు తప్ప మరొకరుకాదు. ఎవరూ దొరకకపోతే తమకు సేవచేసే ఆ అమాయకులనే కాల్చివేసి తమ విజయోల్లాసాన్ని ప్రకటించుకొన్నారు. ఈ వాస్తవవిషయాన్ని డి ఐ.జి మజీదుల్లా కళ్లారాచూసి బీబీనగర్‌లోవున్న పోలీసు బలగాన్ని ట్రాన్స్‌ఫర్ చేయించాడు. కాని తయ్యబ్‌రజ్వీని ఏం చేయలేకపోయాడు.

తయ్యబ్‌రజ్వీ జరుపుతున్న ఆ కిరాతక చర్యలవెనుక ఒక హిందువు సహాయంవుంది. అతను ఇమరోజు మల్లయ్య అనే వ్యక్తి. డబ్బుకు తిండికి ఆశపడి మల్లయ్య గ్రామాలలో తిరిగి తనకు అనుమానంవున్న గ్రామస్తులందరిని కమ్యూనిస్టులగా చిత్రించేవాడు. తయ్యబ్‌కు రహస్యాలు చేరవేసి దాడి చేయమనేవాడు. చాలాకాలం అనేకగ్రామాలు ఈ మల్లయ్యవల్ల పీడించబడ్డాయి. చివరికి ఒకరోజు పొలంలో పట్టుకొని ఆమల్లయ్యని గ్రామస్తులు

కసిగా హతమార్చివేశారు. తనబంటు మల్లయ్యహత్య తయ్యబ్‌ని కలవర పెట్టింది. మల్లయ్యవిషయం తెలిసినవాడు పటేల్ లక్ష్మికాంతిరెడ్డి తప్ప మరొకడు కాదని తయ్యబ్ అనుకున్నాడు. అందువల్ల ఆ పటేల్‌ను పట్టి తెప్పించాడు. మూడురోజులపాటు తీవ్రంగా హింసించి మల్లయ్యను చంపింది ఎవరోచెప్పమని బాధించాడు. చివరికి నడవలేనిస్థితిలో లక్ష్మికాంతి రెడ్డిగారిని గ్రామం చావిడిముందు వదిలేసి వెళ్ళిపోయారు. మాలీపటేల్ జగ్గారెడ్డికూడా తయ్యబ్ మనుషులచేత హింసించబడ్డాడు ఆతర్వాత డి ఐ.జి. ముకీదుల్లా స్వయంగావచ్చి లక్ష్మికాంతిరెడ్డి పరిస్థితి చూశాడు వెంటనే తిరిగి మరోసారి పోలీసుబలగాన్ని ట్రాన్స్‌ఫర్ చేయించాడు. ఈసారి ఒకహిందూ ఇన్‌స్పెక్టర్‌ని అధికారిగా పంపించారు. సిక్కు అధికారి కిషన్‌సింగ్ తనబాధ్యతలను సక్ర మంగా నిర్వహించాడు. పటేల్ అతనివెనుకాల నీడలావుండి రజాకార్లు ఏమీ చేయకుండా కాపాడేవాడు. పోలీసుచర్య జరగ్గానే తయ్యబ్‌ఫిర్యాదు దిక్కు లేకుండా పారిపోయాడు. బీబీనగర్ ప్రజలకు పోలీసు యాక్షన్ విషయం తెలియకపోవటంవల్ల తయ్యబ్ ప్రాణాలు దక్కించుకొని ఆచూకితెలియకుండా వెళ్ళిపోయాడు.

ఇస్లామ్ ఆసఫియా సామ్రాజ్యాన్ని (సల్తనతే – ఆసిఫియా ఇస్లా మియా) స్థాపించాలని కలలుగన్న నిజాం 1947 తర్వాత స్వతంత్రం ప్రకటించుకొని మహోఘనత వహించిన (హిజ్‌మెజెస్టీ) ప్రభువుగా మారిపో యాడు. సర్వ స్వతంత్ర మైన భారతదేశం నడిబొడ్డులో స్వతంత్ర ప్రతిపత్తి కోసం ప్రాకులాడిన నిజాం ప్రజలపై క్రూర దమన కాండను అమలు జరి పాడు. ముస్లింమత ప్రాబల్యాన్ని పెంచి ఇత్తెహాదుల్ సంస్థ అండతో రజా కార్ల గూండాచర్యలతో తన అధికారాన్ని కాపాడుకోవాలని ప్రయత్నిం చాడు. చివరికి బ్రిటన్ మాజీప్రధాని విన్‌స్టన్‌చర్చిల్ కూడా స్వతంత్ర హైద రాబాద్‌ను సమర్థించాడు. యూరప్‌లో బఫర్‌స్టేట్‌గా వున్న స్విట్జర్‌లాండ్ పద్ధతిలో హైద్రాబాద్ సంస్థానంవుండవచ్చునని వాదించాడు.

రజాకార్ల సైన్యాధిపతిగా కాసింరజ్వీ చివరికి నిజాం తలపై భస్మాసుర హస్తంలా పరిణమించాడు. రజ్వీ తనను తాను ఫీల్డ్‌మార్షల్ రోమెల్ జుకాఫ్‌మాంటే గుసరీలాంటి ప్ర సైన్యాధిపతుడిగా ఊహించుకొని విర్రవీగిపోయాడు.

ఒకసారి రజ్వీ ఉక్కుమనిషి సర్దార్‌పటేల్‌ను కలుసుకొని హైద్రాబాద్ స్వతంత్రంగా ఉంటుందని చెప్పాడు. సర్దార్‌పటేల్ ఒకేఒక్కమాటలో ఇలా అన్నాడు. –"ఆత్మహత్య చేసుకోవాలని అనుకొనేవాణ్ణి ఎవరూ ఆపలేరు." తర్వాత రజ్వీ తన విషపూరితమైన ఉపన్యాసాలవల్ల ముస్లింలను రెచ్చగొట్టాడు. ఢిల్లీ రాజధానిని వశంచేసుకొని ఎర్రకోటపై ఆసఫియా జెండాని ఎగురవేస్తానని ఢంకాలు పలికాడు. కాని భారతసైన్యం ప్రవేశించిన మూడురోజులతర్వాత నిజాం సైన్యం, రజాకార్లు ఆయుధాలు దించేసి మోకరిల్లారు. నిజాం తప్పునంతా రజ్వీపైన. రజాకార్లపైన మోపి తాను ధూర్తుడిగా లొంగిపోయాడు. పోలీసుయాక్షన్ తరువాత కాసింరజ్వీని ప్రత్యేక న్యాయస్థానం విచారించింది. సవివరంగా సమాచారం, సాక్ష్యం సేకరించి కాసింరజ్వీపై హత్యలు, దోపిడీలు, నేరాలు మోపబడ్డాయి. హంతకుడిగా, దోపిడీ దొంగగా రజ్వీ న్యాయస్థానంలో నిలుచున్నాడు. న్యాయస్థానం రజ్వీకి ఏడు సంవత్సరాలు కఠిన కారాగారశిక్షను విధించింది మామూలు ప్లీడరు నుండి ఫీల్డ్‌మార్షల్‌గా తనను తాను నిలుపుకొన్న రజ్వీ దోపిడీ దొంగగా నిజస్వరూపాన్ని చూపుకోక తప్పలేదు. గూఢచారి విభాగం అధికారి శ్రీ నర్సింగ్‌ప్రసాద్ కృషివల్ల స్పష్టమైన ఆధారాలు, సాక్ష్యాలు దొరికాయి. ఫలితంగా కాసింరజ్వీ తానుచేసిన నేరాలకు కఠిన శిక్షను అనుభవించాడు.



# 9. పి. పి. సి. ఏర్పాటు

సర్దార్ వల్లభాయిపటేల్ భారత ప్రభుత్వపు ఏజంట్ జనరల్ కె. యం. మున్షీతో మాట్లాడుతూ ఉత్సాహంగా "చాల మంచి పని జరిగింది, చాలా మంచి పని జరిగింది." అని సంతోషాన్ని వ్యక్తం చేశారు. సాధారణంగా గంభీరంగా వుండే వ్యక్తి పటేల్. ఆతని మానసికస్థితిని అంచనా వేయటం కష్టం. నిర్వికారంగా వుండే వ్యక్తి ప్రత్యేకించి ఏదో అసాధారణమైన సంఘటన జరిగి వుంటేనే అలా తన మనోభావాలను వ్యక్తం చేయగలడు. నిజాం సంస్థానం గురించి మున్షీ గారి నుంచి ఏదోవొక విషయం విన్న తర్వాత ఆ ఉక్కుమనిషి రెండుసార్లు అలా అనటం విశేషం. బహుశా సంస్థానానికి సంబంధించిన యేదో జటిలసమస్యకు పరిష్కారం కనబడిందేమో!

కుటిల రాజకీయాలలో నిష్ణాతులైన ఆంగ్లేయ సామ్రాజ్యవాదులు గత్యంతరం లేక భారతదేశం నుంచి వెళ్లిపోయేముందు, జాతీయ ప్రభుత్వానికి కఠిన సమస్య ను సృష్టించిపోయారు. తమ సామ్రాజ్యవాదానికి అనుగుణంగానే దేశాన్ని రెండు ముక్కలు చేసి భారత–పాకిస్తాన్‌లని విభజించిపోయారు. అంతర్గతంగా అనేక రాజకీయ కల్లోలాలను సృష్టించి, నూతన జాతీయ శక్తి బలపడకుండా వుండాలని ఆ సామ్రాజ్యవాదుల దురాశ.

కొరియా, వియత్నాం, లావోస్, జర్మనీ, భారత్ తదితర దేశాల్లో ఇలాంటి విషబీజాలను వాళ్ళు నాటి పోయారు. దేశాలను విభజించటమే కాదు. గృహకల్లోలాలను రేపి అంతర్యుద్ధ పరిస్థితిని కల్పించాలని ఆంగ్లేయుల కుటిలయత్నం. దానికి అనుగుణంగానే 1947 మార్చి 3వ తేదీనాడు ఒక ప్రకటన చేశారు. భారతదేశంలోని సంస్థానాధీశులు తమ సంస్థానాలను ఇష్టానుసారంగా పాకిస్తాన్ లేదా భారత్‌లో విలీనం చేసుకోవచ్చు. లేదా స్వతంత్రాన్ని ప్రకటించుకోవచ్చునని ఆ ప్రకటన సారాంశం. అయితే సర్దార్ సాహసంతో రాజకీయ విజ్ఞతతో రక్తపాతం లేకుండా దాదాపు సంస్థానాలన్నింటిని భారత్‌లో విలీనం చేయగలిగాడు. అంతర్యుద్ధం అనే ప్రమాదాన్ని నివారించి స్వతంత్ర భారత చరిత్రలో ఒక శాశ్వతమైన – సంస్మరణీయమైన పుటను జోడించిపోయారు.

హైద్రాబాద్ సంస్థానం విలీనం కాకుండా వుండాలని నిజాం, ముస్లిం మజ్లిస్, నియంత కాసింరజ్వీ ఇక్కడ ప్రజలను మభ్యపెట్టుతూ నాటకం ఆడారు. హిందువులు, ముస్లింలు తనకు రెండు కళ్ళలాంటివారని వాళ్ళిద్దరు తన కళ్ళులాగానే ప్రీతిపాత్రులని హైద్రాబాద్ సంస్థానాన్ని పాకిస్థాన్‌లో విలీనం చేసే పక్షంలో హిందువులు బాధపడతారు. భారత్‌లో విలీనం చేయటం ముస్లింలకు యిష్టంలేదు. కాబట్టి ఆ పరిస్థితుల్లో తన రాజ్యం స్వతంత్రంగా వుండటమే మంచిదని నిజాం తెలివిగా ప్రకటించాడు. తన రాజ్యకాంక్షను, మత దురహంకారాన్ని కప్పిపుచ్చి ఒక ప్రత్యేక ఫర్మానా ద్వారా స్వతంత్రాన్ని చాటుకున్నాడు.

అయితే వాస్తవం మరోవిధంగా వుంది. ఈ సంస్థానంలోని అత్యధిక సంఖ్యాకులైన హిందువులు తమ ప్రాంతాన్ని మతప్రమేయం లేని స్వతంత్రభారత్‌లో విలీనంచేసి బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని నెలకొల్పాలని ప్రగాఢంగా కోరుతున్నారు. హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఈ ఆశయ

సాధనం కోసం సంఘర్షణ జరుపుతూవుంది. ఈ ప్రజావాంఛను, వాస్త వాన్ని అణచిపెట్టాలని నిజాం శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నాడు. తనకు అన్నివిధాలా సహాయంగా వుండాలని ఇత్తేహాదుల్ ముసల్మీన్ అనే మత సంస్థను పోషించాడు. కాసిం రజ్వీ దాని నాయకుడుగా అంటగా వున్నాడు. నిజాం తన సైన్యాన్ని మరింత సాయుధంచేసి ప్రజా ఆందోళన లను నిరంకుశంగా అణచివేయాలని సిద్ధంగా వున్నాడు.

1947 ఆగష్టు 15 నాటినుంచి హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ తన ఆందోళనను తీవ్రతరం చేసింది. సత్యాగ్రహంలో పాల్గొన్న దళాలను నిజాం అరెస్టు చేయించాడు. తీవ్రమైన దమనకాండను జరిపించాడు. నిజాం పోలీసులు, రజాకార్ల దళాలు ఇష్టానుసారంగా అత్యాచారాలు జరుపుతున్నారు. కాంగ్రెస్ జరుపుతున్న ఆందోళనను అమానుషంగా అణచివేయాలని అన్ని రకాల బలప్రయోగాలు చేస్తున్నారు. జైళ్లలో సత్యాగ్రహులపై లాఠీ ఛార్జి జరిపి అనేకమందిని గాయపరిచారు. 1918 జనవరి పదకొండునాడు నిజామాబాద్ జైలుకు బయటనుంచి గూండాలను తీసుకెళ్ళి రాజకీయ ఖైదీ లను విపరీతంగా కొట్టించాడు. అప్పుడు లాయకలీ మంత్రి మండలినుంచి శ్రీ రామాచార్య రాజీనామా చేశాడు. వేలాది మంది రాజకీయఖైదీలు జైలు కటకటాల వెనుక క్రూరహింసలకు గురౌతున్నారు, స్వతంత్ర పోరాటంలో పాల్గొనాలని విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరిస్తున్నారు. రజాకారు విచ్చలవిడిగా అభ్యుదయకాముకులైన ప్రజలపై నాయకులపై అత్యాచారాలు జరుపుతున్నారు. ప్రాణ, మాన, ఆస్తిరక్షణ లేకపోవడం మూలాన ప్రజలు లక్షల సంఖ్యలో సంస్థానాన్ని వదిలి ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళిపోతు న్నారు. వందలాది మంది, తుపాకీగుండ్ల పాలై ప్రాణాలు వదిలారు. సజీవ దహనాలు, ఆడవాళ్ళ మానభంగాలతో సంస్థానం అల్లకల్లోలంగా వుంది. ఈ అన్యాయాల్ని బయటపెట్టిన పత్రికల నోరుమూయించారు. ఈ దారుణ



లాయక్ అలీ

పరిస్థితుల్లో స్టేట్ కాంగ్రెస్ సంస్థానం వెలుపలినుంచి తన కార్యకలాపాలను నిర్వహించటం ప్రారంభించింది.

తన స్వయం ప్రతిపత్తిని భారత ప్రభుత్వం అంగీకరించదనితెలుసుకొని నిజాం తెలివిగా వ్యవహరించటం మొదలుపెట్టాడు. భారతప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతున్నానని మరో ప్రక్క యుద్ధ సన్నాహాలు ఆరంభించాడు. ఐక్యరాజ్యసమితికి ప్రతినిధి వర్గాన్ని పంపించాలనే ప్రయత్నం చేశాడు. మరోప్రక్క తనరాజ్యానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదంటూ ఒక డమ్మీ మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేశాడు. మజ్లిస్ తరఫున వచ్చిన లాయక్ అలీ ప్రధానమంత్రిగా ప్రజల్లో ఏమాత్రం పలుకుబడి లేని కొందరు హిందువులను సభ్యులుగా నియమించడం జరిగింది.

ఆ తర్వాత భారతప్రభుత్వానికి వ్యతిరేకంగా విస్తృతమైన దుష్ప్రచారాన్ని కొనసాగించాడు నిజాం. తన సంస్థానంలో జరిగే అత్యాచారాలకు భారతప్రభుత్వపు ఏజంట్లు కారణమని బుకాయించాడు. బయటనుంచి తనకు అనుకూలంగావుండే పత్రికావిలేఖరులను రప్పించి తనకు నచ్చిన విధంగా రిపోర్టులు వ్రాయించుకున్నాడు. తన రాజ్యంలో తాను అమలుజరుపుతున్న ప్రజా సంస్కరణలను చూసి సహించక భారతప్రభుత్వం రాజ్యవిస్తరణ కాంక్షతో తనపై దురాక్రమణ తలపెట్టిందని తన స్వతంత్ర ప్రతిపత్తిని కూలదోయాలనే కుట్రజరుపుతూందని పెద్ద ఎత్తున నిజాం ప్రచారం చేస్తున్నాడు. ఈ పరిస్థితుల్లో భారతప్రభుత్వానికి ఏమిచేయాలో తోచని దశ ఏర్పడింది.

## కోర్టుల బహిష్కరణ :

1948 ఫిబ్రవరి నెలలో శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్ ఇంటి దగ్గర ఉదయమే తొమ్మిది గంటలకు న్యాయవాదులు సమావేశమైనారు. తర్వాత ఆ న్యాయవాదులందరు ఊరేగింపుగా బయలుదేరారు. ఆ రోజుల్లో యూనిఫారమ్ ధరించి రోడ్డుపై బహిరంగంగా కవాతుచేస్తూ వెళ్ళడం రజాకార్లకు మాత్రమే హక్కుగా వుండేది. అలాంటి వాతావరణంలో న్యాయవాదులు నిర్భయంగా హైకోర్టుకు ఊరేగింపుగా చేరుకున్నారు. నాయకత్వం వహించిన వినాయక్‌రావు విద్యాలంకార్ సంస్థానం యొక్క ప్రధాన న్యాయమూర్తి ఖలీల్‌జమ్మాసిద్దిక్‌కి విజ్ఞప్తి పత్రాన్ని అందజేశారు. ఆ పత్రంపై 129 మంది ప్రముఖ న్యాయవాదుల సంతకాలు ఉన్నాయి. ఆ విజ్ఞప్తి పత్ర సారాంశం ఇలా ఉంది.

శ్రీయుత ప్రధాన న్యాయమూర్తిగారికి,

ఉన్నత న్యాయస్థానం సర్కారే ఆలీ !

తమరి సమక్షంలో తమకు కొన్ని చేదునిజాలను, యదార్థమైన దుస్థితిని నివేదించే పరిస్థితి ఏర్పడినందుకు చింతిస్తున్నాము. న్యాయవాదుల సంఘము (బార్) ప్రజలకు న్యాయం చేయడం కోసం కృషిచేస్తుంది. అవసరమైనప్పుడల్లా ప్రభుత్వానికి ప్రజలకు మార్గదర్శకత్వం చేస్తుంది. మీకు ఈనాడు ఏర్పడిన విషమపరిస్థితులు తెలియనివికావు. అయినా వాస్తవాలను మీదృష్టికి తీసుకురావలసిన కర్తవ్యం మాకుంది.

దేశంలో శాంతి భద్రతలను కాపాడుతూ ప్రజల యోగక్షేమాలను చూడడం ప్రతి ప్రభుత్వంయొక్క ధర్మం. కానీ ఇక్కడ ప్రభుత్వం ఈ విషయంలో విఫలం కావడమే కాకుండా దాని పాలనా యంత్రాంగం విచ్ఛిన్నమై నిరుపయోగంగా వుంది. మన సంస్థానంలో కొంత కాలం నుంచి



గోపాలరావు ఎక్స్రే

బహిరంగదోపిడీలు, హత్యలు మామూలై పోయాయి. అయినా ప్రభుత్వం ప్రజారక్షణకు ఎలాంటి ప్రయత్నాలు చెయ్యటం లేదు. పైగా ఈ దుష్కృత్యాలను కప్పిపుచ్చుతోంది. ఫలితంగా సాయుధులైన గూండాలు దోపిడీ దొంగలు దళాలుగా ఏర్పడి గ్రామాలను లూటీ చేస్తున్నారు. హత్యలు, మానభంగాలు, దహనాలు కట్టుదిట్టంగా జరుపుతున్నారు పోలీసులు ప్రజలను కాపాడే బదులు అక్కడక్కడ గూండాలకు అండగా ఉంటున్నారు. ఈనాడు ఇక్కడ ప్రబలివున్న మతదురహంకార కార్యకలాపాలు అత్యాచారాల గురించి బాధ్యతాయుతమైన వ్యక్తులు, పత్రికలు ప్రభుత్వాన్ని హెచ్చరించినా ప్రయోజనం లేకుండాపోయింది, పైగా ప్రభుత్వం మతకలహాల విషాన్ని వెదజల్లుతున్న సంస్థలకు విరాళాలుఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ అన్యాయాన్ని ప్రశ్నించిన పత్రికలను రద్దుచేసి అనేక మంది పౌరులను ముఖ్యంగా న్యాయవాదులను జైళ్ళలో నిర్బంధించిపెట్టారు.

ప్రభుత్వం అనుసరిస్తున్న వినాశకరమైన విధానాల ఫలితంగా ప్రజలు ఇళ్ళను వదలి ఇతర ప్రాంతాలకు వలసపోతున్నారు. గ్రామాలు ఖాళీగా ఉన్నాయి. పంటలు నాశనమైపోతున్నాయి. గ్రామవాసులు అడవులలో తలదాచుకుంటున్నారు. సంస్థానంయొక్క పాలనాయంత్రాంగం స్థంభించిపోయింది. అన్నిచోట్ల అరాచకత్వం వ్యాపించివుంది.

ఈ పరిస్థితులు బాగుపడేవరకు, మేము న్యాయస్థానాలకు హాజరు

కాదలచుకోలేమని నిర్ణయించుకున్నాము. సంస్థానంలో శాంతిభద్రతలు పున రుద్ధరించబడే వరకు కోర్టులను బహిష్కరిస్తున్నాం. శాంతిభద్రతలు నెల కొనాలంటే బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పడాలి. ప్రజలక్షేమాన్ని కాపాడే ప్రభుత్వం కావాలని ఈరాజ్యంలో అన్నివర్గాలు కోరుతూవున్నాయి. ఆనాటివరకు మేము న్యాయస్థానాలలో పనిచేయటం సాధ్యంకాదు. న్యాయ స్థానాలను అవమానపరచే ఉద్దేశ్యం మాకులేదు. మాక్లయింట్లకు ఇబ్బంది కలుగకుండా ఇతరఏర్పాట్లుచేస్తున్నాము.ఈరాజ్యంలో శాంతి భద్రతలునెలకొ నేకాలం వస్తుందని విశ్వసిస్తూ మీనుండి సెలవు తీసుకొంటున్నాము.

ఈసంఘటన చూచి చాలామంది ఆశ్చర్యపోయారు. హైద్రాబాద్ చరిత్రలోనే ఇది అపూర్వ సంఘటన. భారతదేశంలో సహాయ నిరాకణో ద్యమ కాలంలోకూడా విజయవంతంగా జరగని కోర్టుల బహిష్కరణ కార్య క్రమం ఇక్కడ సంపూర్ణంగా జరిగింది.

ప్రధానన్యాయమూర్తికి విజ్ఞప్తి పత్రం సమర్పించి న్యాయవాదులు తిరిగి మహోత్సాహంతో వినాయకరావుగారి ఇంటికి బయలుదేరారు. హైకో ర్టులోవున్న మరికొంతమందికలిసిరాగా దాదాపు నాలుగువందలమంది ఊరే గింపుగా బాహాటంగా నడచి వెళ్ళారు. ప్రజలకు నూతనోత్తేజాన్ని ఇచ్చింది. ఈ చర్యను సమర్ధిస్తూ మద్రాస్‌బార్ అసోసియేషన్ అభినందించే తీర్మానం చేసింది. ఆలిండియా రేడియో వార్తాప్రసారం చేసింది. ఈసాహసవంతమైన కార్యంవల్ల ప్రపంచానికి హైద్రాబాద్ నిజస్వరూపం బహిర్గతమైంది. దీనిని మించి న్యాయవాదులు మరింత పటిష్టమైన పనికూడా చేశారు. సంస్థానంలో జరిగిన అత్యాచారాల సాక్ష్యాధారాలు సేకరించి భారతప్రభుత్వానికి అంద జేయ కలిగారు. న్యాయవాదులు సేకరించిన ఆ రికార్డులు భారతప్రభుత్వ వాదనకు అసాధారణమైన బలాన్ని ఇచ్చాయి. కోర్టుల బహిష్కరణవార్త సర్దార్ పటేల్‌ను కదిలించివేసింది.



సదాశివరావు మహా

## పి. పి. సి ఆవిర్భావం :

నిజాం సంస్థానంలో ప్రబలిన అరాచకత్వాన్ని కళ్ళారాచూస్తూ మేథావివర్గం తల్లడిల్లిపోయింది. తాము ఏమీ చేయలేకపోతున్నామనే బాధ వాళ్ళను కుంగదీసింది. నగరంలోని ప్రతిభావంతుడైన యువ న్యాయవాది సదాశివరావు, ఇతను ఈ దారుణ పరిస్థితి వలన మరింత బాధ పడ్డాడు. కోర్టులను బహిష్కరించాలనే ఆలోచన తట్టింది. అలాగే సంస్థానంలో జరుగుతున్న అత్యాచారాల సాక్ష్యాధారాలను సేకరించేపని చేయాలనుకున్నాడు. నిజాం అబద్ధాలను బయట పెట్టాలనే కృతనిశ్చయంతో మిగతా న్యాయవాదులతో సంప్రదించాడు. మొదట్లో అధికసంఖ్యాకులు నిరుత్సాహపడ్డారు. ముగ్గురు న్యాయవాదులైన మిత్రులు మాత్రం ఆ ఆలోచనను సమర్థించి సహాయపడటానికి సిద్ధపడ్డారు. ఆ మిత్రులు జే. వి. నర్సింగరావు, బారిష్టరు షహాబుద్దీన్, మాధవరెడ్డి. ఈ నలుగురు మిత్రులు ఆ తర్వాత కే. యం. మున్షీ తో సంప్రదించారు. ఆయన ఆ కోర్టుల బహిష్కరణ అంతగా విజయవంతం కాదేమోనని అనుమానం వెలిబుచ్చారు. కారణం సహాయనిరాకరణోద్యమ కాలంలో ఇలాగే జరిగితే ఫలితాలు ప్రోత్సాహకరంగా వుండలేదని అన్నారు. అయినా ఈ న్యాయవాదులు నిరుత్సాహపడకుండా తమ ప్రయత్నాలు కొనసాగించారు. వినాయక్‌రావు విద్యాలంకార్ గారితో ఈ విషయం చెప్పినప్పుడు ఆయన ఆలోచిద్దామని అన్నారు. ఆ తర్వాత వినాయక్‌రావు గారింట్లో న్యాయవాదుల సమావేశం జరిగింది. అనుకూలంగా ప్రతికూలంగా చర్చలు జరిగాయి. ముఖ్యంగా కోర్టులను బహిష్కరించిన తరువాత వృత్తిరీత్యా



జె. వి. నర్సింగరావు

అనేక మంది న్యాయవాదులు ఆర్థికంగా ఆధారంలేనివాళ్ళు అవుతారు వాళ్ళసంగతి ప్రధాన సమస్యగా మారింది. పదివేల రూపాయల సహాయ నిధిని సేకరించాలని అన్నారు. కొందరు ఆపని మొదట్లోనే జరగాలని పట్టుబట్టారు. అప్పుడే జే. వి. నర్సింగరావు తన భార్య నగలు తాకట్టు పెట్టి ఆ మొత్తాన్ని తీసుకువస్తానన్నారు.

ఉత్సాహంతో పని మొదలైనది. కొన్ని రోజులలోనే పదివేల రూపాయలు సేకరించబడ్డాయి. ముఖ్యంగా జే. వి. నర్సింగరావు, కే. వి. రంగారెడ్డి, దొంతి గోపాలరెడ్డి ఎక్కువగా సహకరించారు. ఈ ఆందోళన జరుగుతున్నంత కాలం ప్రతినెల రెండువేల రూపాయలు వనపర్తి రాజారామేశ్వరరావు విరాళంగా ఇచ్చారు. కోర్టు బహిష్కరణ పత్రాలపై వంద సంతకాలు సేకరించబడ్డాయి. ఈ పూర్వ రంగాన్ని సిద్ధం చేసిన తర్వాత శ్రీ కాశీనాథ్‌రావువైద్య ఇంట్లో న్యాయవాదుల సమావేశం జరిగింది.

ప్లీడర్సు ప్రొటెక్టు కమిటి ( పి. పి. సి. ) అనే పేరుతో సంస్థ నిర్మాణం జరిగింది. ఏకగ్రీవంగా శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. మిగతా కార్యవర్గ సభ్యులు–ఉపాధ్యక్షులు గోపాలరావు ఎక్బోటే, కార్యదర్శి ధరణీధర్ సంఘీ, కోశాధికారిగా జే.వి. నర్సింగరావు. జామ్‌బాగ్‌లోవున్న శ్రీ వసంతరావు ముద్‌ఖెడ్‌కర్ ఇంటిని పి. పి. సి కార్యాలయంగా నిర్ణయించారు. వసంతరావు ముద్‌ఖెడ్‌కర్ ఆ రోజుల్లో సాహసించి తనయింటిని పి. పి. సి కోసం కేటాయించడం విశేషం. అరాచ


వసంతరావ్ ముద్‌ఖేడ్‌కర్

కత్వం ప్రబలిన ఆ రోజుల్లో తలచుకుంటే ఆ ఇంటిని ధ్వంసం చేయటం పెద్ద కష్ట మేమీ కాదు. అయినా స్వయంగా ముద్‌ఖెడ్‌కర్ అలా ముందుకు రావటం ప్రశంసనీయం. అందువల్లనే ఆ ఇంటిని ఆ రోజుల్లో హైద్రాబాద్ ఆనందభవన్ అని అనేవాళ్ళు.

ప్లీడర్సు ప్రొటెక్ష్ కమిటి మొదటి సారిగా మేధావుల సంమర్షణ సమితిగా ఏర్పడింది. ఆ సమితిని తనకు లోబడి పనిచేయమని స్టేట్ కాంగ్రెసు కోరింది. కానీ సంస్థానంలో ప్రబలిన అరాచకత్వానికి అన్యాయానికి వ్యతిరేకంగా తాము స్వతంత్రం గానే పనిచేయదలుచు కున్నామని పి. పి. సి. చెప్పింది. ఆ విధంగా ఏ రాజకీయ పక్షానికి చెందకుండా ప్రజల నైతిక స్థాయిని కాపాడటంలో ఈ న్యాయవాదుల సమితి ఎంతో కృషిచేసింది.

ప్రధానన్యాయమూర్తికి విజ్ఞాపనపత్రం సమర్పించినతరువాత పి.పి.సి కేంద్రకార్యాలయంలో నియమితకాలంలో సక్రమంగా పని ప్రారంభమ యింది. జిల్లాలు, తాలూకాల స్థాయిలో న్యాయవాదులు కోర్టుల బహిష్కరణ ప్రారంభించారు. మొత్తం వెయ్యిమందికిపైగా న్యాయవాదులు ఉద్యమంలో పాల్గొన్నారు. కొన్నిచోట్ల మున్సిఫ్ న్యాయస్థానాలు పూర్తిగా స్థంబించి పోయాయి.

ముఖ్యంగా పి. పి. సి. లోని విచారణ విభాగం పట్టుదలతో పనిచేయ టం ప్రారంభించింది. ప్రతిరోజు జరిగే సంఘటనలను అత్యాచారాలను ప్రజల దృష్టికి తీసుకువచ్చేది. ఎక్కడ గృహ దహనాలు, లూటీలు, హత్యలు



హైదరాబాద్ ఆనందభవన్

జరిగినా ఆ ప్రదేశాలకువెళ్ళి స్వయంగా భయంకర పరిస్థితులను ఎదుర్కొంటూ ఆ విభాగం న్యాయవాదులు సమాచారం సేకరించి ఫొటోలు తీసుకు వచ్చేవారు. ఈ విచారణ కార్యక్రమంలో సమాచార సేకరణలో లింగాయత్ కాన్ఫరెన్సు, స్థాయీసంఘం, హిందూ దినపత్రిక విలేఖరి శ్రీ వామన్‌రావుల కృషి పేర్కొనదగినవి. జరిగిన అత్యాచారాలకు వ్యతిరేకంగా విజ్ఞప్తి పత్రాలను వరుసగా సంస్థానపాలకులకు పి. పి. సి. పంపుతూవుండేది. తీవ్రమైన సంఘటనలు జరిగితే వాటినిగురించి అటు ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూకు, ఇటు ఏజంటు జనరల్ కె యమ్.మున్షీకి, ఆనాటి కాంగ్రెసు అధ్యక్షుడు బాబూరాజేంద్రప్రసాద్‌కు విజ్ఞాపనపత్రాలు పంపించేవారు. పి. పి. సి. సేకరించిన సమాచారం జరిపిన విచారణ అత్యంతఅమూల్యమైనది. దాదాపు ఐదువందల సంఘటనలకు సంబంధించిన కాగితాలు, ఫొటోలు, దుర్లభమైన సామాగ్రి. ఈసామాగ్రిని భారత ప్రభుత్వం తన శ్వేతపత్రానికి చాలవరకు ఉపయోగించుకుంది.



ధరణీటక్ సంఘీ

మరో ముఖ్యమైన పని మజ్లిస్ఇత్తే హాదుల్ ముసల్మీన్ చేస్తున్న తీర్మానాలను ఉపన్యాసాలను ఆ పత్రికల సంపాదకీయాలను ఉర్దూనుంచి ఇంగ్లీషులోకిఅనువదించి భారత ప్రభుత్వానికి పంపించేవారు. ఈ అంశంపై నాలగు పెద్ద సంపుటాలను తయారుచేసి పంపించారు.

పి. పి. సి. తన సమాచార శాఖద్వారా అన్నిభాషలపత్రికలకు వార్తలు పంపిస్తూ వుండేది. జరుగుతున్న యదార్థాలను ప్రజల దృష్టికి తెచ్చేది. అయితే కొద్ది కాలంలోనే నిజాం పాలకవర్గం పత్రికలపై నిషేధాలు విధించటం ప్రారంభించింది, స్థానిక పత్రికలైన "రహనుమా"ను మూసివేయించారు. "ఇమ్‌రోజ్" సంపాదకుడైన షోయిబ్‌ఉల్లాఖాన్ హత్య కావింపబడ్డాడు.

సంస్థానంలో అక్రమంగా అమల్లోకి వచ్చిన విధానాలను వ్యతిరేకిస్తూ పి. పి. సి. తరచుగా బహిరంగంగా ప్రకటనలు చేసేది. ఆ ఉద్రిక్త పరిస్థితులలో కూడా పాలక వర్గానికి విరుద్ధంగా ప్రకటనలు చేయటం సాధారణ విషయంకాదు. న్యాయవాదుల నిరసన ఊరేగింపు, విచారణ ఇవన్నీ పాలక యంత్రాంగంలో కలవరాన్ని కలిగించాయి. న్యాయవాదులగుర్తింపురద్దుచేయాలని, నిర్బంధించాలని అనేకవిధాలనిజాంకు సలహాలు ఇవ్వడం మొదలైంది. తిరుగుబాటు నేరారోపణపై చర్యతీసు కోవాలనికూడా కొన్నివర్గాలు కోరడం జరిగింది. అయినా పి. పి. సి. కార్య కర్తలు నిర్భయంగా తమ కార్యక్రమాన్ని కొనసాగించారు. ప్రభుత్వంఏదో నెపంమీద పి. పి. సి. సభ్యులను అరెస్టు చేయడం ప్రారంభించింది.

పర్యటన ఉపసంఘం సభ్యులు శ్రీరామచంద్ర భాదేకర్, వాసుదేవరావు, గౌసుద్‌కర్‌లను బాంబు కేసులో ఇరికించి అరెస్టుచేసారు. సమితి ప్రధాన కార్యాదర్శి శ్రీ ధరణీధర్ సంఘీని డిఫెన్స్‌చట్టంక్రింద నిర్బంధించారు. ఆతర్వాత అనుమానంపైమాత్రమే తాతాచార్, కె.రామ్‌గోపాల్, ఎ.రాఘవన్‌లను అరెస్టుచేశారు. 1948 ఆగస్టు 15నాడు భారతస్వాతంత్రదినోత్సవంలో పాల్గొనేనిమిత్తం పి.పి.సి. సభ్యులు కె.యమ్ మున్షీ ఆహ్వానంపై లోకల్ ట్రెయిన్‌లో బొల్లారం వెడుతున్నారు. దారిలో రజాకార్ గూండాలు ట్రెయిన్‌పైదాడిచేసి సభ్యులను గాయపర్చారు. సంఘీ అరెస్టుతర్వాత సదాశివరావు మహా ప్రధానకార్యదర్శిగా పనిప్రారంభించాడు. ప్రభుత్వం సదాశివరావు. జె.వి.నర్సింగ్‌రావుల అరెస్టుకై వారంట్‌లను జారీచేసింది. వాళ్ళిద్దరూ పట్టుబడకుండా అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. ఈ ఇద్దరి అరెస్టు వారంట్ గురించి ఒక ముస్లిం పోలీసుఅధికారి స్వయంగా వార్తఅందజేసాడు కొద్దికాలంలోనే భారత సేనలురాబోతున్నాయి, ఆనాటివరకు జాగ్రత్తగా వుండడం మంచిదని, ఆ అధికారి సలహాఇచ్చాడు. మరోవిషయం ఇక్కడ ప్రస్తావించడం అసందర్భముకాదు. ప్రధానన్యాయమూర్తికి పి.పి.సి.సభ్యులు అందజేసిన విజ్ఞాపన పత్రాన్ని వ్రాసిన వ్యక్తి జస్టిస్‌ఖయర్‌హసన్. జాతీయ దృక్పథంగల ఈ ముస్లింన్యాయమూర్తిదగ్గరే సదాశివరావు జూనియర్‌గా వుండేవాడు.

పరిస్థితులు విషమిస్తున్నాయి. హైద్రాబాద్ నుంచి వెళ్ళిన ప్రతినిధి వర్గం ఢిల్లీనుంచి చర్చలు విఫలంకాగా తిరిగి వచ్చింది. భారత ప్రభుత్వం సంస్థానాలపై ఆర్థికనిర్బంధాలనువిధించింది.సరిహద్దుప్రాంతాలపైసైన్యాన్ని సిద్ధంగా వుంచింది. నిజాంఇటువైపు తన సాయుధ బలగాన్ని పెంచుకొంటున్నాడు. మరొకవైపుతన సంస్థాన విలీన సమస్యను అంతర్జాతీయ సమస్యగా మార్చాలనే ఉద్దేశ్యంతో ఒకప్రతినిధివర్గాన్ని ఐక్యరాజ్యసమితికి పంపించే ఏర్పాటు చేస్తున్నాడు.

1948 సెప్టెంబర్ నెలలో సంస్థానం ప్రధానమంత్రి మీర్‌లాయక్ అలీ ఒక ప్రకటన చేస్తూ తమ సంస్థానంలో శాంతి భద్రతలు కట్టుదిట్టంగ వున్నాయని అందువల్ల సికింద్రాబాద్‌కు భారత సైన్యాన్ని పంపించే అవసరంలేదని పేర్కొన్నాడు. ఈ ప్రకటనను సవాలుచేస్తూ పి. పి. సి. అధ్యక్షుడు శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్ వెంటనే న్యాయవాదులతరఫున మరో ప్రకటన చేసాడు. ఆనాటిపరిస్థితులలో లాయక్ అలీని సవాలుచేస్తూ ప్రకటనచేయడం అసాధారణమైన విషయం. ఆ ప్రకటన సారాంశము–

"ప్రధానమంత్రి లాయక్‌అలీ సంస్థానంలో శాంతి భద్రతలు నెల కొన్నాయని ప్రకటించడం సత్యదూరం. గత ఆరుమాసాల నుంచి న్యాయ వాదులు ఎందువల్ల కోర్టులను బహిష్కరిస్తున్నారు? సంస్థానంలో ఎక్కడ శాంతి భద్రతలున్నాయో ఎవరిని అడిగినా చెబుతారు. 15 జనవరి, 1948 నుంచి 11 ఆగస్టు, 1948 మధ్య జరిగిన సంఘటనలను మా సమితి విచారించింది. మజలిస్ సభ్యులు జరిపిన అత్యాచారాలు కొన్నింటిని మాత్రమే లెక్కలోకి తీసుకుంటే చాలు అసలు వాస్తవం బయట పడుతుంది. పైన పేర్కొన్న కాలంలో మాత్రమే 353 గ్రామాల్లో ఘోర కిరాతకాలు జరిగాయి. 50 గ్రామాలు పూర్తిగా ధ్వంసం చేశారు. గ్రామస్తులను చంపేశారు. అమానుషంగా జరుపబడిన కిరాతకాలను వర్ణించాలంటే మాటలు చాలవు గోర్ట గ్రామంలో 200 మందిని చంపి 75 లక్షల రూపాయల ఆస్తిని దోచుకున్నారు. ఉద్‌గీర్‌లో ముస్లింలు 500మంది హిందువులను వరుసగా నిలుచో బెట్టి కాల్చివేశారు. ఒక మఠాన్ని దోచుకున్నారు. కాశింరజ్వీ అనేక ప్రాంతాలను దోచుకొని లారీలలో నింపుకొని విజయ యాత్ర సాగించాడు. జనవరి నుంచి ఆగస్టు వరకు ఆయా ప్రాంతాలలో జరిగిన ఘోరమారణ కాండను కప్పి పుచ్చడం మాకు సాధ్యంకాదు, మాన భంగాలు, మంగళ సూత్రాలు లాక్కోవడం ఇవన్నీ నిత్యకృత్యాలై పోయాయి."

"వీటినన్నింటిని విస్మరించి ఇక్కడ శాంతి భద్రతలు నెలకొని వున్నాయని ప్రకటించడం ప్రపంచం దృష్టిలో దుమ్ము చల్లడమే. ఈ అత్యాచారాలను ఎదుర్కొనకుండా, ప్రజలకు రక్షణ కల్పించకుండా ప్రపంచాన్ని మభ్య పెట్టడం మీకు సాధ్యం కాదు."



వినాయకరావు విద్యాలంకార్

ఈ ప్రకటన చేసి లియాకత్ ఆలీని సవాలుచేసిన ప్రముఖన్యాయవాది వినాయక రావు విద్యాలంకార్ గురించి కొంత వివరంగా తెలుసుకోవడం అవసరం. ఆయన హైదరాబాద్‌లో ప్రజా చైతన్యాన్ని ఉద్దీపింపచేసిన న్యాయమూర్తి. కేశవరావు కోరట్‌కర్ పెద్ద కుమారుడు. స్వర్గీయ కేశవరావు గారిని హైదరాబాద్ రానడేగా పేర్కొంటారు. బారిస్టర్ వినాయక్‌రావు విద్యాలంకార్ నాయకత్వంలోనే 1938లో నిజాం పాలనకు వ్యతిరేకంగా ఆర్యసమాజ్ పక్షాన సత్యాగ్రహం జరిగింది. రావుగారి విశిష్టవ్యక్తిత్వం మరుపు రానిది. ఆయన ప్రజలకు అభిమాన పాత్రుడు. ఈ ప్రాంతంలో ఆయనపట్ల ప్రజల కున్న ప్రేమాభిమానాలను చూసి నిజాం పాలకవర్గం జంకుతూ వుండేది. వినాయకరావ్ విద్యాలంకార్‌లో వున్న మానవీయతా దృక్పథం కలుపుగోలుతనం, సాహసం, పట్టుదల ప్రధానంగా ఆయన వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దాయి. పి. పి. సి. విజయవంతంగా పనిచేయడానికి వినాయక్‌రావుగారి నాయకత్వం ఎంతో దోహద పడింది.

ప్రధానమంత్రి మీర్‌లాయక్‌అలీ ప్రకటనను ఖండిస్తూ వెలువడిన ప్రకటన తర్వాత సంఘటనలు వేగంగా జరిగి పోయాయి. వ్యతిరేక ప్రకటన



రామానందతీర్థ

వెలువడిన మరుసటి రోజు అర్ధరాత్రి వినాయక్‌రావ్ విద్యాలంకార్ ఇంటిని పోలీసులు చుట్టుముట్టారు. జామ్‌బాగ్‌లో వున్న పాత కింబట్ హౌస్‌లో ఆయన నివసించేవారు. (నిజాం ఇంగ్లీషు పాలకుల ఆధీనంలోకి రాకపూర్వం ఇక్కడ ఈ భవనంలోనే ఫ్రెంచి రెసిడెన్సి వుండేది.) దానిని క్యాబినెట్ హౌస్ అని పిలిచేవారు. అది వాడుకలో కింబట్ హౌస్‌గా మారిపోయింది. ఆయన నివాస భవనంలో పోలీసులు అన్ని మూలలా సోదాజరిపారు. అంతకు పూర్వమే రావుగారు జాగ్రత్తపడి పి. పి. సి. పత్రాలను, అనేక సంపుటాలను తిరుమలగిరిలోని ఫోర్ట్‌లో వున్న భారతప్రభుత్వపు ఏజంట్ జనరల్ కె. యమ్. మున్షీకి అప్పగించారు.

శ్రీ వినాయకరావు విద్యాలంకార్‌ను అరెస్టు చేసి జైల్లో పెట్టారు. గూడాలోని సెంట్రల్ జైలులోకి వెళ్ళగానే అంతకు పూర్వమే నిర్బంధించబడ్డ స్వామి రామానందతీర్థ, రావుగారిని చూసి చివరికి మీరు కూడ వచ్చారన్నమాట! అని అనగానే రావుగారు ఆత్మ విశ్వాసంతో ఇలా అన్నారు:

'మీ అందరిని విముక్తం చేయడానికి వచ్చాను'. ఆతర్వాత 17 సెప్టెంబర్‌న పోలీసు చర్య తర్వాత రాజకీయ ఖైదీల నందరిని విడుదలచేశారు.

వినాయక్‌రావు విద్యాలంకార్ గురించి ఒకరు ఇలా వ్యాఖ్యానించారు. 1938 లో ఆర్యసమాజ్ తరుపున రావుగారు మూడువేల సత్యాగ్రహుల దళాన్ని తీసుకొని సంస్థానంలో ప్రవేశించగానే ఆనాడు నిజాం, ప్రజల కోరికలను అంగీకరించి మోకరిల్లాడు. 1948 లో రావుగారిని అరెస్టు చేసిన మూడురోజుల్లో గానే పోలీసు చర్య మొదలైంది. ఆజాద్ హైద్రాబాద్ శాశ్వతంగా అంతమై పోయింది.

13 సెప్టెంబర్ నుంచి 17 సెప్టెంబర్ (1948) రాగానే నిజాం ఓటమి అంగీకరించాడు. 11 అక్టోబరు, 1948 నాడు తిరిగి కోర్టులకు హాజరవుతామని న్యాయ వాదులంతా ప్రధాన న్యాయమూర్తికి మరో విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. పి. పి. సి. సేకరించిన సమాచారం ఎనిమిది పెద్ద పెట్టెల్లో నిండిపోయింది. లాయక్‌అలీ మంత్రి వర్గానికి విరుద్ధంగా కేసు నడిపించే నిమిత్తం భారతీయ గూఢచారి విభాగం అధికారి నగర్‌వాలా ఆమొత్తం రికార్డులను స్వాధీనం చేసుకొన్నాడు. అమూల్యమైన ఆ చారిత్రక పత్రాలు ఈనాటికి సురక్షితంగా వున్నాయో లేదో తెలియదు. (కాలాయ తస్మైనమః.)

# 11. రజాకార్ల కాలంలో కాకతీయ మహానగరం

... ఒక ఇంటి ఆవరణలో పంక్తిబద్ధంగా నిలుచునివున్నారు స్వయం ... సేవకులు. "విజయీ విశ్వతిరంగా ప్యారా, ఝండా ఊంచా ... రహే హమారా" అని పతాక వందనం చేస్తున్నారు. ప్రాణాలు ... ధారవోసి నీగౌరవాన్ని కాపాడుతామని జెండాకు అభివాదం చేస్తూ గీతం ఆలాపిస్తున్నారు. ధ్వజగీతం సమాప్తం కాగానే ఆఉదయం "ఇంక్విలాబ్ జిందాబాద్" "భారత్ మాతాకీజై" 'మహాత్మా గాంధీకిజై', అనే నినాదాలతో అక్కడి కోటలోని ప్రశాంత వాతావరణం మార్మ్రోగింది.

4, ఆగస్టు 1946, ఆదివారంనాడు వరంగల్ కోటలోని ఉత్తర భాగాన ఈపతాక వందనం జరుగుతూ వున్నది. నిజాం సామంతుల సంస్థానంలో వరంగల్ మాతాలో ఈవిధంగా జాతీయ పతాకాన్ని ఎగురవేస్తూ స్వేచ్ఛాగీతాలు ఆలాపించడం ఆనాడు ఎవరికైనా ఆశ్చర్యాన్ని గొలిపే అంశం.

స్వాతంత్ర్యానికి పూర్వం అఖిల భారత కాంగ్రెసు సంస్థ సంస్థానాల పట్ల తటస్థవైఖరి వహించింది. బ్రిటిషు పాలన క్రిందవున్న ప్రాంతాలలోని

పార్టీతో సంబంధాలు నెలకొల్పుకుంది. హైద్రాబాద్‌లోని "స్టేట్‌పీపుల్స్ కాన్ఫరెన్సును" కాంగ్రెస్ సమర్థించేది. కాని సంస్థానాలపట్ల మాత్రం ఉదాసీన వైఖరి వహించేది.

ఆనాటి హైద్రాబాద్ సంస్థానంలో ప్రజలకు రాజకీయ స్వేచ్ఛఅనేది లేదు. ప్రజలు చైతన్య వంతులై ఎక్కడ ఎదురు తిరుగుతారోఅని ప్రతి వుద్యమాన్ని నిజాం మొగ్గలోనే తుంచివేసేవాడు. ఎలాంటి రాజకీయ వేదికనైనా అభివృద్ధి చెందనిచ్చేవాడుకాదు. అయినా పొరుగు రాష్ట్రాలలో జరుగుతున్న రాజకీయ సంచలనాన్ని చూసి ఈ సంస్థాన ప్రజలు ఉత్తేజంపొందేవాళ్ళు. రాజకీయ కార్యకలాపాలపై నిషేధం వున్నమూలాన ప్రజలు సాహిత్య, సాంస్కృతిక మతసంబంధమైన సంస్థలు స్థాపించు కొన్నారు. పాలకవర్గం ఈసామాజిక సంస్థలనుకూడ విడి విడిగానే వుండేట్టు చూసింది. ఆంధ్ర సారస్వత మహాసభ, పరిషత్తు, మహారాష్ట్ర పరిషత్తు, కర్ణాటక కాన్ఫరెన్సు అనేపేర్లతో సంస్థలు స్థాపించ బడ్డాయి. సంస్థానం మొత్తంలో మతపరంగా ఆర్యసమాజ్ వ్యాపించి పోయింది. అయినా ఒక యువవర్గం, ఈకార్యకలాపాలపట్ల తృప్తిచెందలేదు. సూటిగా రంగంలోకి దూకాలని ఈ యువకులు ప్రయత్నించారు. తమరాజకీయ ఆకాంక్షలను క్రియాన్వితం చేయాలనుకున్నారు.

1942 నాటి 'క్విట్ ఇండియా' ఆందోళనకు పూర్వమే వరంగల్‌లోని ఈ యువకవర్గం వ్యక్తి సత్యాగ్రహాలు జరిపింది. రాజకీయ దృష్టితో సంస్థానం మొత్తంలో వరంగల్ రాజకీయ చైతన్యం గల ప్రాంతం అనిపించుకుంది. ఆనాడు వ్యక్తి సత్యాగ్రహాలు జరిపిన యువకులు యమ్. యన్. రాజలింగం, బి. రంగనాయకులు, కొమరగిరి నారాయణరావులు. తర్వాత 1946లో వరంగల్‌లో ఒకటి రెండుచోట్ల ఈ యువకులు తమ కార్యకలాపాలు కొనసాగించారు. బి. హెచ్. చంద్రమౌళీశ్వర్రావు, హయ



హయగ్రీవాచారి

గ్రీవాచారి లాంటి ఇతర యువకులంతాకూడ వాళ్ళతో చేరిపోయారు. హయగ్రీవాచారి ప్రతివారం పతాక వందనం జరపడం ముఖ్య కార్యక్రమం. త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసి జాతీయభావాన్ని పెంచడంతో బాటు యువకుల శారీరక- మానసిక శక్తి యుక్తులను అభివృద్ధి చేయాలని వారి నిర్ణయం. ఆ నిర్ణయం మేరకు వరంగల్ కోటలో ఆ యువకుల కార్యక్రమం జరుగుతూ వుండేది. ఈ కోటను ఎన్నుకోడంలో ఉద్దేశం ఈ కాకతీయ మహానగరం కేంద్రంగా గతంలో విలసిల్లిన తమ జాతి సాంస్కృతిక రాజకీయ వైభవంతో మానసిక సంబంధం ఏర్పరుచు కోవాలను కోడమే. వరంగల్ కోట ప్రేరణా స్రోతస్వినిగా ఉపయోగపడింది. యువకుల దళం వృద్ధి చెందుతూ ఉత్సాహ వంతంగా తమ ఆశయాన్ని నెరవేర్చడానికి సంసిద్ధ మవుతోంది.

మరో వైపు ప్రజాస్వామ్యం దాని పరిణామాలను దృష్టిలో ట్టుకొని కొన్ని నిస్వార్థ పూరితమైన శక్తులు తల ఎత్తడం ప్రారంభించాయి. సంకుచిత స్వార్థశక్తులు తమ మనుగడ కోసం కొత్త ఆలోచనా విధానాన్ని ప్రతిపాదించాయి. మునిగే వాడికి పూచికపుల్ల సహాయ మన్నట్టు ముస్లింలు "తామే సంస్థాన పాలకుల" మని ప్రకటించారు. నిజాం తమకు ప్రతీక మాత్రుడని, ఈ రియాసత్ సంస్థానంలో తమ ఆమోదం లేకుండా ఎలాంటి రాజకీయ సంస్కరణ లేదా మార్పు జరగడానికి వీలులేదని స్పష్టం చేశారు.

ఈముస్లిం రాజకీయ పక్షంగానే నవాబ్ బహదుర్ యార్‌జంగ్ నాయకత్వాన "మజ్లీస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్" అనే సంస్థ ఏర్పడింది. నిజాం దృష్టిలో ఇది రాజకీయ సంస్థ కాదు. అందువల్ల నిషేధం లేదు. కొద్ది కాలంలోనే, నవాబ్ బహాదుర్ యార్‌జంగ్ ప్రాబల్యం పెరిగింది. అతని పలుకుబడికి భయపడి నిజాం అతనిని విషప్రయోగం చేసి చంపించాడనే వదంతి వుంది. నిజమేదైనా సంపూర్ణ ఆరోగ్యవంతుడైన ఆ నవాబ్ 1944 జూన్ ఇరవై ఐదున అకస్మాత్తుగా మరణించాడు. ఆ మరణం ఎట్లా జరిగిందో ఈనాటికీ ప్రశ్నగా నిలిచి పోయింది. నిజాం ఆ తర్వాత తన నిరంకుశాధి కారాన్ని కాపాడుకో దానికి ఈ మజ్లిస్‌నే ఉపయోగించు కున్నాడు. ఈ మతసంస్థ అంతర్గతమైన ఎన్నికలు, తదితర విషయాలపై నిజాం ఫర్మానాలు జారీ చేయడం మొదలు పెట్టాడు. సంస్థానంలోని అల్ప సంఖ్యాకులైన ముస్లింలు హిందువులపై అన్ని విధాలా అధికారం చలాయించాలని ప్రయత్నించారు. ప్రభుత్వ ఉద్యోగాలు, ధనం అన్ని తమసొంత ఆస్తి వ్యవహారంలా వుండేది. తాము పాలకులమని, హిందువులు పాలితులనే భావంతో వ్యవహరించేవారు. అధిక సంఖ్యాకులైన హిందువులను బానిసలుగా చూస్తూ వారి కార్యకాలాపాలను కనిపెట్టి వుండేవాళ్ళు. అందువల్ల వరంగల్ కోటలో జరుగుతున్న ఈ కార్యక్రమాన్ని సహించలేక పోయారు. ముఖ్యంగా సుబేదార్ హబీబుల్లాఖాన్ మతోన్మాది. బహుక్రూరుడు. అందువల్ల తీవ్ర పరిణామాలు సంభవించాయి.

## వరంగల్ కోటలో హః

ఆశావహంగా ప్రారంభమయ్యే ప్రతి ఉదయంలాగా ఆరోజుకూడా పక్షుల కిల కిలారావాలతో మొదలైంది. సూర్యకిరణాలు ప్రసరించి నూతన జీవితాన్ని వెదజల్లు తున్నాయి. వరంగల్ కోటలోని ఉత్తరభాగాన ఆరోజు కూడ పతాకవందన కార్యక్రమం జరిగింది. యువకులలో చాలామంది తిరిగి ఇండ్లకు వెళ్ళిపోయారు. కొందరు దగ్గరలోనేవున్న రామస్వామిఇంట్లో తేనీరు సేవించేనిమిత్తం కూచున్నారు. మొగలయ్య జెండాతాడును సరిచేస్తు



లకడీ పహిల్వాన్

నిలుచున్నాడు. అకస్మాత్తుగా వెనకనుంచి కొందరు రజాకార్లు వచ్చి బల్లెంతో మెడపై పొడిచేశారు. ఆ పతాకం తాడును పట్టుకొని మొగలయ్య కూలిపోయాడు.

"ప్రాణాలు పోయినాసరే, గౌరవాన్ని కాపాడుతామనే పతాకగీతం అక్షరాలా సార్థకమైంది. ఆ ప్రాతంలో కల్లోలం చెలరేగింది. హంతకులు మొగలయ్య అన్న రామస్వామి యింటిపై దాడి చేయడానికి వెళ్ళారు. రామస్వామి గడియ బిగించాలని ప్రయత్నిస్తుండగా బల్లెంతో ఒక్కపోటు పొడిచారు ఆయన ముక్కు తెగింది. లోపలివాళ్ళు నిరాయుధులు - అందరూ కలిసి తలుపులు బిగించారు. తలుపులు బద్దలు చేయలేక వాళ్ళు కేకలు వేసుకుంటూ వెళ్ళిపోయారు.

---

అసఫియా పాలనకు వ్యతిరేకంగా బానిసలు తిరుగుబాటు యత్నం చేయడమా? రాజకీయ చైతన్యాన్ని పెంచుకోడమా? పైగా జెండా వందన చేస్తూ కవాతు జరపడం మజ్లిస్ సభ్యులకు మహా నేరంగా తోచింది మొగలయ్య ఇంటిదగ్గర ఇదంతా జరపడం వాళ్ళు సహించలేక పోయారు. ఫలితంగా మొగలయ్య హత్య జరిగింది. అక్కడి పహిల్వాన్ నాయకత్వాన ముస్లిం దళం ఈదాడి జరిపింది, కొన్ని ప్రాంతాలలో కల్లోలం చెలరేగింది. లకడి పహిల్వాన్‌ను ఊరేగింపుగా తీసుకెళ్ళి పోతున్నారు. "షాహెంశాహ్ ఉస్మాన్ జిందాబాద్" అని నినాదాలిస్తున్నారు. కాఫిర్‌ను చంపి

విజయం పొందిన వాడిలా లకడి పహిల్వాన్ కాశింషరీఫ్ వరంగల్‌లో మహావీరుడై పోయాడు. కాశింషరీఫ్‌ను అభినందిస్తూ వచ్చిన ఊరేగింపు వరంగల్ కోట సింహద్వారం దగ్గరికి రాగానే సుబేదార్ హబీబుల్లాఖాన్ తన కారులో ఎదురు వచ్చాడు. స్వయంగా కాశింషరీఫ్‌కు పూలమాల వేసి అభినందించాడు. జిల్లాకు సర్వాధికారి లాంటివాడు స్వయంగా ఒక హంతకుణ్ణి బహిరంగంగా అభినందించడం జన సామాన్యంలో భయాందోళనలను రెచ్చ గొట్టింది. ఖూనీ చేసినవాణ్ణి శిక్షించే బదులు ఇలా ప్రశంసించడం అందరికీ వణుకు పుట్టించింది. విషాద పూరితమైన వాతావరణం ఏర్పడింది. ఆంగ్లేయుల ఛత్ర ఛాయలో రాజ్య మేలుతున్న నిజాం పాలనా యంత్రాంగం ఎంత బాగా శాంతి భద్రతలను కాపాడుతూ వుందో ఈఒక్క హత్యా సంఘటనయే నిరూపించ గలదు.

లకడీ పహిల్వాన్ ఊరేగింపు విజయోన్మాదంతో వరంగల్ టవున్‌లోకి ప్రవేశించింది. రైల్వేగేటు దగ్గరికి రాగానే ముస్లింలు కొన్ని గుడిసెలకు నిప్పు అంటించారు. అప్పుడు అక్కడి హిందువులు ఎదురుదాడి జరిపి ఒకడి కాలు విరగొట్టారు. కాలు విరగగానే మిగతా ముస్లింలు కాలికి బుద్ధి చెప్పారు.

మరునటిరోజు ప్రతీకారంగా ముస్లింలు అక్కడి చిప్ప అప్పయ్య అనే వ్యక్తిని హత్య చేశారు. ఆ తర్వాత గూండాలు కలిసి రైల్వేగేటు బస్తీపై దాడి చేయాలని సన్నద్ధమైనారు. అయితే బస్తీలోని హిందువులు ఆర్యసమాజ్ ప్రభావం వల్ల ఆత్మరక్షణకు అన్ని ఏర్పాట్లు చేసుకొన్నారు. ఇటిక్యాల మధుసూధన్ నాయకత్వం వాళ్ళకు బలాన్ని ఇచ్చింది. ముస్లిం గూండాలు దాడిచేస్తే ఎదురు దెబ్బలు తింటారని సుబేదార్ పసి గట్టాడు. సహాయంగా తుపాకులున్న పోలీసులను పంపించాలని ప్రయత్నం చేశాడు. సమయానికి పోలీసు బలగం అందుబాటులో లేదు. రాజీ జరుపుతానని హామీ ఇచ్చి ఒక్కరోజు గడిచిపో నిచ్చాడు. మరునటి రోజు పోలీసు దళం రాగానే

గూండాల దళాన్ని వెళ్ళి దాడి చేయమన్నాడు. 400 మంది ముస్లింలు బాజాలతో, నినాదాలతో బయలుదేరి బస్తీలోకి వచ్చారు. ఎదురుగా హిందువులు దాడిని ఎదుర్కోడానికి సిద్ధంగా వున్నారు. సుబేదార్ హిందువులనే చెదిరి పొమ్మని ఆర్డర్ ఇచ్చాడు. ఆత్మ రక్షణకు సిద్ధమైన ప్రజలను చెదిరి పొమ్మనగానే వాళ్ళు నిరాకరించారు. అదే అదనుగా సుబేదార్ కాల్పులు జరపమని హుకుం జారీ చేశాడు. ఫలితంగా వెంటనే ముగ్గురు హిందువులు మరణించారు. మరో ఇద్దరు తీవ్రంగా గాయపడ్డారు. కాల్పుల్లో మరణించిన వ్యక్తులు పడమటి క్రిష్టయ్య, కొడిమల కనకయ్య, మల్లయ్య. ఒకతీవ్రంగా గాయపడినవాళ్ళు వాడి లింగయ్య,ఆడెపు కొమరయ్య. ఈ విధంగా సుబేదార్ శాంతి భద్రతల పేర ప్రజలను బాహాటంగా ఖూని చేయించాడు.

మొగలయ్య, రామస్వామి గౌడ్ల కుటుంబం వరంగల్ కోటలో తాతల కాలంనుంచి నివసిస్తూ వుండేది. మొగలయ్యకు తెలుగు చదవడం, వ్రాయడం వచ్చు. వృత్తిరీత్యా కల్లుగీయడం పని. అతనిపై జాతీయ ఆందోళన ప్రభావం బాగా పడింది. వరంగల్‌లో పతాక వందనం ఇతర కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొని ఆనాటి ముస్లిం మత అహంకారానికి బలై పోయిన అమరవీరుడు ఈనాడు వరంగల్ మెయిన్ రోడ్డుపై అమర వీరుడు మొగలయ్య జ్ఞాపకార్థం ఒక హాలు నిర్మించారు. అంతే తప్ప ఆనాటి అనేక సంఘటనలను ప్రజలు మరిచి పోయారు. మొగలయ్య హత్య జరిగిన ఆరునెలల అనంతరం రామచంద్ర అనే ఒక హిందూ పహిల్వాన్‌ను దొంగచాటుగా ఒకరాత్రి హత్య చేశారు.

## నారాయణరెడ్డి బలిదానం:

1947 జూన్ 30 నాటిరోజు వేసవికాలం ముగిసి వర్షం కురుస్తున్న రోజులు. అయినా రాజకీయ వాతావరణం మహా ఉద్రేకంగా వుంది



నారాయణరెడ్డి

హైద్రాబాద్‌లో జూన్ 16నాడు స్టేట్ కాంగ్రెస్ మహాసభలు మహోత్సాహంతో జరిగాయి. సంస్థానంలో బాధ్యతా యుత మైన ప్రభుత్వం ఏర్పడాలని తీర్మానం చేయడం జరిగింది. దీనికి ప్రతికూలంగా ఇక్కడ వరంగల్ " ఈనాడు ముస్లిం సమావేశం జరుపుతున్నారు.

ఆరోజుమధ్యాహ్నం హన్మ కొండనుంచి డాక్టర్ నారాయణ రెడ్డి కారులో వరంగల్ వెడుతున్నారు. చౌరస్తాదగ్గర జాఫర్ అనే పోలీసు సబ్ ఇన్స్‌పెక్టర్ డాక్టర్‌కు నమస్కారంపెట్టి ఇలాంటి ఉద్రిక్త వాతావర ణంలో వరంగల్ వెళ్ళడం మంచిదికాదని సలహా యిచ్చాడు. నాకేం భయంలేదని డాక్టర్ వరంగల్‌లోని తన ఆసుపత్రికి బయలుదేరాడు. రోగులలో అనేకమంది ముస్లింలుకూడా వుండడం ఆయన ధైర్యానికి ఒక కారణం. డాక్టర్ నారాయణరెడ్డి తన ఆసుపత్రినుంచి ఇంటికి తిరిగి వస్తున్నాడు. జంకుతున్న నౌకరును ఇంటిదగ్గర కారులోనే వదిలి తనఇంటికి కొంచెం దూరంలో వున్నాడు. ఈలోగా కారుపై రాళ్ళు పడడం మొద లైంది. ఎనభైమంది ముస్లింలు కారును చుట్టుముట్టివేశారు. డాక్టర్ ఇంటికి చేరుకొనేలోగా అతన్ని కారులోంచి బయటికి లాగి బల్లెంతో కడుపులో పొడిచారు. కారుతున్న రక్తాన్ని ఆపుకొంటూ ఇంటిలోకి వచ్చి మంచంపై వాలిపోయాడు. భార్య, చిన్నకొడుకు దగ్గరికి రాగానే ఆయన చిన్నపిల్ల వాడి చేతిని, భార్య చేతిలో పెట్టి ప్రాణాలు వదిలాడు. బయట ముస్లిం

దుండగులు కారును దహనం చేయాలని ప్రయత్నించి పెట్రోలు లేకపోవ డంతో విఫలమై వెళ్ళిపోయారు.

నల్లగొండ జిల్లాలోని దేవరకొండ తాలూకాలో వున్న ముదిగొండ గ్రామవాసి టి. బుచ్చిరెడ్డి. ఆయన మధ్యతరగతి రైతు. ఒక ఆడపిల్లతో సహా ఐదుగురు సంతానం. నలుగురు మగపిల్లలలో డాక్టర్ నారాయణరెడ్డి పెద్దవాడు. ఇతను హైద్రాబాద్‌లోని చాదర్‌ఘాట్ ఉన్నత పాఠశాలలో చదివినతర్వాత ఉస్మానియా మెడికల్ కాలేజీలో వైద్యవిద్య నభ్యసించాడు. విద్యార్థికాలంలో ప్రతిభావంతుడుగా ఎన్నో బహుమతులు గెలుచుకొన్నాడు. ఆతర్వాత డాక్టర్ వృత్తిలోవుండగా ఉస్మానియా ఆసుపత్రిలో సర్జన్ బహదూర్‌ఖాన్ సహాయకుడుగా పనిచేసి ప్రశంసలు పొందాడు. గుల్బర్గాలో మెడికల్ ఆఫీసర్‌గా కొంతకాలం ఉద్యోగంచేసి హైద్రాబాద్ తిరిగి వచ్చాడు. స్వంతంగా ప్రాక్టిస్ ప్రారంభించి కొంతకాలం పనిచేశాడు.

అయితే వరంగల్‌లో ప్రాక్టీసు చేయవలసినదిగా మిత్రులంతా బలవంతం చేశారు. ఆయన 1944 దసరానాడు వరంగల్‌లో ప్రాక్టీసు మొదలు పెట్టాడు. కొద్ది కాలంలోనే ప్రజాభి మానాన్ని చూర గొన్నాడు. ఆయన రోగుల్లో 80 శాతం ముస్లింలు. అందులో 20 శాతం మంది బీద ముస్లింలకు ఆయన ఉచితంగా చికిత్స చేసేవాడు. 2, 3 నెలలలోనే వేలాది రూపాయలు ఆదాయం సమ కూరింది. తన తమ్ముళ్ళను చదివించి, ఇతరులకు సహాయ పడే ఉదార స్వభావం ఆయనది. వరంగల్‌లోని మరో డాక్టర్ టి. యన్. మూర్తితో ఆయనకు స్నేహం. ఆయన హైద్రాబాద్‌లో జరిగిన స్టేట్ కాంగ్రెస్ మహాసభలకు ప్రేక్షకుడుగా హాజరైనాడు. ఆదే మహా నేరంగా పరిణమించింది. పైగా ప్రముఖ హిందువుగా దృష్టిలో వున్నాడు. ఆయన హత్య జరిగిన తర్వాత కూడా సుబేదార్ ఎవరిని అరెస్టు చేయించలేదు. ఎవరిపైనా విచారణ జరిపించ లేదు.

# సోమవారంపై దాడి

మహబూబాబాద్ తాలూకాలోని ఎర్రబాడు గ్రామంలో కమ్యూనిస్టు విప్లవ కారులు రహస్యంగా వున్నారని సుబేదార్ తన పోలీసు బలగంతో వెళ్ళి గ్రామస్థులను బెదిరించాడు. స్వయంగా విప్లవ కారులను ఎదుర్కొనే దమ్ములు లేక గ్రామస్తులే వాళ్ళను పట్టి తెచ్చి హాజరు పర్చాలని హుకుం జారీ చేశాడు. తన బలగంతో కుమ్మరికుంట దేశ్‌ముఖ్ దగ్గర రాత్రి అన్ని మర్యాదలు పొందాడు సుబేదార్. ప్రజలను భయ భ్రాంతులను చేయాలనే ఉద్దేశ్యంతో సుబేదార్ ఆ తరువాత గ్రామంపై బడి గుడిసెలకు నిప్పు పెట్టించాడు. బీదగ్రామ ప్రజలు, రైతులు నిరాశ్రయులై గగ్గోలు పెట్టారు. రజాకార్ల మూకలు కమ్యూనిస్టులను శిక్షించాలనే నెపంపై అమాయకులైన ప్రజల ఇండ్లను తగులబెట్టేవాళ్ళు. ఇష్టానుసారం లూటీలు జరిపే వాళ్ళు. ఇలాంటి సంఘటనలు వరంగల్‌లో పరిసర గ్రామాలాలో అనేకం జరిగాయి.

సంగా జగన్నాథ్ అనే యువకుడు పరిసర గ్రామాల్లో ఆత్మ రక్షణ కోసం గ్రామీణ దళాలను నిర్మించాడు. ఉరుస్ అనే ప్రాంతంలోని రజాకార్ల దళం జగన్నాథ్‌ను పట్టు కోవాలని బయలు దేరింది. వర్ధన్నపేట లోని రాయపర్తికి చెందిన రజాకార్లదళం నాయకుడు షమ్సుద్దీన్ రజాకార్ల ధళానికి నాయకత్వం వహించి గ్రామాలపైపడ్డాడు. అయితే ఉప్పరపతిదగ్గర సంగా జగన్నాథ్ దళాలు ఈ రజాకార్లమూకలను ఎదుర్కొని వెనక్కు తరిమి కొట్టారు. వాళ్ళువెనక్కువెళ్ళి మరికొన్నిగ్రామాలపైబడి గుడిసెలను తగులబె ట్టారు. అంతారంలో లూటీలుచేశారు. మానభంగాలుజరిపారు. కొలకపాకఅనే గ్రామంలో 22 మంది యువకులను బంధించి, వాళ్ళను వరుసగా కాల్చుమని అక్కడి వైశ్యుడైన యువకుణ్ణి ఆదేశించారు. అతను ఎదురు తిరిగి రజాకార్లపై తుపాకి ఎక్కుపెట్టాడు. అయితే అతన్ని వెంటనే రజాకార్ల


సంగా జగన్నాథ్

నాయకుడు, ముజా మియా. కాల్చివేశాడు. ఆ నాటికి బతికి బయటపడిన యువకుల్లో చందా బచ్చయ్య ఒకడు. 22 మందిని తుపాకులతో కల్చి వాళ్ళశవాలపై గడ్డివేసి తగులబెట్టాడు. ఈలోగా సంగా జగన్నాథ్ దళం వచ్చి దాడి జరపింది. అప్పుడు ఆ రజాకార్ల దళం పారిపోయి చోటాపల్లి ముస్లిం జాగీర్దార్ ఇంట్లో వున్నారు. చోటాపల్లిలో ఇండ్లు తగులబెట్టి అక్కడకూడా 22 మంది యువకులను కాల్చివేశారు. జమలాపూర్ సోమవారం అనే గ్రామంలోకి వెళ్ళి లూటీలు, మానభంగాలు జరిపారు. చివరికి అసహాయులైన బాలింతలపై పాశవికంగా ప్రవర్తించారు. ఈ ఘోరకృత్యాలన్నీ సాలార్ షమ్సుద్దీన్ నాయకత్వాన జరిగాయి.

ఇరవయ్యో శతాబ్దంలోనే ఈ ఘోర కిరాతకాలు తెలంగాణా ప్రాంతాలలో అనేకం జరిగాయి. పాకిస్తాన్ సైనికులు తూర్పు బెంగాల్‌లో తమ సోదరులైన ముస్లింలపై ఎన్ని హత్యాచారాలు జరిపారో ప్రపంచానికి తెలుసు. అయితే ఇక్కడ ముస్లింలు హిందువులపై జరిపిన కిరాత చర్యలు అసలు ప్రపంచ దృష్టికి రాలేదు. ఈ అంశాలు బయటికి రావటం మత ప్రమేయం లేని వ్యవస్థకు భాగం అని భావించారేమో?



# 12. గెరిల్లా రైతు దళం

రజాకార్ల కాలంలో దుండగాలకు వ్యతిరేకంగా నిలుచని ఎక్కడి కక్కడ అన్యాయాన్ని, హింసను విజయవంతంగా ఎదుర్కొన్న సంఘటనలు ఇంతకు పూర్వం చూశాం. స్థానికంగా గ్రామీణులు రజాకార్ల గూండా చర్యలను తమకు లభించిన కొద్దికాలంలోనే ప్రాణాలు సైతం లెక్కచేయక ప్రతిఘటించారు. అయితే వీటి నన్నింటిని, మించి సాయుధ రైతాంగ గెరిల్లా దళాలు శత్రువుల్ని ప్రతిఘటించిన తీరు, చరిత్రాత్మక మైనది. సంఖ్యలో, ఆయుధాలతో తమను మించిన శత్రు దళాలను సాహసంతో, త్యాగంతో, ధైర్యంతో చాక చక్యంగా గెరిల్లా యుద్ధ పద్ధతులను అవలంబించి మట్టి కరిపించిన ఉదంతాలు చాలా ఉన్నాయి.

ఈ రైతు దళాల సభ్యుల మానసిక స్థైర్యం చెప్పకో తగ్గది. ఆనాటి పాలక వర్గాల కిరాయి సైనికులవలె, రజాకార్ల వలె లూటీలు, హత్యలు మాన భంగాలు చేస్తూ అసలు పోరాటంలో తోక ముడుచుకొని పారిపోవడం కాకుండా ఒక పవిత్ర ఆశయంకోసం న్యాయంకోసం, సర్వస్వం అర్పించ డానికి పోరాటంలో పాలొనే రైతు గెరిలాల సాహసం, త్యాగం ఎన్నోరెట్లు ఉన్నతమైనది.

రైతుదళం గురించి వివరించే ముందుగా రెండు అంశాలను ప్రస్తావించవలసివుంది. మొదటిది 1938 లో హైదరాబాద్ నగరంలోని హస్మత్‌గంజ్‌లో మార్వాడి సమాజ్ ఆధ్వర్యాన వినాయక ఉత్సవాలు జరుగుతున్నాయి! భారత కోకిల, సరోజినీదేవినాయుడు అధ్యక్షత వహించిన ఆ ఉత్సవాల్లో నవాబ్ బహాదుర్ యార్‌జంగ్ ఉపన్యసిస్తున్నాడు. హైదరాబాద్ సంస్థానంలో హిందూ- ముస్లింలు, పాలు- తేనెలా కలసి వున్నారని, ఇస్లాం ఏకేశ్వరో పాసననే కోరుతూవుందని, కుల బేధాలను వ్యతిరేకిస్తుందని అన్నాడు. అయితే ఇక్కడే ఒకవర్గం మత స్వాతంత్ర్యం కోరుతూవుందని, దానిలక్ష్యం నిజాం కింగ్ కోఠీ వైపు మాత్రమేనని, అదే ఇస్లాం ఐక్యతకు బలం చేకూరుస్తూ వుందని బహాదుర్ యార్‌జంగ్ ఆర్య సమాజ్‌ను పరోక్షంగా ఎత్తి చూపించాడు.

పోలీసు చర్య తర్వాత ఒకరోజు వినాయక్‌రావు విద్యాలంకార్‌గారు అమర వీరుడు శ్యాంలాల్ గురించి చెబుతూ ఒక అంశాన్ని జ్ఞాపకం చేశారు. శ్యాంలాల్‌గారు ఆర్య సత్యాగ్రహానికి పూర్వం ఆత్మ విశ్వాసంతో ఒకమాట అన్నారు. –“రావుగారు, మీరు నమ్మండి. 10 సంవత్సరాలలో మనం ఈ సంస్థానపు రాజ్య పీఠాన్ని కూలదోయగలం. మనప్రజల రాజ్యం అప్పుడు ఏర్పడుతుంది.”

ఈరెండు అంశాలు ఒక విషయాన్ని స్పష్టం చేశాయి. నవాబ్ బహాదుర్ యార్‌జంగ్ అనుమానాలు, భయం, మరోవైపు శ్యాంలాల్ ఆత్మ విశ్వాసం, బలిదానం. ఇవే క్రమంగా రైతు దళానికి పునాదులుగా నిలిచాయి.

ఆనాటి సంస్థానంలో ఆర్య సమాజ్ ఉద్యమాన్ని అణచి వేయడానికి నిజాం ప్రభుత్వం శాయ శక్తులా ప్రయత్నించింది. 1938 లోనే బీదర్ జైలుతో నిర్భందించబడ్డ శ్యాంలాల్‌కు విషప్రయోగం చేసి చంపి వేశారు

అయినా 1939 నుండి ఆర్య సమాజ్ ఆందోళన మహోద్యమంగా సాగింది. ప్రజలు వేలాది సంఖ్యలో సత్యాగ్రహంలో పాల్గొంటూ జైళ్ళపాలయ్యారు. ఆనాటి సత్యాగ్రహుల ఆత్మ విశ్వాసాన్ని, క్రమశిక్షణను, చూసి గాంధీ మహాత్ముడే ప్రశంసించాడు. ఆర్యసమాజ్‌పై దుండగాలు జరిపి, ఖూనీలు చేయించి కేసుల్లో ఇరికించినా ప్రజావుద్యమం వెనుకంజ వేయలేదు. చివరికి నిజాం ఆర్యసమాజ్ కోరికలను మన్నించక తప్పలేదు.

1948 లో మారిన కాలానికి అనుగుణంగా ఆందోళనాపద్ధతులు కూడా మారిపోయాయి. ఆనాటి సత్యాగ్రహం ఈనాటి శస్త్రాగ్రహంగా పరిణమించింది. సాయుధులైన రైతు గెరిల్లా దళాలు ఈ దశలో తమ పాత్రను ఉత్తేజంతో నిర్వహించాయి.

పోలీసుచర్య జరిగింది, ఎర్రకోటపై ఆసఫియాధ్వజాన్ని ఎగురవేస్తానన్న రజాకార్ల సర్వ సైన్యాధికారి కాశిం రజ్వీ కటకటాల వెనక్కి వెళ్ళాడు. సంస్థానంలో జరిగిన రక్తపాతానికి మూలకారకుడైన నిజాం భారతసైన్యంముందు బేషరతుగా మోకరిల్లాడు.

పోలీసుచర్యకు పూర్వం కొందరు యువకులు ఉద్‌గీర్ పరిసర గ్రామాలను కాపాడుతూ రజాకార్ల దుండగాలను ఎదిరించారు. సాహసంతో, క్రమశిక్షణతో, సంఘటిత శక్తిగా రూపొందిన ఈయువకులే రైతుదళంగా పేరు తెచ్చుకొన్నారు. ఆరు నెలలపాటు సాయుధులైన రజాకార్లను నిజాం సైనికులను, రోహిలాలను పఠాన్‌లను, వీరత్వంతో, ప్రతీకారవాంఛతో ప్రతిఘటిస్తూ అనేక గ్రామాలను రక్షించారు. చాకచక్యంగా, ధైర్యంగా శత్రువులను ఎదుర్కొని ఎంతోమంది రజాకార్లను పోలీసు అధికార్లను మట్టుపెట్టారు. గ్రామీణుల మనోధైర్యాన్ని నిలిపారు. బీదర్ జిల్లాలోని రజాకార్లకు, పోలీసులకు ఈ రైతుదళం సింహస్వప్నంగా పరిణమించింది.

అందువల్లనే పోలీసుచర్య జరిగాక జిల్లా మొత్తంలో ఆడవాళ్ళు చంపుడుదగ్గర ఈ రైతు గెరిల్లాల సాహసకృత్యాలను పాటలుగా పాడుకొనే వారు. మహారాష్ట్రలోని "గోంధలి" అనే జానపదగాయకులు వీరరస ప్రధానమైన "వహాడే" అనే గేయ ఫణితిలో రైతువీరులను స్తుతిస్తూ గ్రామాలలో తిరిగేవారు.

స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానంతతీర్థ ఆదేశాన్ని అనుసరించి ఈ రైతుదళంవాళ్ళు కొందరు స్వయంగా పోలీసుచర్య తర్వాత ఆయుధాలను అప్పగించారు. శాంతిస్థాపనకు తోడ్పడ్డారు. అయితే ఈ రైతుదళం ప్రముఖ నాయకులైన మానిక్‌రావు మూలే, చన్‌వీర్ తదితరులను అరెస్టుచేయడం జరిగింది. దోన్‌గావ్ ప్రజలు ఈ పరిస్థితిని ఏనాడూ ఊహించలేదు. ఈ రైతుదళ నాయకులను అరెస్టు చేయాలనే ప్రయత్నాలను అంతకు పూర్వం, రెండు, మూడు సార్లు గ్రామప్రజలు అడ్డుకున్నారు. కానీ ఈ సారి పోలీసులు గూర్ఖాసైనికుల సహాయంతో వచ్చి ఉదయమే డోన్ గ్రామంపై దాడిచేసి ఈ ప్రముఖులను నిర్బంధించింది. మరికొన్నిచోట్ల 12 మందిదాకా రైతుదళ సభ్యులను అరెస్టుచేశారు.

ఈ రైతుదళ వీరులు, డోన్‌గావ్ తిరుగుబాటుదార్లు ముస్లింలపై ధాడిచేసి లూటీలుజరిపి, హత్యలు చేశారని ఆనాటి తాత్కాలిక సైనిక ప్రభుత్వానికి చెందిన మిలిట్రీ ట్రిబ్యునల్‌కు కొందరు ఆరోపణలు అందజేశారు. ఈ దళంపై కోపం వున్నవాళ్ళు ఆజిల్లా పోలీసులను రెచ్చగొట్టారు. ముఖ్యంగా పోలీసు డి. యస్. పి. నాయక్‌గారు మరీ పట్టుదలతో పనిచేసి వీళ్ళను అరెస్టు చేయించాడు. ఆయుధాలను అప్పగించలేదని కూడ ఆరోపణ చేశారు. నిజాంకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన ఈదళం ఆనాటి భారత ప్రభుత్వానికి విరుద్ధంగా కూడ సాయుధ తిరుగుబాటు చేయదని నమ్మకమేమిటని డి. యస్. పి. నాయక్ ప్రచారం చేస్తూ వాళ్ళకు ఏవిధంగానైనా

శిక్ష వేయించాలనే ప్రయత్నాలు చేశాడు. రైతు దళానికి చెందిన ఈ నాయకులు, మరికొందరు సభ్యులు ఆయుధాలు అప్పగించ మన్నారు. అయితే ఆనాటి అస్థిర పరిస్థితులలో తాత్కాలిక సైనిక ప్రభుత్వం శాంతి స్థాపన అనే నెపంపై ఆయుధాలను అప్పగించనివాళ్ళను కాల్చివేయమని కూడా ఆజ్ఞలు జారీచేసింది.

బీదర్ జిల్లాలో ముస్లింములపై అత్యాచారాలు జరిగాయనే ఆరోపణల విచారణకు ఒక కార్యాలయం తెరిచారు. సెక్యులర్ భారత ప్రభుత్వం ఈ విషయమే జిల్లా కలెక్టర్ శ్రీ రోబెల్లోను శ్రద్ధ వహించవలసి నదని ఆదేశించింది. స్వయంగా ప్రధాని నెహ్రూ బీదర్‌లో పర్యటించి వెళ్ళారు. అందువల్ల డోన్‌గావ్ దళ సభ్యులను ఏ విధంగానైనా అణచి వేయాలని కలెక్టర్ పట్టుదలతో వున్నాడు.

కొన్ని రోజుల తర్వాత ఆ ప్రాంతంలో ఇన్‌చార్జ్ డి. యస్. పి. గా ప్రభు అనే పోలీసు అధికారి వచ్చాడు. ఆయన ఈ రైతు దళ సభ్యుల సాహస గాథలు విని ముగ్ధుడై పోయాడు. మరుసటి రోజు మిలిటరీ ట్రిబ్యునల్ సమక్షంలో ప్రభుగారు, స్వయంగా సాక్ష్యం చెప్పవలసి వుంది. ఆరోజు అర్ధరాత్రి ప్రభుగారు జైలులోకి వెళ్ళి ఈ రైతుదళ సభ్యులను కలిశారు. అదేరాత్రి తప్పించుకొని పారిపొమ్మని సలహా ఇస్తూ వీలయితే తన జీప్‌కారును కూడా ఉపయోగించు కోమని కోరారు. అయితే ఆయన సానుభూతికి కృతజ్ఞతలు చెబుతూ రైతుదళ సభ్యులు ఇలా అన్నారు. మీకు ప్రమాదాన్ని కొనితెచ్చే పని మేము చేయలేము. మీరు మాకు ఒక చిన్న సహాయం చేయండి. రేపు విచారణ జరిగే టప్పుడు మాత్రం మా కేసును చివర వుండేట్టు చూడండి, అంతేచాలు.

## తప్పించు కోవడం :

బీదర్ కోటలోని ఒకభాగంలో మరుసటి రోజు విచారణ ప్రారంభ



చన్

మైంది. అనేకమంది విచారణ జరిగిన తర్వాత ఈ రైతుదళ సభ్యుల వంతు వచ్చింది. తోరణ్ తదితర ప్రాంతాలలో ఈ సభ్యులు 100 కు పైగా ముస్లింలను హత్య చేశారని నేరం ఆరోపించ బడింది. అయితే విచారణలో ఎవరూ సాక్ష్యం ఇవ్వలేదు. ఫలితంగా ఆరోపణ నిరాధార మైనదని, మిలిట్రి ట్రిబ్యునల్ అధికారి బెట్ మంగల్ అందరిని నిర్దోషులని వదిలి వేశాడు. రైతుదళ సభ్యులు ఉత్సాహంతో నినాదాలు ఇస్తూ మెట్లు దిగకుండానే పైనుండి క్రిందకి దూకారు. వెంటనే బయట నున్న సాయుధపోలీసులు చుట్టుముట్టారు. దళ సభ్యులను తిరిగి అరెస్టు చేయమని ఆదేశించి కలెక్టర్ పోలీసులను పంపించాడు. అయితే దళ సభ్యులు పోలీసుల నుంచి తుపాకులు లాక్కొని పారిపోవాలని అనుకొన్నారు. నాయకుడు చన్‌వీర్ మాత్రం దూరదృష్టితో ప్రవర్తించాడు. సహచరులతో ఓపిక పట్టమని చెప్పి జమేదార్‌తో ఇలా అన్నాడు. "జమేదార్ మమ్మల్ని ఈనాడు అరెస్టు చేయవచ్చు. మేము నిరాయుధులమని, ఆపని మీరు చేయగలరు. అయితే రేపటి సంగతి ఆలోచించండి. మాదళం చాలా పెద్దది. బయట వున్నవాళ్ళు ప్రతీకారం తీసుకోకుండా ఊరుకోరు. మీ సంసారం, భార్య, పిల్లల సంగతి ఆలోచించు కోండి."

ఆనాటి బీదర్ పోలీసుల మనోధైర్యం చెదిరిపోయింది. రైతుదళ సభ్యులను ఎంత జాగ్రత్తగా ప్రతీకారం [illegible] బాగా

తెలుసు. 300 ల సభ్యులు మాత్రమే అయినా ఈదళం సభ్యులు నిజాం అధికారులను ఎలా వణికింప జేశారో అందరికి అనుభవమే. అందువల్ల జమేదార్ అన్నాడు "నిజమే, మిత్రమా నువ్వు చెప్పిన మాటకూడా ఆలోచించ దగినదే ?"

వానాకాలం నాటి ఆ సాయంత్రం, చీకటి పడుతున్న వేళ చన్‌పీర్ తదితరులు ఆకోట క్రింద భాగంలోంచి తప్పించు కొని పారిపోయారు, పోలీసులు చూస్తూ వూరుకుండి పోయారు. వెనకాలే మరో పోలీసు దళం వెంటాడ వచ్చుననే అనుమానం చేత ఆ రైతుదళం యువకులు డొంకదారి వెంట వెళ్ళిపోయారు. అడవుల వెంటబడి మంజీరా నదివైపు దారి తీశారు. ఈ యువకుల దగ్గర ఆయుధాలు అసలే లేవు, చివరికి లాఠీలు కూడాలేవు. వెనకాల పోలీసు దళం వచ్చి పట్టుకొనే అవకాశం వుంది. ఆకలి దప్పికలతో నడచి, అలసి ఎనిమిది మైళ్ళు దాటిన తరువాత చివరికి ఆ రాత్రి మంజీరా నది తీరానికి చేరుకున్నారు. నదిపొంగి పొర్లుతూ వుంది ఎదురుగా ఒక డింగి మాత్రమే వుంది. నదిదాటక తప్పదు. దళ సభ్యులు కేకవేసి తాము దళం వాళ్ళమని వెంటనే నది దాటాలని అరిచారు. పడవవాడు దళం వాళ్ళనగానే ప్రేమ పూర్వకంగా వచ్చాడు. ఆ చీకట్లో ప్రమాదం వున్నా భయపడక ఆదళం వాళ్ళకు సహాయ పడ్డాడు. చివరికి నదిదాటి సురక్షితంగా మరోతీరం చేరు కొన్నారు, దళ సభ్యులు.

తీరం చేరుకున్నారో లేదో వెనకాల నుంచి పోలీసుల జీపు చప్పుడు చేసుకుంటూ వచ్చింది. వెనకాల నుంచి తీరంపై జీపుఆపి పడవ వాడిని కేక వేశారు పోలీసులు. దళ సభ్యులు వెంటనే ఆచిన్న పడవను చేతికందిన రాళ్ళతో విరగ్గొట్టి పనికి రాకుండా చేశారు. పడవవాని అంగీకారంపైననే వానిని పడవకు కట్టిపడేసి, ముందుకు పరుగులంకించు కొన్నారు. 'పడవతను కాపాడండి బాబో' అని కేకలువేస్తూ నటించాడు.

రైతుదళ సభ్యులు చన్‌వీర్‌నాయకత్వాన సత్తువను, ఓపికను పుంజు కొని పరిగెత్తుతున్నారు. ఆకలిని, అలసటను భరించలేక విశ్వనాథ్‌పటేల్ భూమి మీద నీరసించి పడిపోయాడు. అతన్ని మరి కొందరిని అక్కడే వదిలేసి చన్‌వీర్ మిగతావాళ్ళతో దగ్గరలోనే వున్న గిఢీకుసుసూన్ అనే గ్రామం చేరుకొన్నాడు. ఆ గ్రామం పటేల్ వీళ్ళను చూసి ఆనందంగా స్వాగతం చెప్పాడు. వెనకాలే ఉండిపోయిన మిగతా దళ సభ్యులను రప్పించే ఏర్పాట్లుచేశాడు. అందరు భోజనంచేసి తిరిగి బయలుదేరారు, అయితే పటేల్ గ్రామప్రజలు ఇష్టపడలేదు. పోలీసుల బారినుంచి దళాన్ని కాపాడగలమని హామీ ఇచ్చారు. పరిస్థితి విషమించింది కాబట్టి ముందుకు వెళ్ళిపోవడమే శ్రేయస్కరమని వీళ్ళువాదించారు. పటేలు వాళ్ళకు గుర్రాల్ని కొన్ని ఆయుధాలను ఇచ్చి ముందుకు పంపించాడు. అప్పటికే అర్థరాత్రి గడిచి రెండు గంటల సమయం కావచ్చింది.

40-45 మైళ్ళు ప్రయాణంచేసి ఆఖరకు దళ సభ్యులు తమ స్థావరం చేరుకున్నారు. రామఘాట్ అనే ఆ స్థావరం కాలి నడకతో తప్ప చేరుకోలేము. ఆ స్థావరంనుంచి దూరదర్శినితో చూసి, వచ్చే వ్యక్తులను రైతుదళం పసి గట్టేది. విమానాలతో తప్ప ఆస్థావరంపై దాడి చేయడం సాధ్యంకాదు.

మానిక్‌రావు మూలే, చన్‌వీర్ తదితరులు జైలునుంచి పారిపోయి వచ్చారని అందరికీ తెలిసిపోయింది. బీదర్ జిల్లాలో తిరిగి ఈ దళం ఎక్కడ కార్యకాలాపాలను ప్రారంభించి శాంతి భద్రతలకు ముప్పుతెచ్చి పెడుతుందో అని జిల్లాకలెక్టర్ భయపడి పోయాడు. దండనతో కాకుండా సామ, దాన భేదోపాయాలతో రైతుదళాన్ని లొంగదీసుకోవాలనుకున్నాడు. దళాన్ని క్షమించామని చెప్పి మంచి చేసుకోవాలనే సలహా కూడా ఇవ్వడం జరిగింది.



మానిక్‌రావ్ మూలే

ఒకరోజు ఆ స్థావరానికి కాంగ్రెస్ కార్యకర్త మాధవ్ రావు. ఘున్‌సేకర్ స్వయంగా వచ్చాడు. జిల్లాకలెక్టర్ క్షమించడానికి సిద్ధంగా ఉన్నాడని, ఆయుధాలతో సహా లొంగిపోవడం మంచిదని నచ్చచెప్పాడు. అధికారుల స్వభావం తెలిసిన సభ్యులు నిరాకరించారు. మాధవరావు ఖాళీ చేతులతో తిరిగి వెళ్ళిపోయాడు.

మరోరోజు బోరోల్ పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్ పెద్దారెడ్డి ఆ స్థావరానికి వచ్చాడు. నిరాయుధుడుగా వున్నాడని రానిచ్చి మాట్లాడారు. కలెక్టర్ ఇచ్చిన హామీని అతను తిరిగి చెప్పాడు.

ఆ ప్రతిపాదనను చర్చించి తమ నిర్ణయాన్ని తెలియ జేస్తామని పెద్దారెడ్డిని పంపించి వేశారు. ఆ తర్వాత దళ సభ్యులు గంభీరంగా పరిస్థితిని అంచనావేసి ఒక నిర్ణయానికి వచ్చారు. కలెక్టరు హామీని పరీక్షించే నిమిత్తం దళంలోంచి ఒక సభ్యుని ముందుగా పంపించాలనుకున్నారు. చీటీలు వేయగా అనుకోకుండా చన్‌వీర్ పేరువచ్చింది. చన్‌వీర్ ఆత్మ సమర్పణ కోసంగాను సిద్ధబడ్డాడు.

ఇక్కడ రైతుదళం ఏర్పడిన తీరు కొంత తెలుసుకోవలసి వుంది. హిందూ యువకులు సాహసంతో ముందుకువచ్చి ప్రాణాలకు తెగించి ముస్లింలపై ప్రతీకారం తీర్చుకోవడానికి కొన్ని పరిస్థితులు తప్పని సరిగా దారితీసాయి. రెండో ప్రపంచ యుద్ధం ముగిసింది. భారత స్వాతంత్ర్య

పోరాటం ముందంజ వేస్తోంది. నిజాం స్వతంత్ర హైద్రాబాద్ కోసం ఏర్పాట్లు చేసుకొంటున్నాడు. ఇత్తేహాదుల్ ముస్లిమీన్ సంస్థ కాశిం రజ్వీ నాయకత్వాన హిందువులను భయభ్రాంతులను చేస్తోంది. ముఖ్యంగా హరిజనులను చేరదీసి "పస్త్అక్వామ్" అనే పేరుతో రజాకార్ల దళంతో బాటు కొందరిని దళాలుగా తయారుచేశారు. స్వార్థపరులైన కొందరు హరిజన నాయకులు ఈ అవకాశాన్ని బాగావినియోగించుకున్నారు. ఆనాటి రజాకార్ల మంత్రివర్గంలోవున్న బి. వెంకట్‌రావు మరో నాయకుడు శ్యాంమ్‌సుందర్ హిందువులకు వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం చేశారు. రజాకార్లతో బాటు గ్రామాలు లూటీలు, దహనాలు, మానభంగాలులాంటి అరాచక చర్యల్లో పాలుపంచుకున్నారు.

ఈ పరిస్థితులలో ఆత్మగౌరవంగల మిగతా హిందువుల ఉనికికే ప్రమాదం ఏర్పడింది. ఎదురుకిల్చి ప్రతిఘటించని పక్షంలో అన్యాయాన్ని, హింసాకాండను ఎదుర్కొనలేమని ఆర్యసమాజ్ ఉద్బోధించింది. ఉత్తేజం కలిగించి ఆత్మవిశ్వాసాన్ని రగుల్కొల్పింది. ఫలితంగా అనేకమంది యువకులు రైతుదళంగా ఏర్పడి దేశభక్తిని, త్యాగాన్ని నిరూపించారు.

ముఖ్యంగా తొండచీర్, దోన్‌గావ్, పాయ్‌గావ్, అట్టర్గా, బోట్‌కల్ అనే గ్రామాలలోని రైతు యువకులు ఆయుధాలు ధరించి ప్రతిఘటనకు నడుం బిగించారు.

దీర్ఘకాలిక పోరాటానికి సిద్ధపడ్డారు. ప్రజలు ఈ రైతుదళాన్ని ప్రాణప్రదంగా చూసుకొనేవారు. ఈ పరిస్థితివల్ల రైతుదళాన్ని స్వేచ్ఛగా వదిలివేస్తే ఏమిచేస్తారో అనే భయం జిల్లా అధికారులకు కలిగింది ఇదీ క్లుప్తంగా ఆనాటి పరిస్థితి.

## ఆవిర్భావం

1947 ఆగష్టు 15 నాడు హైద్రాబాద్ సంస్థానం తప్ప మిగతా దేశానికి స్వాతంత్ర్యాయువు లభించింది. ఆ సంవత్సరమే దోన్‌గావ్‌లో

ముస్లింలు స్వతంత్ర హైదరాబాద్ పేర ఉత్సవాలు చేసుకొంటున్నారు. అప్పుడే మఖోల్‌నుంచి గుర్రంపై స్వారీచేస్తూ ఒకవ్యక్తి అటు వచ్చాడు. ఆజానుబాహుడైన ఆ వ్యక్తి తాదిలాపూర్‌కు చెందిన తుకారాం పటేల్. ఆర్యసమాజ్ కార్యకర్త పటేల్ కత్తి, తుపాకి, ధరించి సాగిపోతుండగా ముస్లింల ఈ ఉత్సవంగురించి తెలిసింది. బ్రిటిషు పరాయి పాలననుంచి విముక్తి లభించినా హైదరాబాద్ సంస్థానపు హిందూ ప్రజలకు మాత్రం ఇంకా బానిస జీవితమే మిగిలింది. ఆనాటి పరిస్థితుల్లో తెగించి నిజాం పాలనను కూలదోస్తేతప్ప విముక్తి లేదు. అందుకోసం సాయుధ పోరాటం తప్ప మరో మార్గం కనపడలేదు. తుకారాం పటేల్ కృతనిశ్చయుడై ఆర్యసమాజ్ నాయకులకు తన అభిమతాన్ని తెలియజేశాడు. ఈ పోరాటం ఎలా సాధ్యమౌతుందని వాళ్ళు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు.

ఆతర్వాత తుకారాం బార్షీ వెళ్ళాడు. అక్కడ శ్రీ హరిశ్చంద్ర ఆర్య ఆధ్వర్యాన జరుగుతున్న ఆర్యవీరదళ్ అనే శిక్షణ కేంద్రంలో కొన్ని వారాలు వున్నాడు. తిరిగి వచ్చిన తర్వాత తాను స్వయంగా తాదిలాపూర్‌లో కొందరు యువకులను చేరదీసి శిక్షణ కార్యక్రమాన్ని కొనసాగించాడు. మరో స్నేహితుడు కన్హయ్యలాల్ (25 సంవత్సరాల మార్వాడి యువకుడు) కూడా ఈ సాయుధ పోరాటానికి కృతనిశ్చయుడై కలసి వచ్చాడు. ఇతను మదనూర్‌నుంచి ఉద్‌గీర్‌కు ఈ ఆశయ సాధన కోసమే వచ్చాడు. ఆర్యసమాజ్ ముఖ్యకేంద్రమయిన ఉద్‌గీర్‌లో తగిన సహచరులు లభిస్తారనే ఆశతో వున్నారు. క్రమంగా ఇద్దరు మిత్రులకు నర్సింగ్ ప్రసాద్, విఠల్‌రావ్‌మురుగ్ తోడైనారు. విఠల్‌రావు గూఢచారిగా రహస్యాలను అందజేసే కార్యాన్ని స్వీకరించాడు. ట్వెల్వ్‌బోర్ తుపాకి పిస్టోల్‌లు మరికొన్ని నాటు తుపాకులు సమకూరినాయి. గ్రామీణ రైతు యువకులకు శిక్షణ ఇవ్వడం ప్రారంభమైంది.

సాయుధ పోరాటాన్ని ప్రారంభించేముందు ఆర్యసమాజ్ అనుమతి తీసుకోవడం తుకారాంకు సమస్యగా మారింది. క్రమశిక్షణను పాటించే వ్యక్తిగా తుకారాం ఆర్యసమాజ్ నాయకులలో సంప్రదించాడు. కాని ప్రోత్సాహం అంతగా లభించలేదు. అప్పుడు వినాయక్‌రావు విద్యాలంకార్ ఆర్యసమాజ్ పత్రిక "ఆర్యభాను"లో ఒక వ్యాసంద్వారా ప్రజలు ఆత్మ రక్షణకోసం స్వయంగా నడుం బిగించాలని పిలుపు ఇచ్చాడు. ఆర్యప్రతినిధి సభ హైద్రాబాద్ శాఖ అధ్యక్షుడుగా వున్న వినాయక్‌రావు విద్యాలంకార్ పిలుపు పరోక్షంగా తుకారాంను ఆజ్ఞాపించినట్టు తోచింది.

పేరు ప్రతిష్టలుండి చదువుకున్న వ్యక్తులు ఎక్కువ సంఖ్యలో ముందంజ వేయకపోవడం వల్ల తుకారాం కొంత చెడ్డ పేరు గల వాళ్ళను కూడా దళంలో చేర్చుకోవలసి వచ్చింది. మామూలు రైతులే కాకుండా దొంగలుగా, రౌడీలుగా పేరుపొందిన వాళ్ళను, జామీనుపై వచ్చిన అరాచక శక్తులను కూడా తమతో కలుపుకున్నాడు. తెగించి బడె మనస్తత్వం మొండిధైర్యం వుండే ఆ వ్యక్తులను ఈ విధంగా మలచి ఉపయోగించు కున్నాడు.

తమ కార్యకలాపాల కోసం తాదిలాపూర్ సురక్షితమైన ప్రదేశం కాదనుకొన్నాడు. తొండచీర్ అనే గ్రామంలో వున్న వత్సలాబాయి గఢ్‌కోట ఉపయోగపడింది. అక్కడ పోలీస్ పటేల్ కిషన్‌గిర్, వత్సలాబాయి గుమాస్తా. స్వయంగా తుకారాం మిత్రుడు. ఆ గ్రామాధికారిణి వత్సలాబాయి అనుమతితో ఆమె గఢ్ దళానికి నివాస స్థానంగా ఏర్పడింది.

కిషన్‌గిర్ సోదరుడు హీరాగిర్ సత్యాగ్రహంలో పాల్గొని గుల్బర్గా జైల్లో వున్నాడు. మరో తమ్ముడు దత్తుగిర్ ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ ఈ దళంలో చేరాడు. ఈ సోదరుల తల్లి దళానికి అన్నపూర్ణగా ఉండేది. తొండచీర్‌లో దళం శిక్షణకోసం అన్ని ఏర్పాట్లు జరిగాయి. ఆయుధాలతో



దత్తు

శిక్షణ, కవాతు ఇవన్నీ గ్రామీణులలో ఆత్మ విశ్వాసాన్ని ఉత్సాహాన్ని పునర్జీవింప జేశాయి. క్రమంగా రైతు దళాలు ప్రతిఘటనా కార్యక్రమాన్ని ప్రారంభించాయి. ఆనంద్‌వాడి, బొలెగాట్ దగ్గర ఆరైతుదళం, రజాకార్లను తిప్పికొట్టిందని వార్తవచ్చింది. ఈవార్త మిగతా దళాల ఉత్సాహాన్ని రెట్టింపుచేసింది.

తొండచీర్ కేంద్రం మరింత సురక్షితం కావాలంటే అప్పారావు పటేలు ఆ దళంలో చేరడం చాలా అవసరం. కౌల్‌ఖేడ్ గ్రామానికి చెందిన అప్పారావు దగ్గరకి తరచుగా రోహిల్లాలు, పఠానులు వచ్చిపోతూ వుండే వాళ్ళు. పైగా తొండచీర్ కౌల్‌ఖేడ్ నుంచి మైలున్నర మాత్రమే. నర్సింగరావు ఠాకూర్‌కర్ అనేవ్యక్తి అప్పారావును రైతు దళంలో చేరమని ఆహ్వానించాడు. ఆనాడు నలువైపులా హిందువులపై జరుగుతున్న ముస్లిం అత్యాచారాలు అప్పటికే అతన్ని బాగా కదిలించివేశాయి. అందువల్ల అప్పారావు వెంటనే అంగీకరించాడు. తొండచీర్ రైతుదళం మరింత కట్టుదిట్టంగా కార్యకలాపాలను సాగించింది. వడిసెలు, చాకు, బరిసె, తుపాకి తదితర ఆయుధాలతో సక్రమంగా శిక్షణ, ఇస్తూ వచ్చారు. మరోవైపు మందు గుండు సామాగ్రి ఆహారధాన్యాలు సేకరించి నిల్వచేస్తున్నారు. అమాయకుల్లా కనపడే సభ్యులను గూఢచారులుగా నియమించారు. ఎప్పటి కప్పుడే రజాకార్ల కదలికలను ఆచూకి తీసి వార్తలు అందజేశారు. అన్ని


అప్పారావ్ పటేల్

ఏర్పాట్లు జరిగిన తరువాత భావి కార్యక్రమాన్ని నిర్ణయించే నిమిత్తం రామఘాట్‌లో చుట్టు ప్రక్కల వుండే యువకులు సమావేశం ఒకటి జరిగింది. దగ్గర దూరం నుంచి మొత్తం 52 గ్రామాలకు ఆహ్వానాలు వెళ్ళాయి.

ఆనాటి రజాకార్లను ఎదుర్కోవటం అంటే రాక్షసులతో యుద్ధం చేయడం వంటిదని ప్రజలకు అనిపించింది. ఆ రామ, రావణ యుద్ధంలాంటి పోరాటంలో పాల్గొనాలని రైతులు ఎంతో ఉత్సాహంతో ముందుకు వచ్చారు. అంతిమ విజయం తమదే అనే ఆత్మ విశ్వాసం అందరిలో ఉప్పొంగింది.

## దోన్‌గావ్ తిరుగుబాటు

రైతుదళాల పోరాటం ప్రారంభం కాకపూర్వం జరిగిన సంఘటన డోన్‌గావ్‌లో మసీదు దగ్గరనుంచి బాజా భజంత్రీలు వాయించుకుంటూ వెళ్ళారని కొందరు హిందువులపై కేసుపెట్టారు. ఆ కేసులో ఆనాడు మానిక్‌రావ్ మూలే, చన్‌వీర్‌లు కూడా వున్నారు. మేజిస్ట్రేట్ వీళ్ళిద్దరు మైనార్టీ దాటనివాళ్ళని హెచ్చరించి మిగతావాళ్ళకు శిక్షవిధించి పంపించాడు.

ఆ రోజుల్లో ఉద్‌గీర్ ఆర్యసమాజ్ కార్యకలాపాలకు ప్రధాన కేంద్రం. ఈడోన్‌గావ్ యువకులు అటువైపు ఆకర్షితులై తమగ్రామంలో కూడా ఆర్యసమాజ్ శాఖను స్థాపించారు. ఉత్సాహంతో పట్టుదలతో పని

ప్రారంభించారు. 1944-45 నాటి మాట. మధోల్ ఆర్య సమాజ్ ఉత్సవాలకు ఆనాటి ఆర్యసమాజ్ నాయకులు శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్ కృష్ణదత్ హాజరైనారు.

ఈ ఇద్దరి నాయకుల ఉపన్యాసాలు విని డోన్‌గావ్ యువకులు ఉత్తేజితులైనారు. క్రమంగా అన్యాయాన్ని ప్రతిఘటించే సాహసాన్ని పొందారు.



కన్హయ్యాలాల్

ఉద్‌గీర్ ప్రాంతంలో ఉన్న తోరన్ అనే గ్రామంలో శ్రీనివాసరావు దేశ్‌ముఖ్ ఇంట్లో ఒక సంఘటన జరిగింది. యాకుబ్ అనే రోహిల్లా బలవంతంగా ఆ ఇంట్లోకి వెళ్ళి అధికారం చెలాయించడం ప్రారంభించాడు. అలాగే ఆ గ్రామవాసులను నానాబాధలు పెట్టేవాడు. అతనితో బాటు మరి కొంతమంది రోహిల్లాలు చుట్టుప్రక్కల గ్రామాలను భయభ్రాంతులను చేశారు. ముఖ్యంగా యాకుబ్‌ను అదుపులో పెట్టాలని తోరన్ ప్రజలు కోరారు. అప్పుడే మానిక్‌రావు చన్‌వీర్‌ల నాయకత్వాన కొంతమంది యాకుబ్ ఇంటిపైకి వెళ్ళారు. తన భార్యా పిల్లలతో కలిసి, యాకుబ్ ఇంటిపైఎక్కి తుపాకితో కాల్పులు మొదలుపెట్టాడు. క్రిందనుంచి రాళ్ళు విసిరారు. చివరికి ఒకరాయి బలంగా యాకుబ్‌కు తగిలింది. అతను గాయానికి కట్టుకట్టుకోవాలని ఇంట్లోకి దిగాడు. అదే అదునుగా మానిక్‌రావు చన్‌వీర్‌లు ఇంటిపైకిఎక్కి లోనికిదూకి యాకుబ్‌ను పట్టుకొచ్చారు ఆతరువాత మానిక్‌రావుపటేల్ దగ్గర అందరూకలసి యాకుబ్‌కు శిక్ష విధించారు.

అతను చేసిన అన్యాయాలకు, రౌడీ పనులకు శిక్షగా రెండు కళ్ళు పెరికి వేసారు.

ఆ తర్వాత తీవ్రమైన పరిస్థితి ఏర్పడింది. యాకుబ్ బంధువు ఒక తను పోలీసు సబ్ ఇన్స్పెక్టర్. అతను డోన్‌గావ్ ప్రజలపై కేసు పెట్టాడు. మానిక్‌రావు చన్‌వీర్‌లు పారిపోయారు. ఒక ముస్లిం పైరవీకారుడు రెండు వేల రూపాయలు లంచం తీసుకొని అందరిని వదిలివేయించగలనని హామీ ఇచ్చాడు. అప్పుడు గ్రామంలోకి తిరిగి మానిక్‌రావు, చన్‌వీర్‌లు వచ్చారు. కొన్నిరోజులకు అకస్మాత్తుగా నాగభూషణ్ అనే యువకుని అరెస్టు చేయాలని పోలీసులు వచ్చారు, డోన్‌గావ్ ఆర్యసమాజ్ కార్యదర్శిగావున్న నాగభూషణ్‌ను అరెస్టుచేస్తుండగా సహించి ఊరుకోవడం మిగతావాళ్ళకు సాధ్యం కాలేదు మానిక్‌రావు, చన్‌వీర్ లాఠీలు తీసుకొని నాగభూషణ్ దుకాణం దగ్గరికి వెళ్ళారు. పదిమంది పోలీసులు, జమేదార్, ఒక సబ్ఇన్స్పెక్టర్ సిద్ధంగా ఉన్నారు. ఆ గ్రామంలో అరెస్టు జరగకుండా అందరూ పట్టుబట్టారు. పోలీసులు వినలేదు. అప్పుడు పోలీసులపై దాడిచేసి సబ్ఇన్స్పెక్టర్‌ను గాయపర్చారు. తుపాకి, సంకెళ్ళు లాక్కున్నారు. మిగతా పోలీసులు భయపడి పారిపోయారు.

పోలీసు అధికారిని గాయపర్చి తుపాకి, సంకెళ్ళు లాక్కోడం మహా నేరం. అందువల్ల మానిక్‌రావు, చన్‌వీర్, మరికొంతమంది గ్రామంలోంచి పారిపోయారు. నిజాం పోలీసులు గ్రామ ప్రజలను బాధించడం మొదలు పెట్టారు. అప్పుడు బాల్కి తాలూకాలోని కున్‌నూర్ పోలీసు స్టేషనుపై దాడి చేయాలని ఆ యువకులు పథకం వేశారు. అయితే ఆ పథకం గురించి ఎలాగో పోలీసులకు తెలసిపోయింది, ఆ పని సాధ్యం కాలేదు. ఆ తర్వాత ఐదారు నెలలు గడచిపోయాయి. ఇక ఏమీ జరగదని భావించి ఆ యువకులంతా గ్రామంలోకి తిరిగి వచ్చారు. నిర్లక్ష్యంగా తిరగడం,

మొదలుపెట్టారు. అప్పుడు అకస్మాత్తుగా ఒకరోజు పోలీసులు గ్రామంపై దాడి జరిపి మానిక్‌రావు, చన్‌వీర్‌లతో సహా ఎనిమిది మందిని అరెస్టు చేశారు.

ఉద్‌గీర్‌లో తిలక్‌చంద్ అనే వైద్యుడు వుండేవాడు. ఆయన ఇచ్చిన సలహా ననుసరించి ఆ ఎనిమిది మంది యువకులు బీదర్ జిల్లా జడ్జికి లంచం యిచ్చి బయటికి వచ్చారు వాళ్ళు బయటికి రాగానే మరోవార్త తెలిసింది. కొల్‌ఖేడ్ గ్రామంలో అప్పారావు పటేల్ ఇంటిపై రజాకార్లు దాడిచేసి ఇంటిని తగులబెట్టారు. తమ స్నేహితుడు అన్నివేళల అండగా వుండేవాడు అన్యాయానికి గురైనాడు. సర్వత్రా ముస్లింల దాడులు దోపిడీలు జరుగుతున్నాయి. ఈ హింసాకాండను ఎదుర్కోడానికి ఈ యువకులంతా అన్ని విధాలా సంసిద్ధులైనారు.

నిజాం రాజ్యాన్ని ఆనుకొని బార్షీ ప్రాంతం వుంది. అది ఆనాటి స్వతంత్ర భారత్‌లో ఒకభాగం. నిజాం రాజ్యంలోని ఆర్యయువకులు అన్యాయాల్ని ఎదుర్కొనే నిమిత్తం బార్షీలో వున్న శ్యామార్య గురుకులంలో శిక్షణ పొంది వచ్చేవాళ్ళు. ఈ గురుకులాన్ని అమరవీరుడు శ్యాంలాల్ అన్న బన్సీలాల్ నిర్వహించేవాడు. ఆర్యవీరుల దళాన్ని నిర్మించి ఆయుధాలను ప్రయోగించే శిక్షణ ఇచ్చేవారు. అలాంటి శిక్షణ శిబిరంలో పాల్గొని యశ్వంత్‌రావు సాయ్‌గావ్ చేరుకున్నాడు. ఆతన్ని పట్టించి ఇవ్వాలని రజాకార్లు పోలీసులకు కబురుచేశారు. యశ్వంతరావు 1948 జనవరి 30 నాటి నుంచి తన గ్రామంలో యువకులకు శిక్షణ ఇవ్వడం ప్రారంభించాడు. ఒక రోజు పోలీసులు వచ్చి సాయ్‌గావ్‌లో యశ్వంత్‌రావ్ ఇంటిని చుట్టుముట్టారు. యశ్వంతరావును పోలీసులు గుర్తించలేదు. ఫలితంగా అతను పోలీసులకు ఎదురుపడి యశ్వత్‌రావు అనే వ్యక్తి ఇంట్లో ఉన్నాడని చెప్పి తప్పించుకొని పారిపోయాడు. అతను వెళ్ళిపోయిన తర్వాత పోలీసులకు అసలు


యశ్వంతరావు సాయిగాంవ్‌కర్

వాస్తవం తెలిసివచ్చింది. ఈ లోగా యశ్వంత్‌రావ్ చేతికి చిక్కకుండా వెళ్ళిపోయాడు.

ముకేర్, కోంగి, అటర్గా బోలేగావ్, సంగమ్‌నార్‌ద్వా, జిర్‌గల్, కేసర జబల్‌గా, మిరకల్ మొదలైన గ్రామాలలో యువకులు రైతుదళాలుగా ఏర్పడి శిబిరాలు నిర్వహించారు. ప్రజల మనోధైర్యాన్ని పెంచి ప్రతిఘటనాశక్తిని ఇచ్చారు. మిరకల్‌కు చెందిన వెంకటేశ్వరరావు కూడా సాహస వంతుడు. అతను, యశ్వంతరావు కలిసి విజయవంతంగా శిబిరాలను నిర్వహిస్తూ వచ్చారు.

మరోసారి యశ్వంతరావును అరెస్టుచేయాలని పోలీసులు సాయ్‌గావ్ వచ్చారు. అప్పుడు యశ్వంత్ స్వయంగా తుపాకి తీసుకొని ఇంటిపైకిఎక్కి సవాలు చేశాడు. పోలీసులు ఈ పరిస్థితిని వూహించలేకపోయారు. అందు వల్ల అరెస్టు చేయకుండానే తిరిగి వెళ్ళిపోయారు.

ఆతర్వాత రజాకార్లు పోలీసులవల్ల లాభంలేదని తామే బయలుదేరారు. వెంకట్‌రావ్‌పై దాడి చేయాలని సాయుధంగా వచ్చారు. ఈ విషయం తెలుసుకున్న యశ్వంత్‌రావు తన సహచరులతో ఎదురు వెళ్ళాడు. వెంకట్ రావ్ యశ్వంత్‌రావులను చూచి రజాకార్లు పారిపోవడం ప్రారంభించారు.

ఇప్పుడిక సాయ్‌గావ్ రజాకార్లు వెంకట్రావ్ యశ్వంత్‌రావ్‌ల వల్ల తమ ఉనికికే ప్రమాదముందని గమనించారు. అందువల్ల అక్కడ హిందువుల, ముస్లింల శాంతి సభ ఏర్పాటు చేశారు. నిజాం పాలనలో ఈ శాంతి

సభ అనే నాటకాన్ని ఆడి ముస్లింలు తరుచుగా హిందూ ప్రజలను మభ్య పెడుతూండేవారు. అన్యాయానికి గురైన హిందువులను జరిగిందంతా మరచి పొమ్మని నచ్చజెప్పి ఏదో సమన్వయ సంఘాన్ని స్థాపించారు. అందులో ముస్లిం పెద్దలను, ఆర్యసమాజ్ కార్యకర్తలను సభ్యులుగానియమించేవారు. ఈ సంఘాలవల్ల సామాన్య జనం నుంచి కార్యకర్తలు కొంత దూరమయ్యే అవకాశం వుండేది.

అలాటి శాంతి సభ సాయ్‌గావ్‌లో జరిగింది. వెంకట్రావ్, యశ్వంత్ రావ్‌లతో తప్ప మిగతా అందరితో శాంతియుతంగా జీవించే అవకాశాలున్నా యని రజాకార్లు అన్నారు. ఇదివిని వెంకట్రావ్, యస్వంత్‌రావ్‌లు సభ నుంచి వెళ్ళిపోయారు. నిజమే వారిద్దరు గ్రామంలో ఉండకపోతే శాంతి సుస్థిరంగా వుంటుందని కొందరు హిందువులు కూడా భావించారు. ఆ తర్వాత అదే అవకాశంగా తీసుకొని శాంతి సంధిపేర రజాకార్లు పంచదారను పంచారు. అక్కడున్న వారికి కొంతకాలం తర్వాత సాయ్‌గావ్ హిందువులు నిస్సహాయులు అనే వాస్తవాన్ని గమనించి రజాకార్లు గ్రామాన్ని దోచు కున్నారు. అమానుషంగా ప్రవర్తించారు. అమాయకత్వానికి ఇతరుల దయా దాక్షిణ్యాలపై బతికే పరిస్థితికి ఆ దుస్థితి తప్పలేదు.

## రామ్‌ఘాట్‌లో సభ

హైద్రాబాద్ సంస్థానంలో రోజు రోజుకు రజాకార్ల దుండగాలు మితిమీరి పోతున్నాయి. లూటీలు. మానభంగాలు, దహనాలు, అపహరిం చడం మామూలైపోయింది. గోట్టాలో హిందువులను ఊచకోతకోశారు. ఈ సంఘటనలన్నీ యశ్వంత్‌రావ్. వెంకట్రావ్ తదితర యువకులను తీవ్రంగా కదిలించి వేశాయి. ప్రతీకారవాంఛ రగిలింది. అందరు కలిసి అట్టగే ప్రాంతంలో సమావేశం ఏర్పాటు చేశారు. అట్టగే గ్రామం రాజమార్గం

నుంచి దూరంగా ఉండేది. చుట్టుపక్కల ముఖ్యమైన గ్రామాల నుంచి ఇక్కడికి చేరుకోవాలంటే మంజీరానదిని దాటి రావలసిందే! పైగా ఆ గ్రామంలో రజాకార్ల కార్యకలాపాలు లేవు. స్థానిక ప్రజల సహకారం సులభంగా ఉంది. ఈ కారణాలవల్ల అట్టర్గేలోనే సభ జరిగింది. చుట్టుప్రక్కల నున్న గ్రామాలనుంచి వందలాది సంఖ్యలో రైతు యువకులు సభలో పాల్గొన్నారు. రజాకార్ల అత్యాచారాలను ఎదుర్కోడానికి రైతుదళ నిర్మాణం జరిగింది. ఎక్కడ దాడి జరిగినా లోపలనుంచి గ్రామీణులు ఆత్మరక్షణ కోసం పోరాడాలని బయటినుంచి రైతుదళం వచ్చి దెబ్బ తీస్తుందని నిర్ణయించారు. డా. చిన్నప్ప అధ్యక్షుడుగా, యశ్వంత్‌రావ్ కార్యదర్శిగా వెంకట్రావ్ దళం కమాండర్‌గా మరికొంత మందిని కార్యవర్గ సభ్యులుగా నియమించడం జరిగింది,

ఒకరోజు అకస్మాత్తుగా వార్త అందింది. ఆనంద్‌వాడ బోలేగావ్ గ్రామంపై రజాకార్లు పస్‌ఆక్వామ్‌లు కలిసి దాడి చేయబోతున్నారని తెలిసింది. అప్పుడు యశ్వంత్‌రావ్ పది మంది సహచరులతో సాయుధంగా బయలుదేరాడు. గ్రామం చేరుకోగానే రజాకార్లు లూటీ ప్రారంభించారని తెలిసింది. ఈదళంవెళ్ళి ఎదురుదాడి జరిపింది ఇలాంటి పరిణామాన్ని ఊహించని రజాకార్లు వెనక్కితగ్గారు. అమాయకంగా లొంగిపోయే ప్రజల్లా కనబడలేదు. ముఖ్యంగా ఆ రజాకార్లతో బాటు శంభాజీ ధాకూకూడా వున్నాడు. యశ్వంత్ స్వయంగా వెళ్ళి శంభాజీ అనే గజదొంగపై దాడి జరిపి చంపివేశాడు. అది చూడగానే మిగతా రజాకార్లు భయపడి పారిపోయారు. అప్పుడే గ్రామ ప్రజలు తిరిగి ఇళ్ళకు చేరుకోగలిగారు. రైతు దళం చేసిన సాహసానికి ప్రజలలో ఆత్మవిశ్వాసం మేల్కొన్నది. హిందువులంటే మేకల వంటివారు కాదని, ప్రతీకారం తీర్చుకోవడం చేతనవుననే వాస్తవం రజాకార్లకు తెలిసివచ్చింది.

ఆ రోజుల్లో అట్టరేడదళం సంఖ్య పది. ఇద్దరి దగ్గరేతుపాకులున్నాయి. మిగతావాళ్ళదగ్గర కత్తులు బల్లాలు వున్నాయి. నిజాం పోలీసులు బోల్‌గామ్‌పై ఈ దళం దాడి చేసిందని తెలుసుకొని వచ్చారు. చచ్చి కాలిపోయినవ్యక్తి హిందువు. కాబట్టి గొడవేలేదనుకొని పోలీసులు బాడిదపై పంచనామా జరిపి వెళ్ళిపోయారు. నిజాం రాజ్యంలో హిందువుల దుస్థితి అలాంటిది. ఇక్కడ రైతుదళం యశ్వంత్, వెంకట్‌ల నాయకత్వాన సాహసవంతంగా పనిచేస్తూ వుందని తొండచీర్ కేంద్రానికి తెలిసింది. తుకారాంపటేల్ వెంటనే ఆ ఇద్దరిని ఘామ్‌ఘాట్‌లో జరుగబోయే మహాసభకు ఆహ్వానించాడు తమ ముఖ్యమైన అనుచరులతో వచ్చి రామ్‌ఘాట్‌లోని రైతుదళంతో కలవవలసిందని రజాకార్ల దుండగాలను తాము కూడా ఎదుర్కొంటున్నామని తమ అంతిమ లక్ష్యం హైద్రాబాద్ విముక్తి అని తెలియజేశారు.

7మే, 1948 నాడు రామఘాట్‌లో రైతు దళాల మహాసభ. గుర్రాలపై సాయుధులైన రైతు యువకులు వచ్చి చేరుకొంటున్నారు. వెంట ఆయుధాలతో బాటు తినడానికి రొట్టెల మూటలు కూడా ఉన్నాయి. ఆ ఉత్సాహాన్ని ధైర్యాన్ని చూస్తుంటే శివాజీ కాలంనాటి గెరిల్లా సైనికులు జ్ఞాపకం వస్తారు. మహోత్సాహంతో నిండిన ఆ వాతావరణంలో పరిచయమున్నవాళ్ళు ఒకరినొకరు కౌగలించుకుంటున్నారు.

ఈ మహా సభకు వచ్చిన ప్రముఖులు తుకారాంపటేల్, నర్సింగరావు వస్తాద్, గ్యానోబాపాటిల్, దత్తూగీర్, యశ్వంతరావ్, వెంకట్రావ్. డా॥ చన్నప్ప నివృతిరావు, అప్పారావు పటేల్ తదితరులు. సరిగ్గా మధ్యాహ్నం రెండు గంటలకు సభ మొదలైంది. చర్చలు జరిగాయి. నిర్ణయాలు తీసుకోబడ్డాయి. కొందరిని గూఢచారులుగా నియమించారు. స్పష్టమైన కార్యనిర్వహణ పద్ధతిని రూపొందించారు.

కార్యక్రమం :— ఎక్కడ రజాకార్ల దాడి జరిగినా వెంటనే వెళ్ళి

ప్రతిఘటించడం, రజాకార్ల జాడ కనిపెట్టి వాళ్ళ కార్యక్రమాన్ని గూఢ చారుల ద్వారా తెలుసుకోవడం తొండచీర్, అట్టర్గే దళాలన్నీ కలిసి ఏకైక రైతుదళంగా పని చేయడం మొదలైనవి.

ఆ సభలోనే ఈ సంఘటిత శక్తికి ప్రతీకగా వున్న రైతాంగ దళానికి అప్పారావు పటేల్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. దత్తాగీర్ దళాల కమాండర్‌గా నియమించబడ్డాడు. సాయంత్రం 6గంటలు కాగానే అందరు విడిపోయారు. గుర్రాలపై యువకులు వార్తలు సేకరించే నిమిత్తం వెళ్ళి పోయారు. నిశ్శబ్దం నెలకొన్న రామఘాట్ ఆశ్రయానికి విశ్రామానికి ఆ యువకులందరిని ఆహ్వానించడానికి సిద్ధంగావుంది.

మరుసటి రోజు 8మే నాడు దళానికి చెందిన గూఢచారులు సమాచారం అందజేశారు. పొరుగునవున్న రావణగావ్‌పై రజాకార్లు దాడి చేయనున్నారని అక్కడ వివాహిత బ్రాహ్మణస్త్రీని అపహరించుకు పోదల్చారని గ్రామ ప్రజలు అడవుల్లోకి పారిపోతున్నారని కబురుచేరింది. తొండచీర్ గఢ్‌లోని గంట మ్రోగింది. కోల్‌ఖేడ్ వార్త అందించారు, అరగంటలో వందమంది సాయుధదళ సభ్యులు సిద్ధమైనారు. "శివాజీకిజై, హరహర మహాదేవ్, భారతమాతాకిజై" అని నినాదాలు చేస్తూ బయలుదేరారు. దారిలో రైతులు ఇదంతా చూసి, స్వయంగా బల్లాలు, గొడ్డళ్ళు తీసుకొని వెంటవెళ్ళారు. నాలుగుమైళ్ళు ప్రయాణంచేసి గంటసేపట్లో రావణగావ్ చేరుకున్నారు. రైతుదళం వస్తూవుందనే వార్తవిని రజాకార్లు అంతకు ముందే తోకముడిచి వెళ్ళిపోయారు.

ఈలోగా మరోవార్త ఖత్‌గావ్‌లోకి రజాకార్లు ప్రవేశించారని తెలిసింది. వెంటనే ఎండలో ఆకలి దప్పికలను లెక్కచేయకుండా మొత్తందళం ఖత్‌గావ్ వైపు మళ్ళింది. దళం వెళ్ళగానే రజాకార్లు అక్కడ నుంచి కూడా పారిపోయారు. గ్రామరక్షణ జరిగిందని, తమ మానధనాలను కాపాడే

నిమిత్తం వచ్చిన దళ సభ్యులను గ్రామీణులు గౌరవించి, భోజన సదు పాయాలు ఏర్పాటుచేశారు. ఆ తర్వాత తిరిగి దళం కొండచీర్ బయలు దేరింది. ఒకమైలు ప్రయాణం చేశారో లేదో మళ్ళీ కబురు అందింది. రజా కార్లు అంతకుపూర్వము చెరుకు తోటల్లో దాక్కొని తిరిగి ఖత్‌గావ్‌పై దాడి చేశారని తెలిసింది. వెంటనే వెనక్కి తిరిగి దళం ఖత్‌గావ్‌కు చేరు కుంది. రజాకార్లకు దళానికి పెద్ద ఎత్తున పోరాటం ప్రారంభమైంది. ముగ్గురు రోహిలాలు సజీవంగా పట్టుబడ్డారు. మిగతా రజాకార్లు ప్రాణాలతో తప్పించుకొని పారిపోయారు. ఇద్దరు రోహిలాలను దోస్తు మొహమ్మద్‌ఖాన్, కరీంఖాన్‌లను దళం వాళ్ళు ఖతం చేశారు. మూడోరోహిలా చీకట్లో తప్పిం చుకొని పారిపోగలిగాడు. మొదటిసారిగా దళం సాధించిన ఈ విజయానికి అందరూ ఉప్పొంగి పోయారు. అయితే ఖత్‌గావ్‌పై మరుసటి రోజు పెద్ద ఎత్తున రజాకార్లు కసి కొద్ది దాడి చేస్తారేమో అని దళం అక్కడే విడిది చేద్దామనుకొన్నది కాని గ్రామ వాసులు తమ రక్షణ తాము ఎట్లాగైనా చేసు కుంటామని దళం వెళ్ళి విశ్రాంతి తీసుకోవడం మంచిదని కోరుకున్నారు. అప్పారావు నాయకత్వాన దళం విజయోత్సాహంతో తొండచీర్ వెళ్ళిపో యింది. ఆ తర్వాత చుట్టుపక్కల ఈ దళాన్ని మూడుపేర్లతో పిలవడం ప్రారంభించారు. దళంవాళ్ళు. రైతుసంఘము. అప్పారావు పార్టీ అని అను కోడం మామూలైంది.

మరుసటిరోజు ఉదయం కాగానే ఖత్‌గావ్ దావాపు ఖాళీఐపోయింది. ఇద్దరు రోహిలాల శవాలు గ్రామంలోనే బాహాటంగా పడివున్నాయి. ఇద్దరు ముస్లింలను అలా చంపివేయడం హిందూగ్రామ ప్రజలందరికి భయాన్ని కలిగించింది, పోలీసులు వచ్చి ఏమిచేస్తారో అనే భయం అది. నిజాం రాజ్యంలో అలా జరగడం బహిరంగమైన తిరుగుబాటు తప్ప మరోటికాదని అందరూ భావించారు.

పోలీసులు శవాల పంచనామా చేశారు. డీ. యస్. పీ. వైర్‌లెస్‌ద్వారా వార్త ందించాడు. ఉద్‌గీర్ దారిన కనపడిన ప్రతి హిందువును ముస్లింలు కొట్టడం ప్రారంభించారు. ఆ తర్వాత ఖత్‌గావ్‌లోని గోవిందరావు కుల కర్ణి కుటుంబం మొత్తాన్ని అరెస్టు చేశారు. గోవిందరావు తొండచీర్‌లో ఉపాధ్యాయుడుగా పనిచేసేవాడు. ఆడవాళ్ళను వదిలి తండ్రి కొడుకులను మరి కొంత మంది హిందువులను జైల్లో వేశారు.

ఖత్‌గావ్ నుండి కమాల్‌నగర్ నాలుగుమైళ్ళదూరంలో వున్నది. మధ్య మధనూర్ అనే గ్రామం. రజాకార్లు ప్రతీకారం తీసుకోవాలని మధ నూర్‌పై దాడిచేశారు. రోజంతా తుపాకి కాల్పులు జరిగాయి పూర్వం అను కొన్న విధంగానే గ్రామంలోంచి గ్రామీణులు బయట నుంచి దళం మూక ఉమ్మడిగా ఎదిరించి రజాకార్లను చావుదెబ్బకొట్టారు. ఇద్దరు రజాకార్లు చని పోయారు. ఈ పోరాటంలో 60 సం॥ వృద్ధుని పరాక్రమం ప్రత్యేకించి పేర్కొనదగినది.

పై సంఘటన జరిగిన కొన్నిరోజులకు దత్తగీర్ ఒకరిద్దరు మిత్రులతో బండిలో చిఖిలీ అనే గ్రామం వెళ్ళాడు. 11 మే అతను గ్యానోబా పటేల్ గదిలో ప్రవేశించాడు. రైతుదళంలోకి ఆ గ్రామం ప్రజ లను కూడా చేర్చుకోవాలని అతను వెళ్ళాడు. ఈ చిఖిలీలోనే ఆయన ప్రధా నోపాధ్యాయుడుగా పనిచేశాడు. దత్తగీర్ వచ్చాడని తెలిసి రజాకార్లు వెంటనే చుట్టుప్రక్కల వాళ్ళను సమీకరించారు. ఈలోగా కోటలోని రామారావు పటేల్‌ను హిందువులు సహాయం అడిగారు. ఆయన 500 మందిని వెంట బెట్టుకొని తుపాకులతో సహా వచ్చి, గఢ్‌లోకి వచ్చాడు. లంబాడీలు మరి కొంత మంది హిందువులు దారిలో ఎదుర్కొడానికి అన్ని ఏర్పాట్లు చేశారు. ఈ ఏర్పాటు చూచి రజాకార్లు రాజీకోసం చర్చలు మొదలు పెట్టారు. నిజాం రజ హిందూ ముస్లింలు రెండు కళ్ళలాంటి వారని, తమకు

దత్తగీర్‌ను మాత్రం అప్పగిస్తే చాలునని అన్నారు. భయస్తులైన కొందరు హిందువులు అతన్ని అప్పగిస్తే ఎంతో రక్తపాతం తప్పుతుందని సలహా ఇచ్చారు. అప్పుడు గ్యానోబాపటేల్ కళ్ళెర్రచేసి ఇలా అన్నాడు. "అవసర మయితే తప్ప నా ఆశ్రయంలోవున్న దత్తగీర్‌ను అప్పగించే ప్రసక్తి లేదు".

ఈమాట వినగానే రజాకార్లు ఆవేశంతో అరిచారు. "ఇస్లామ్ జిందాబాద్, షాహె, ఉస్మాన్ జిందాబాద్" అని నినాదాలు చేస్తూ అలజడి లేవదీశారు. లోపలినుంచి "హర హర మహాదేవ్" అనేనినాదాలు వచ్చాయి. కాసేపటిలో కాల్పులు జరుగుతాయనుకొన్నారు. రజాకార్ల నుంచి మొదటి తుపాకి పేలాలని రామారావు పటేల్ అన్నాడు. ఆ తర్వాత మొత్తం గ్రామాన్ని ముస్లింలు లేకుండాచేద్దామని అనుకొన్నారు. ఈపట్టుదల చివరకు రజాకార్లు ఎవరూ ఏమీచేయవద్దని రాజీపడి తమతమ గ్రామాలకుతిరిగి వెళ్ళిపోయారు.

దత్తగీర్ ప్రమాదంలో వున్నాడని తెలిసి తొండచీర్‌నుండి కొందరు దళసభ్యులు సహాయార్థం వెళ్ళాలని ప్రయత్నించారు. ప్రతిఒక్కడు ప్రమాదంలోంచి తప్పించుకొనే ప్రయత్నం స్వయంగా చేసుకోవాలని కిషన్‌గీరుఅన్నారు. పైగా అక్కడి గ్యానోబా, రామారావు పటేల్ వుండగా ఏమి ప్రమాదం జరగదని, రజాకార్లు ప్రాణాలమీదకి వస్తేమాత్రం రాజీపడుతారని ఆయన హామీ ఇచ్చాడు.

ఆతర్వాత క్రమంగా రైతుదళంవల్ల హిందువులు ఉత్సాహంతో ధైర్యంతో తల ఎత్తుకొని తిరుగుతూ వచ్చారు. ఇదంతా చూసి రజాకార్లు నిజాంనుండి సహాయం అర్థించారు.

## కౌల్ ఖేడ్‌లో దహనకాండ

అప్పారావుపటేల్ రోహిలాలకు పఠాన్‌లకు స్నేహితుడైనప్పటికీ ఖత్‌గావ్‌లో ఇద్దరు రోహిలాలను ఖతం చేశాడనే అంశం ముస్లింలకు

విస్మయం కలిగించింది. ఏవిధంగానైన అప్పారావ్‌ను దండించాలని ముస్లిం రజాకార్లు ఒకరోజు ఉదయమే కౌల్‌షేడ్‌పై దాడి జరిపారు. అంతకు పూర్వమే అప్పారావ్‌కు ఈవిషయమై కబురు అందింది. అప్పారావుతో బాటు మరికొంతమంది గ్రామంలోంచి పారిపోయారు.

ఆ ఉదయం కౌల్‌షేడ్‌పై దాడి జరిగింది. పెద్దవాళ్ళు ఎవరు దొరక లేదని ఇద్దరు పిల్లలను బంధించి కాల్చివేశారు విశ్వనాథ్, మహాలింగప్ప అనే ఆ ఇద్దరు అబ్బాయిలలో మహాలింగప్ప మాత్రం తీవ్రంగా గాయపడి మిగిలాడు. ఆతర్వాత ఉద్‌గీర్‌కు చెందిన ఫజల్ మహ్మద్‌ఖాన్ నాయకత్వాన అప్పారావు ఇంటిపై దాడి జరిగింది. 70 ద్వారాలుగల ఆ మహా భవంతికి నిప్పు అంటించారు. లోపలవున్న ధాన్యం, 80 వేల రూపాయల నోట్లు కాలి భస్మీపటలమై పోయాయి. ఈ సంఘటన ఉద్‌గీర్ తదితర ప్రాంతాలలోని ముస్లిం రజాకార్లను మరింత ఉత్సాహవంతులను చేసింది.

అప్పారావ్ పటేల్ మాత్రం తొండచీర్ చేరుకొని ఆశ్రయం పొందాడు. అప్పుడే పోలీసు రిమాండునుంచి మానిక్‌రావ్ ముళే, చన్‌వీర్ తదితరులు విడుదలపొంది డోన్‌గావ్ తిరిగి చేరుకొన్నారు. కౌల్‌షేడ్‌లో అప్పారావ్‌కు జరిగిన నష్టం గురించి తెలిసింది. తాముకూడా దైతుదళంలో జేరి ప్రజలను సమీకరించాలని నిర్ణయించుకున్నారు. ఈలోగా అంతకు పూర్వమే మానిక్‌రావుమూలే అన్న రామచంద్రను రజాకార్లు దారికాచి గాయపర్చారు. ఒకచేయి విరిగింది, కాలు తీవ్రంగా గాయపడింది. ఆతర్వాత పోలీసులు అతనిని కమలానగర్ పోలీసు స్టేషనుకు తీసుకువెళ్ళార్లు. మానిక్‌రావునుకూడా చంపివేయాలనే కుట్రలు పన్నారు.

ఒకరోజు చన్‌వీర్ డోన్‌గావ్‌లోకి వెళ్ళేముందు వార్త అందింది గ్రామంలో రజాకార్లు వాళ్లపై దాడి చేయడానికి సిద్ధంగా వున్నారనే సంగతి తెలిసింది. అలాగే ఆయుధాలకోసం జామ్‌జల్‌కోట్ వెళ్ళిన మానిక్‌రావ్‌ను

దారికాచి చంపనున్నారనే విషయంకూడా తెలిసింది. చన్‌వీర్ వెంటనే వెనక్కు తిరిగి తొండచీర్ వెళ్ళాడు. అతన్ని దూరంనుంచి పోల్చుకోలేక తొండచీర్‌లో కాపలావున్న రైతుదళ సభ్యులు చన్‌వీర్ పై కాల్పులు జరిపారు. వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది. దళసభ్యులు చన్‌వీర్‌ను పోల్చుకొని ఆతర్వాత చాలా బాధపడ్డారు. రాబోయే ప్రమాదం గురించి జమ్‌జల్‌కోటలోవున్న మానిక్‌రావ్‌కు కబురు పంపించారు.

మరోవైపు గాయపడిన రామచంద్రను ఉద్‌గీర్ నుంచి తప్పించారు. ఉద్‌గీర్‌లో రజాకార్ల మధ్య రామచంద్ర ఆస్పత్రిలో ఉండటం క్షేమం కాదు. అందువల్ల ఆసుపత్రిలోని ఖాజా అనే కాంపౌడరుకు లంచమిచ్చి రామచంద్రకు పారిపోయే అవకాశం కల్పించారు. మానిక్‌రావ్, చన్‌వీర్‌లు రామచంద్రతో బాటు క్షేమంగా తొండచీర్ చేరుకున్నారు. తమ కుటుంబ సభ్యులను రహస్యంగా తరలించి షోలాపూర్ పంపించి వేశారు.

## గూఢచారి చర్యలకు శిక్ష

రైతు దళంలోకి మానిక్‌రావ్‌మూలే, చన్‌వీర్, హన్స్‌రాజ్ బల్‌వీర్ లాంటి సాహసవంతులైన యువకులు రావడం అందరికి మరింతఉత్సాహాన్ని కలిగించింది. మానిక్‌రావ్ తన దృఢమైనశరీరంతో మీసాలతో ఎత్తుగా గంభీరంగా నడుస్తూవుంటే ముఖ్యంగా తూటాల దండ ధరించి తుపాకితో వస్తుంటే ఎదుటపడే వ్యక్తి జంకేవాడు. చన్‌వీర్ కూడ విశిష్టమైన వ్యక్తి. హన్ను ఖాన్ ఉరఫ్ హన్స్‌రాజ్ మొండి పట్టుదలగల వ్యక్తి. వైదికమతం పుచ్చుకున్న ముస్లిం. ఇక బల్‌వీర్, అవసరమైతే హరాకిరి స్వయంగా కత్తితో తలనరుక్కొనే జపాన్ పద్ధతికూడా అలవాటు చేసుకొన్నమనోధైర్యం కలవాడు. ముఖ్యంగా మానిక్‌రావ్ ధైర్యం సమయస్ఫూర్తి ఎలాంటిదో ఈ క్రింది సంఘటన నిరూపిస్తుంది.

ఒకసారి బోట్‌కూల్ గఢ్‌లో రైతుదళం విశ్రాంతి తీసుకుంటూ వుంది. సూర్యోదయం అవుతుండగా అకస్మాత్తుగా సాయుధులైన నిజాం పోలీసులు ఆ గఢ్ చుట్టుముట్టారు. రజాకార్లతో పోరాడి అనేకసార్లు తిప్పి కొట్టిన సంఘటనలున్నాయి. కాని మొదటిసారిగా పోలీసులను ఈ విధంగా ఎదుర్కొనడం ప్రమాదంగా పరిణమించింది. ఉదయం ఎనిమిది అయిపోయింది. అలసివచ్చిన పోలీసులు కూచున్నచోటే ఆవలింతలు తీస్తున్నారు. ఆ గఢ్‌కి మూడువైపుల దారివుంది. వెనకాల మరో ఇల్లు వుంది. ఏవిధంగానైనా తప్పించుకొనే మార్గం కనుక్కోవాలి. మానిక్‌తో పాటు కొందరు దళ నాయకులు వెనకాలనుంచి ఆ ఇంట్లో చొరబడ్డారు.

అయింటి తలుపు తెరుచుకుంది. ఎదురుగా తుపాకీపట్టుకొని నిలుచున్న పఠాన్ పోలీసును మానిక్‌రావ్ గుర్తించాడు. తుపాకి వెనక్కి తిప్పు! పోలీసు జవాబు "ఎవరనుకున్నావు? నేను పఠాన్‌ను!"

"తెలుసు. నీ తుపాకిలో తూటాలు లేవు. నా తుపాకి లోడ్ చేసి సిద్ధంగా వుంచాను. క్షణాల్లో నీపని పూర్తి చేయగలను", అని మానిక్ హెచ్చరించాడు. నిజంగానే పఠాన్ దగ్గర తుపాకి లోడ్ చేసిలేదు. అతను భయపడిపోయి ఇలా అన్నాడు "మేం ఏమి చేయగలం, పొట్టకూటికోసం ఉద్యోగం చేస్తున్నాం".

"అందువల్లనే అంటున్నాను. తుపాకి తిప్పి పట్టుకోమని" అని మానిక్‌రావ్ పురమాయించగానే పఠాన్ తుపాకిని తిప్పిపట్టుకున్నాడు. ఈ లోగా మానిక్‌రావ్‌తో సహా కొందరు గఢ్ ఆవరణలోకి వెళ్ళి పొజిషన్ తీసుకొని రైఫిళ్ళు ఎక్కుపెట్టారు. మానిక్‌రావ్ గొంతెత్తి అరిచాడు. పోలీసుల నుద్దేసించి, "జాగ్రత్త! కదిలారంటే మా రైఫిళ్ళు పేలతాయి. అలాగే కూచోండి. మాదళం వెళ్ళిపోయే వరకు." అకస్మాత్తుగా వచ్చిన ఈ పరిణామానికి పోలీసులు ఏమీ చేయలేని స్థితిలో అలాగే కూచుండి

పోయారు. చంపివేయాలని మాత్రమే వచ్చే పోలీసులు దాడటానికి సిద్ధం కారు. అందువల్ల నే, అలానే కిమ్మనకుండా కూర్చుండిపోయారు. ఈలోగా గఢ్ తలుపు తెరువబడింది. కిసాన్‌దళ సభ్యులు అందరూ బయటకి వచ్చే శారు. మూకుమ్మడిగా అందరూ తప్పించుకుని వెళ్ళిపోతుండగా పోలీసులు వెనకాలే పరిగెత్తారు. ఎదురుకాల్పులు జరిగాయి. గాయపడి పోలీసులు తిరిగి వెళ్ళిపోయారు.

కొల్‌ఖేడ్‌కు చెందిన లక్ష్య అనేవ్యక్తి రజాకార్లకు గూఢచారిగా పని చేసేవాడు. అప్పారావు పటేల్‌కు సంబంధించిన సమాచారాన్ని, రోహిలాలకు, పఠాన్‌లకు అందచేసిన వ్యక్తి లక్ష్య. అతన్ని శిక్షించాలని దళం నిర్ణయించింది. ఒక అర్ధరాత్రి కొందరు దళసభ్యులు సాయుధంగా కొల్‌ఖేడ్ వెళ్ళారు. లక్ష్య ఇంటిపై దాడిచేసి పట్టుకెళ్ళిపోయారు.

ఆ రోజుల్లో హరిజనుల్లో కొందరిని పస్తక్వామ్ అనేపేర రజాకార్లు తమలో చేర్చుకొనేవాళ్ళని ఇంతకు పూర్వమే తెలుసుకున్నాం. ఆ పస్తక్వామ్‌లు హిందువులతో వుండే సంబంధాలవల్ల అనేక రహస్యాలు తెలుసుకొనేవారు. వాటిని రజాకార్లకు అందజేయడంలో సహాయపడేవారు. కాసిం రజ్వీ ఈవిధంగా హరిజనులను చేరదీసి ఉపయోగించుకుంటూ తాము సెక్యులర్‌గా వున్నామని ప్రచారం చేసేవాడు. అదే సందర్భంలో లక్ష్యను నిర్బంధించి తీసుకుపోవడం జరిగింది. విచారించి మరణశిక్ష విధించారు. లక్ష్యకు దళం ఆర్థికంగా శిక్ష విధించింది.

మరుసటిరోజు ఈవార్త ఉద్‌గీర్‌లోని పోలీసులకు రజాకార్లకు తెలిసిపోయింది. లక్ష్యను దళంవాళ్ళు పట్టుకెళ్ళి పోవడంవల్ల వాళ్ళ లంకె తెగిపోయింది. అందువల్ల ఉద్‌గీర్‌లోని డి. ఎస్. పి. ఫతేఅలీ పన్నెండు మంది పోలీసులతో తొండచీర్ వెళ్ళాడు. పోలీసులు వస్తున్నారనే సంగతి తెలిసి గఢ్‌లోని గంట మ్రోగింది. దళం వెంటనే కొండమీదకు వెళ్ళి తుపా

కులు గురిపెట్టి సిద్ధంగావుంది. తమలో ఒకరిని గొల్లవాడిగా పోలీసులవద్దకు పంపించారు. అతను లక్ష్య ఉద్‌గీర్‌వైపు వెళ్ళాడని ఫతేఅలీతో చెప్పగా పోలీసులు నమ్మి నిజంఅనుకొన్నారు. అయితే కొండపై పొజిషను తీసుకొని వున్న దళసభ్యులను చూసి డి. ఎస్. పి. బెదిరిపోయాడు. తాము కేవలం ఏదో ఎంక్వైరీకి (విచారణ) మాత్రమే వచ్చామని అన్నాడు. తాముకూడా ఆ ప్రాంతాలలో శాంతిభద్రతలను కాపాడుతున్నామని దళంవాళ్ళు జవాబు ఇచ్చారు. ఫతేఅలీ తన సిబ్బందితో ఏమీచేయలేక తిరిగివెళ్ళిపోయాడు

పరిస్థితి అదుపుతప్పిపోవడంతో ఉద్‌గీర్‌లోని పోలీసు అధికారులకు ఆందోళన కలిగించింది. తొండచీర్‌లోని దళం మొత్తాన్ని నిర్బంధించాలని అనుకొన్నారు. దానికోసం వందమంది పోలీసు మాలీపటేళ్ళను వెంటవుండ మని పురమాయించాడు. ఆ పటేళ్ళు సాధారణంగా అందరూ హిందువులే. ఈ ఏర్పాట్లతో తొండచీర్‌పై దాడిచేయడానికి పోలీసులు వెళ్ళారు. ఈలో గానే దళంకు సమాచారం అందింది. గఢ్ ఖాళీచేసి రహస్య స్థావరాలకు దళం వెళ్ళిపోయింది. పోలీసులు తొండచీర్ ప్రవేశించగానే కిషన్‌గేర్ పోలీసుపటేల్ఎదురుగా వెళ్ళి స్వాగతం చెప్పాడు. పోలీసుఅధికారులు కిషన్‌గేర్‌ దళం ఎక్కడుందని ప్రశ్నించారు. దళం ఎక్కడుందో తనకు తెలియదని అతను జవాబు ఇచ్చాడు. గ్రామంలోని ఇళ్ళు, గఢ్ అన్నీగాలించారు ఎవర్నూ దొరకలేదు. మందుగుండు సామాగ్రి, ఆయుధాలుకూడా ఎక్కడా కనపడ లేదు. కిషన్‌గేర్‌ను అతని తమ్ముళ్ళ గురించి ప్రశ్నించి చివరికి దళంవస్తే వెంటనే కబురు పంపించాలని హుకుం జారీచేసి వెళ్ళిపోయారు.

## అట్టర్గాలో విజయం

రామఘాట్ మహాసభనుంచి తిరిగివెళ్ళిన తరువాత యశ్వంతరావ్ అట్టర్గాలో రెండింతల ఉత్సాహంతో సమీకరణ ప్రారంభించాడు. రైతుదళ కేంద్రాలు ఒకటి కాదు రెండు వున్నాయని, తొండచీర్‌లో వున్నదళం అన్ని

విధాలా కలిసి వస్తుందని అతను సహచరులకు చెప్పాడు. రైతు దళాన్ని పెంచి, ఆయుధాలతో సమగ్రమైన శిక్షణ ఇచ్చి, నిజాం ప్రభుత్వంతో పోరాడాలని మిత్రులకు బోధించాడు. ఈ పోరాటం కొనసాగి హైద్రాబాద్ లోని రజాకారుల ప్రభుత్వాన్ని కూలదోసి కార్మికుల, రైతుల రాజ్యాన్ని తీసుకురావటానికి యువకులంతా నడుంకట్టి పోరాడాలని ప్రచారం చేశాడు. యువజనులలో మంచి ఉత్సాహం నెలకొంది.

కేసర్ జవల్‌గాంవ్ అనే గ్రామంపై దాదాపు వెయ్యిమంది రజాకార్లు దాడి చేయ బోతున్నారని ఒకరోజు కబురు అందింది. యశ్వంత్‌రావ్ దళం సాయుధంగా ఆ గ్రామం వైపు బయలుదేరింది. అయితే అసలు రజాకార్ల దాడి జరగలేదు. తిరిగి వస్తుండగా దారిలో పాండరి అనే గ్రామం వద్ద సాయ్‌గావ్ రజాకార్లు తటస్థపడ్డారు. వాళ్ళందరిని పట్టుకొన్నారు. ఆ రజాకార్లను శిక్షించిన పక్షంలో తమ గ్రామం తర్వాత మిగలదని వదిలేయ వలసిందని గ్రామస్తులంతా ప్రాధేయపడ్డారు. దళం ఆ రజాకార్లను వదిలివేయక తప్పలేదు. మంజీరానది ప్రాంతం చేరగానే కొంతమంది రజాకార్లు ఒక ముసలిస్త్రీని ఒక పిల్లవాణ్ని బాధ పెడుతున్నారు. అటునుంచి వచ్చే దళాన్ని చూసి పరిగెత్తడం ప్రారంభించారు. యశ్వంతరావ్ వెంట తరిమి ఖాదర్ అనే ఒక రజాకార్‌ను పట్టుకోగలిగాడు. అతనికి దళం మరణశిక్ష విధించి, అమలు జరిపింది.

కొంతకాలం గడచిన తర్వాత ఖాదర్ చావుకు ప్రతీకారం తీసుకోవాలని బాల్కి దేవణీలలోని పోలీసులు, రజాకార్లు బయిలుదేరారు. ఈ కబురు ముందే దళానికి తెలిసిపోయింది. అట్టర్గా గ్రామంలో దళం పోలీసుల, రజాకార్ల దాడిని ఎదుర్కోడానికి అన్ని ఏర్పాట్లు చేసుకుంది. పోలీసులు గ్రామంనుంచి రెండుమైళ్ళ దూరంలో ఉండగానే ఒక ఫస్తక్వామ్‌ను గూఢచారిగా పంపించారు. ఈ తోగా దళ గూఢచారి దళానికి పోలీసుల

విషయం చెప్పాడు. పస్తక్వామ్‌ను గ్రామంలో నిర్బంధించి పోలీసుల్నకు సంబంధించిన వివరాలన్నీ తెలుసుకో గలిగారు. పోలీసులు గ్రామం పొలిమేర్లలోకి వచ్చి దళంవాళ్ళను సవాలు చేశారు. దళం 'జై శివాజీ' అని నినాదాలు చేసింది. పోలీసులు కాల్పులు ప్రారంభించారు. దళం తనవద్ద నున్న చిన్న ఫిరంగిని పేల్చింది. పోలీసులకు దగ్గరగావున్న చెట్టు పెద్దంగి గుండు తగిలి కూలగానే పోలీసులు అదిరిపోయారు. ఈలోగా మరోసారి ఫిరంగి పేలింది. ఈ పేలుడు చూసి పోలీసులు కాలికి బుద్ధిచెప్పడం ప్రారంభించారు. అంతకుముందే రజాకార్లు పారిపోయారు. ఈ విధంగా మొదటి సారి దళానికి అట్టరాలో గొప్ప విజయం లభించింది. ఈ విజయం చుట్టు ప్రక్కల గ్రామాల్లో దళానికి మంచి గౌరవాన్ని సంపాదించి పెట్టింది.

ఒకరోజు కొంగలీ నుంచి కొందరు యువకులు యశ్వంత్‌రావ్ దగ్గరకు వచ్చారు. కొంగలీ ప్రాంతం రావలిసినదని ఆహ్వానించారు. యశ్వంత్‌రావ్ కొద్దిమందితో మండుటెండలో ఆ ప్రాంతానికి వెళ్ళాడు. కొంగలీ యువకులు స్వాగతం చెప్పి భోజనం ఏర్పాటు చేశారు. భోజనం మొదలు పెడుతుండగా ఒకవ్యక్తి గాబరాగా పరిగెత్తుకుంటూ వచ్చాడు. బోలేగావ్‌పై రజాకార్లు దాడి చేశారని దోపిడి చేస్తున్నారని వెంటనే బయిల్దేరి ఎదుర్కొంటే తప్ప లాభంలేదని అన్నాడు. తింటున్న భోజనాన్ని వదిలేసి యశ్వంత్‌రావ్ పదకొండు మంది సహచరులతో బోలేగావ్ బయిలుదేరారు. దారిలో మేకర్ గ్రామంవైపు వెడుతున్న రజాకార్ల గుంపు కనబడింది. యశ్వంత్‌రావ్ కాల్పులు సాగించాడు. అలా కాల్పులు సాగిస్తూ యశ్వంత్, బోలేగావ్ సమీపానికి చేరుకొన్నాడు. బోలేగావ్ యువకులు వీళ్ళకి మందుగుండు సామాగ్రి సరఫరా చేశారు. అటువైపు మేకర్ నుంచి వచ్చిన రజాకార్ల దళంతో బాటు వందకుపైగా రజాకార్లు వున్నారు. ఇటువైపు కొంతమంది సహాయంతో యశ్వంత్‌రావ్ కాల్పులు కొనసాగిస్తున్నాడు. స్వభావరీత్యా యశ్వంత్ ముందుకు దూసుకు పోయాడు. ఫలితంగా అతని

కాలులోంచి తుపాకి గుండు దూసుకు పోయింది. అయినా పట్టువదల కుండా గాయానికి కట్టుకట్టి కాల్పులు కొనసాగిస్తూనే వున్నాడు. గంటసేపు తర్వాత యశ్వంత్ రావ్ కాలులోంచి రక్తస్రావం జరగడం మూలాన స్పృహతప్పి పడిపోయాడు. ఈలోగా కబురు అంది ఆ సమయానికి వెంకటరావ్ మిరకల్ కురి కొంతమంది సహచరులతో ఆ ప్రదేశం చేరుకున్నాడు. ఇదే సంద ర్భంలో లోలేగావ్ యువకులు ఎనభై మంది సహాయంగా వచ్చి నిలు చున్నారు.

రజాకార్లు గాబరాపడి వెనక్కి తగ్గడం ప్రారంభించారు. దళం వాళ్ళ వెనకాల బయలు దేరింది. రజాకార్లు పరిగెత్తుతూ వెళ్ళి మేకర్ గ్రామంలోని గఢీలో తలదాచు కున్నారు. దళం గ్రామంలోకి ప్రవేశించగానే ఒక వయసు మళ్ళిన హిందూ స్త్రీ ఎదురుగా వెళ్ళి ఆనందంతో స్వాగతం చెప్పింది. ఈరోజు తనజాతి అన్యాయం చేస్తున్న వాళ్ళను తరిమి కొట్ట గలిగిందని గఢీ లో దాక్కున్న రజాకార్లను వదిలివేయ కూడదని కోరింది. అలాగే రజాకార్ల ఇళ్ళను దహనం చేసి పగ సాధించు కోవాలని అంటూ ఆమె కాగడా ముట్టించుకొని వచ్చింది. రజాకార్ల ఇళ్ళకు నిప్పు పెట్టారు. ఈ ఆనందంలో గంతులు వేస్తున్న దళ సభ్యుడికి గఢీలోంచి వచ్చిన తుపాకి గుండు తగిలింది. అతను చనిపోయాడు. రజాకార్లు లోపలి నుంచి చెదురు మదురుగా కాల్పులు సాగించినా బయిటికి మాత్రం రాలేక పోయారు. మధ్యాహ్నం 2-30 గంటల నుంచి సాయంత్రం 7 గంటల వరకు అలా ఘర్షణ జరుగుతూ వుంది. చివరికి దళం విజయోత్సాహంతో తిరిగి వెళ్ళి పోయింది.

## యశ్వంత్‌రావు అజ్ఞాత వాసం

మేకర్ దహనకాండ జరిగిన తర్వాత పోలీసులు విచారణకై మేకర్ వెళ్ళారు. ఆపని చేసిందంతా అట్టర్గా నుంచి వచ్చిన దళమని



డాక్టర్ చన్నప్ప

తెలుసు కొన్నారు. అట్టగా వచ్చి గఢ్‌లోంచి దళాన్ని బయిటికి వచ్చి మాట్లాడ మన్నారు. దళంవాళ్ళు పోలీసు లను విశ్వసించలేదు. ఫలి తంగా కాల్పులు జరిగాయి. ఎవరికీ ఏమినష్టం జరగలేదు. కాని పోలీసులు గ్రామంలోంచి తొమ్మిది మంది నిర్దోషులైన రైతులను నిర్బంధించి తీసు కొని వెళ్ళిపోయారు. నాలుగు రోజులపాటు ఆ రైతులకు అన్నం పెట్టకుండా హింసిం చారు. అయినా ఎలాంటి రహ స్యాలు చిక్కలేదు. చివరికి ఆ రైతులను 'నిలంగే' జైలులో ఖైదు చేశారు.

ఈలోగా నలువైపులా ఒక వార్త వ్యాపించి పోయింది. బోలేగావ్ పోరాటంలో యశ్వంత్‌రావ్ మరణించాడని. అతను గాయపడగా దళంవాళ్ళు సురక్షిత ప్రదేశానికి తీసుకెళ్ళి పోయారు. అయితే మరణించాడనే వార్తను దళం వాళ్ళు కావాలని మరింత ప్రచారం చేశారు. గాయపడిన యశ్వంత్‌రావ్ మరో గ్రామంలో డాక్టర్ చన్నప్ప దగ్గర చికిత్స పొందాడు. లింగాయత్ శాఖకు చెందిన వాడిగా లింగం ధరించి డాక్టరు బంధువుగా అక్కడే యాభై రోజులపాటు వుండి పోయాడు. ఆ తర్వాత ఆయుధం పట్టడం సాధ్యమైంది.

యశ్వంత్‌రావ్ మరణించాడనే వదంతి వ్యాపించడం అతని చికి త్సకు బాగా తోడ్పడింది. కాని చుట్టుప్రక్కల గ్రామాల్లో మాత్రం నష్టం జరిగింది. రజాకార్లు, పోలీసుల సహాయంతో కసిగా గ్రామాలపై పడ్డారు. మేకర్‌లోనే హిందువుల ఇళ్ళు తగుల బెట్టారు. ఇష్టానుసారం లూటీలు, మానభంగాలు జరిపారు. సాయ్‌గావ్, నారదా వంగమ్, బోలేగావ్, గుంజరా, అట్టర్గా తదితర గ్రామాల్లో అల్ల కల్లోలం జరిగింది. ముఖ్యంగా అట్టర్గా దళం చెదిరి పోయింది.

ఇటు తొండచీర్ కేంద్రంగా వున్న రైతుదళం బాగా బలపడింది. అనేకమంది యువకులు వచ్చి దళంలో చేరారు. కన్నయ్య మదనూర్‌లో పడివున్న అయుధాలను తీసుకు రావాలని సూచించాడు. కన్నయ్య దళంలో ఒక విలక్షణమైన వ్యక్తి. బక్కపలచగా వుండి గట్టిగా గాలివీస్తే పడిపోయే మనిషి. అయినా ఎంతో చురుకుగా, ధైర్యంగా దూసుకుపోయి పనిచేసే వాడు. దళం ఆ సూచనను అంగీకరించింది. కొన్ని గుర్రాలను, ఒంటెలను తీసుకొని దళ నాయకులు మదనూర్ వెళ్ళారు. దత్తగిర్, చన్‌వీర్‌లు మామూలుగా తలలపై సంచులు వేసుకొని మరమరాలు అమ్ముకొంటూ అమాయకుల్లా గ్రామంలో అడుగు బెట్టారు. బజార్లు తిరుగుతూ ఒక బట్టల దుకాణంలోకి బట్టలు కొనే నెపంతో వెళ్ళారు. ఆకొట్టు ఇదివరకు కన్నయ్యదే. అది ఇప్పుడు భూమన్నది. భూమన్న ఇదివరకు కన్నయ్యకు గుమాస్తా. ఇతడు ఆర్యసమాజ్‌లో ఒకమంచి కార్యకర్త. కన్నయ్య ఉద్‌గీర్‌కు వెళ్ళిన తరువాత ఆర్యసమాజ్ కార్యాలన్నీ ఇతనే స్వీకరించాడు. ఇప్పుడతను ఆర్యసమాజ్‌కు కార్యదర్శి కూడా. వీలు చూసుకున్ని కొత్తగా వచ్చిన వాళ్ళతో తన ఉద్దేశం చెప్పారు. దత్తగిర్, చన్‌వీర్‌లు బట్టలు కొనుక్కొని వెళ్ళి పోయారు. అర్ధరాత్రి 2 గంటలప్పుడు కన్నయ్య ఇంటివెనుక దారినుండి ఆయుధాలు తీసుకెళ్ళారు. దారిలో

నిజాసిరాజ్ కార్ఖానాలో చేసిన 15 తుపాకులు, 70, 75 బల్లాలు, ఒకచిన్న ఫిరంగి, మరియు సామాగ్రి కూడా వున్నాయి. వీటన్నింటిని గుఱ్ఱాలపై ఎద్దులపై వేసుకొని తొండచీర్ చేరారు. తొండచీర్ మదనూర్ కు 40 మైళ్ళ దూరం. ఇదంతా రాత్రేజరిగింది. యశ్వంత్ రావ్ పోయాడనే విషాద వార్తవిని వ్యధిత హృదయాలతో అందరూ అట్టగ్గా చేరారు. వాళ్ళంతా యశ్వంతరావ్ ను చంపినందుకు ప్రతీకారం తీర్చుకోవాలని నిర్ణయించు కున్నారు. నివృతిరావు కొద్దిరోజులు ఆగమని వెనక్కి తీశాడు. యశ్వంతరావ్ చికిత్స పొందుతున్నాడు ఆరోగ్యం సరికాగానే చేయవలసిన పనిచేసి చూపిద్దాం. 50 రోజుల తరువాత ఆరోగ్యం చేకూరిన యశ్వంతరావు అట్టగ్గా చేరుకున్నారు. పాత మిత్రులందరూ ఆనందంతో ఒకరి నొకర్ను గాఢాలింగనం చేసుకున్నారు. అసలు యశ్వంతరావ్ చని పోయాడనే భావించా రందరూ. అట్టి సేనాపతి సజీవంగా వున్నాడనే వార్త వాళ్ళకు అవధు లేని ఆనందం కలిగించింది. ఆయన నేతృత్వంలో ఆయుధాల్లు ధరించేందుకోసం ఎంతో ఆతృతతోవున్నారు. స్థానిక ప్రజలపై జరిగిన అత్యాచారాలకు బదులు తీర్చుకోవాలని వారి దృఢవాంఛ. అందుకై వారు యశ్వంత్ రావ్ ఆజ్ఞకోసం ఆగివున్నారు.

**దాడితో ఉద్దండులు**

ఒక్కరోజు [illegible] అర [illegible] రైతుదళాల భావి కార్యక్రమం గురించి చర్చలు జరిగాయి. అప్పటికే పోలీసులవద్ద, రజాకార్లవద్ద ఆధునికమైన ఆయుధాలు వున్నాయి. వాళ్ళను భరమార్లతో ఎదుర్కోవడం రోజురోజుకి కష్టతరమై పోయింది. అందువల్ల షోలాపూర్ వెళ్ళి ఆధునికమైన ఆయుధాలు సంపాదించాలని దళం బయలుదేరింది. రాత్రిపూట ప్రయాణంచేస్తూ పగలంతా గ్రామాలప్రక్కనున్న అడవులలో విశ్రాంతి తీసుకుంటూ వెళ్ళేవారు. పోలీసుల, రజాకార్ల కాపలానుండి తప్పించుకొని వెళ్ళాల్సి...

ప్రయాణంలో దళం మొదటిసారిగా 'శేలగీ' అనే గ్రామందగ్గర విడిది చేసింది. 'శేలగీ' గ్రామాధికారిణి త్రివేణిబాయి దళానికి విందుచేసింది. దళంవాళ్ళు ఆకలితో వున్నారు. మొదటిముద్ద నోట్లోకి వెళ్ళిందో లేదో ప్రమాదకరమైన వార్త వచ్చివాలింది.

'సహాజనీ' అనే ప్రాంతంనుంచి యాభై మంది పోలీసులు దళాన్ని పట్టుకోటానికి వస్తున్నారని దళం ఆచూకి తెలియజేసింది. వాళ్ళంతా హిందువులే అనే సంగతికూడా తెలిసింది. భోజనం వదలి దళం వెంటనే గ్రామం బయటికి చేరింది. అనుకూలమైనచోట మాటుకాచి కూచున్నారు. పోలీసులు కాల్పులు ప్రారంభించారు. పోలీసు రైఫిళ్ళు దళంవాళ్ళ థర్డ్‌మార్క్ తుపాకుల కాల్పులు మూడు గంటలపాటు కొనసాగాయి. చివరకు ఒక్క పోలీసు చేయి గాయపడింది. ఇదిచూచి కొంధరు పోలీసులు పరుగెత్తడం ప్రారంభించారు. అప్పుడు దళం వెంటనే తరిమి కొట్టింది. తిరిగి వస్తుండగా దారిలో ఒక రజాకార్ దొరికాడు. అతనిదగ్గర తుపాకి మందుగుండుసామగ్రి లాక్కొని కొట్టిపంపించారు. దళంచేసిన సాహసకార్యాన్ని శేలగీ గ్రామస్థులు అభినందించారు. ఆతర్వాత దళం సభ్యులు భోజనంచేశారు.

ఆరోజు సాయంత్రం దళంవారు విశ్రాంతి తీసుకొంటూ ఉన్నారు. అకస్మాత్తుగా చుట్టుపక్కలనుంచి తుపాకి ప్రేలింది. ఆరోజే తిరిగి మరో దాడి జరుగుతుందని దళం ఊహించలేదు. అంతకుపూర్వం పోలీసులకు సహాయానికి వచ్చినవాళ్ళు నలుగురు హిందువులే మళ్ళీ పోలీసులను, రజాకార్లను తీసుకువచ్చారు. వాళ్ళు గ్రామరక్షకులమని నిరూపించుకున్నారు. ముఖ్యంగా భీమ్‌రావ్ అన్నేవ్యక్తి మాణిక్‌రావ్‌మూలేతో ఇంతకు పూర్వమే వున్న భూమితగాదాలవల్ల రజాకార్లను తీసుకువచ్చారు. అయితే భీమ్‌రావ్ ఆటలు సాగలేదు. ఆధునిక ఆయుధాలున్న పోలీసులు రజాకార్లు కళ్యాణీ, మాల్టేగావ్ ప్రాంతాలనుంచి వచ్చి దాడిచేశారు. దళం చెక్కుచెదరని ధైర్యంతో శత్రువుదగ్గిరవున్న

ఉపాయాలతోనే ప్రతిఘటించారు. ఆమసకచీకటిలోనే యశ్వంత్ రావ్ గురిచూసి కాల్చి ఒక పోలీసును పరలోకం పంపించాడు. ఇదిచూసిపోలీసులు రజాకార్లు ప్రాణభయంతో పారిపోయారు. ఆనాటివరకు పోలీసుల, రజాకార్ల చేతుల్లో అవమానాలు పొందుతూవచ్చారు-హిందువులు. దళం చూపిన ప్రతిఘటన వాళ్ళలో ఆత్మవిశ్వాసాన్ని ఎన్నోరెట్లు పెంచింది. అటువైపు నిజాంబంటులకు దళంపేరు వినగానే ముచ్చెమటలుపోసేవి.

ఆ తర్వాత శేలగీ గ్రామప్రజలు దళాన్ని కొన్ని రోజులు అక్కడే వుండమని కోరారు. ఈలోగా గ్రామంపై రజాకార్లు తిరిగి దాడి చేయవచ్చు ననే అనుమానం కలిగింది. అందువల్ల రైతుదళం గ్రామం ప్రక్కనే వున్న అడవిలో ఆరు రోజుల పాటు విడిది చేసింది. చివరికి తమ షోలాపూర్ ప్రయాణం కొనసాగించాలని గ్రామ ప్రజల నుండి సెలవు తీసుకొని బయలు దేరింది. గ్రామాధి కారిణి త్రివేణిబాయి స్వయంగా దళానికి ఏడువేల వెండి నాణాలు విరాళంగా ఇచ్చింది. ఆ సమయంలో దళం కోసం ఆయుధాలు కొనే నిమిత్తం ఆడబ్బు సద్వినియోగ మవుతుందని ఆవిడ విశ్వాసం వెలి బుచ్చింది. శేలగీ నుంచి మరుసటిరోజు ఉదయం జవల్‌గావ్ చేరు కొన్నారు. మటీజా వెళ్ళిన తర్వాత సరిహద్దువైపు వెళ్ళే దారి తెలియలేదు. ఆ భయపూరితమైన రోజుల్లో ఎవరూకూడ ముందుకు వచ్చి దారి చూపించ డానికి సిద్ధపడలేదు. అందువల్ల దళం తెగించి ముందుకు వెళ్ళి పోయింది. కాసారశిరసి చేరుకున్నారు. ఆకలి అందరిని విపరీతంగా దహించి వేస్తోంది. నడవడం సాధ్యం కాలేదు. ఆ బస్తీలోనే బిచ్చం ఎత్తుగొని ఆకలి తీర్చుకోవాలని నిర్ణయించుకున్నారు. పటేల్ మానిక్‌రావ్ ఇంటికి వెళ్ళి చేయి చాచారు. అతను వీళ్ళను ఇంటిలోకి రమ్మని వివరాలు అడిగాడు. ఆ పటేల్ అత్తగారి ఊరునుంచి తాము వచ్చామని సమాధానం చెప్పారు. పటేల్ కొంచెం బెదిరి పోయి ఇలా అన్నాడు. "మీరంతా

దోపిడీ దొంగలు. వెంటనే ఇంట్లోనుంచి వెళ్ళిపోండి, లేకపోతే పోలీసుల్ని, రజాకార్లని పిలిపించ వలసి వుంటుంది. మీరు మా ఇంటికి వచ్చారని తెలిస్తే రజాకార్లు నన్ను బతక నివ్వరు. నా ఉద్యోగం ఊడి పోతుంది. నా వ్యాపారం నాశన మవుతుంది. వెంటనే వెళ్ళిపోండి".

గత్యంతరం లేక దళమంతా ఎలాగో హందరాల్ గ్రామం చేరుకుంది. అక్కడ అప్పారావు పటేల్ బంధువైన ఒకరైతు భోజన వసతి ఏర్పాట్లు చేశాడు తర్వాత ముందుకు వెళ్ళే మార్గం చూపించ మంటే ఎవరూ సిద్ధ పడలేదు.

ఒకరోజు హందరాల్ నుంచి రజాకార్ల దళం గుంజేటి అనే గ్రామం చేరుకుంది. తామంతా బాల్కీ నుంచి వస్తున్నామని షోలాపూర్ సరిహద్దుపై దాడి చేయమని కార్యదర్శి ఆదేశించారని, వెంటనే బయిలుదేరి రమ్మనమని చెప్పారు. గుంజేటి రజాకార్లు నిజమేనని నమ్మి పెద్ద దళంతో హిస్సర్గా చేరుకొన్నారు. ఆ ప్రాంతం ఇండియన్ యూనియన్ అంతర్భాగం. అందువల్ల గుంజేటి రజాకార్లు పై దళానికి అక్కడే వీడ్కోలు చెప్పి ముందుకు పంపించారు. ఇంతకు ఈ రజాకార్ల దళమనే పేరుతో షోలాపూర్‌లో ప్రవేశించిన దళం అసలు హందరాల్‌లో చిక్కుబడి పోయిన రైతు దళమే. షోలాపూర్‌లో బొంబాయి పోలీసులు మొదట వాళ్ళను రజాకార్లని నమ్మి అరెస్టు చేసి రెండు రోజులు లాకప్‌లో వుంచారు. ఆ తర్వాత వాస్తవం తెలుసుకొని వదిలి వేశారు.

## హందరాల్‌లో ఘర్షణ

ఎనిమిదిరోజులపాటు వున్న తర్వాత దళం తిరిగివెనక్కి బయలు దేరింది. అక్కడే స్టేట్ కాంగ్రెస్, దళానికి సహాయపడింది. ఒకస్టెన్‌గన్, బెన్‌గన్, ఒక 303, ఒకబారంబారీ, రెండుపిస్తోళ్ళు, ఐదువందల తైనమేట్లు

నాలుగువందల బుల్లెట్లు చేతిబాంబులు మొదలైనవి తీసుకొని వచ్చారు. రాత్రిపూట ప్రయాణంచేస్తూ తిరిగి హందిరాల్‌లోని ఆరైతు ఇంటికి చేరుకున్నారు. మరుసటిరోజు ఉదయం భోజనం చేసేవేళ ఆరైతుఇంటికే ఊచికపస్తక్వామ్(హరిజనరజాకార్) వచ్చాడు. అతనికి ఎలాగోదళంవిషయం తెలిసిపోయింది. అదేసమయానికి ఊళ్ళోకి రెండువందలమంది రజాకార్లు చందావసూలు చేసేనిమిత్తంవచ్చారు. దళం విడిదిచేసిన రైతుఇంటివెనకాలే చావడి. అక్కడే రజాకార్లు గుమిగూడారు. కూలినగోడపైనుంచి వాళ్ళు కనబడుతూనే వున్నారు. అకస్మాత్తుగా రజాకార్లు చెదిరిపోయి రైతుఇంటిని చుట్టుముట్టివేశారు. బయటికిరాకపోతే కాల్పులు జరుపుతామని బెదిరించారు. ఊహించని పరిస్థితి ఏర్పడింది. దళసభ్యులు మొత్తం పదకొండు మంది మాత్రమే ఉన్నారు. అయినా ఏమాత్రంబెదిరిపోకుండా తలుపు సందులోంచి 303 రైఫిలుగురిచూసి పేల్చడం ప్రారంభించారు. యశ్వంతరావు పేల్చిన గుండు రజాకార్లనాయకుడి తలకు తగిలింది. నాయకుడు పడిపోగానే రజాకార్లు పారిపోవడం ప్రారంభించారు. దళం వాళ్ళనుతరుముకూవెళ్ళింది. ఫలితంగా మొత్తం ఆరుగురు రజాకార్లు చనిపోయారు. వాళ్ళతుపాకులన్నీ చేతికి చిక్కాయి. పారిపోయిన రజాకార్లు సవాసరిన ముగవీకురూరి లో వున్న నిజాం సైనికుల క్యాంపుచేరుకున్నారు. ఆసైనికులను వెంటబెట్టుకొని తిరిగి హందరాల్‌పై దాడిచేశారు. కాని ఈలోగానేరైతుదళం రెండుమైళ్ళు దాటి కొండమీదికి వెళ్ళడం చూశారు. దళం ఆతర్వాత పరుగుతీస్తూ పదకొండు మైళ్ళు ప్రయాణంచేసింది. అట్టర్గా వెళ్ళి మూడురోజులపాటు విశ్రాంతితీసుకొని తొండచీర్ వెళ్ళారు. రామఘాట్ స్థావరంలో కొంతకాలం గడిపి తిరిగి అట్టర్గా చేరుకున్నారు. మానిక్‌రావ్‌మూలే, తుకారాం పటేల్, వెంకటరావ్ మిరక్కల్, డాక్టర్ చెన్నప్ప, యశ్వంతరావ్, అప్పారావ్, దత్తగిర్ తదితరులు ఈ దళంలో ముఖ్యులు.

కొంతకాలం గడిచింది. నిజాం పోలీసులకు అట్టగ్రాలో తిరిగి రైతు దళం స్థిరపడిందని తెలిసింది. చుట్టుప్రక్కల గ్రామాల్లోవున్న పోలీసులను రప్పించి దాడికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ వివరాలన్నీ దళానికి తెలిసి పోయాయి. అట్టగ్గానుండి ఆరుమైళ్ళ దూరంలో వున్న బోట్కుల్గఢ్కు చేరుకుంది దళం. ఈలోగా రజాకార్లు పోలీసులు సమీకరించబడ్డారు. మరో వైపు బోట్కూల్లో వున్న రంగారావు పటేల్ ఆర్యసమాజ్ కార్యకర్త. అతను తనగఢ్లో 150 మంది దళసభ్యులకు సాదరంగా ఆశ్రయమిచ్చాడు తామంతా కలిసి పోరాడవలసిందే అని హామీ ఇచ్చాడు.

## బోట్కూల్లో ఘర్షణ

మరుసటిరోజు పోలీసులు, రజాకార్లతో పాటు గఢ్పై దాడి చేయా లని బోట్కూల్ పొలిమేరల్లోకి వచ్చారు. సర్కిల్ ఇన్స్పెక్టర్ తెలివిగా వల పన్నాలని మొదట ప్రయత్నించాడు. తానే ముందుకువచ్చి దళంవాళ్ళను సంప్రదింపులకు రమ్మనమని అన్నాడు. దళం తిరస్కరించింది. తర్వాత షామ్గీర్కు చెందిన హిందూపటేల్ ద్వారా గఢ్లోనికి వర్తమానం పంపిం చాడు. దళం ఆ పటేల్తోనే జవాబు పంపింది. దమ్ములుంటే కాల్పులు జరపమని సవాలుచేసింది. అయితే ఆ పటేల్ గూఢచారిలా పంపించబడ్డాడు. దళం దగ్గర భర్మార్ తుపాకులు తప్ప మరేమీలేవని అందరు కుర్ర వాళ్ళు మాత్రమే అని సులభంగా దాడిచేసి పట్టుకోవచ్చని పటేల్ చెప్పాడు.

బోట్కూల్ గఢ్పై దాడిచేసే నిమిత్తం ఆరువందలమంది పోలీ సులు, రజాకార్లు అన్ని ఏర్పాట్లతో వచ్చారు. మధ్యాహ్నం రెండుగంటలకు కాల్పులు ప్రారంభమైనాయి. దళసభ్యులు గఢ్లోంచి కిందకిదిగి ఎదురు కాల్పులు జరుపుతూ ముందుకు వెళ్ళారు. అటు పోలీసులుకూడా స్థిరంగా నిలబడి కాల్పులు జరుపుతున్నారు. తొమ్మిది గంటలవరకు తీవ్రంగా

కాల్పులు జరుగుతూనే వున్నాయి. దళసభ్యుల ముఖాలు మందుగుండు పొగతో నల్లబడిపోయాయి. చెక్కుచెదరని ధైర్యంతో సభ్యులు ఎదుర్కొం టున్నారు. హఠాత్తుగా గఢీపైనుంచి ఫిరంగి పేలింది.

గఢీ వెనకాలనుంచి చాటుగా వెళ్ళిన కొందరు దళసైనికులు చుట్టూ వెళ్ళి పోలీసుల, రజాకార్ల వెనకాలనుంచి కాల్పులు సాగించారు. ఫిరంగి గుండు పోలీసు అధికారికి తగిలింది. మరికొంతమంది పోలీసులు తీవ్రంగా గాయపడ్డారు. శత్రువర్గంలో సంచలనం బయలుదేరింది. వెనక్కి పారిపోవ డం ప్రారంభించారు. రైతుదళం అదేఅదనుగా వాళ్ళని తరిమింది. అనేక మంది రజాకార్లు, పోలీసు అధికార్లు చంపబడ్డారు దళం గురించి కబురు అందచేసిన హోసూల్ పటేల్ కొడుకును పట్టుకొని కాల్చివేశారు. హన్స్ రాజ్ ఆ శవాన్ని మోసుకెళ్ళి మంజీరానదిలో పడవేసివచ్చాడు. గుర్రాలు, ఆయుధాలు దొరికాయి.

మరుసటిరోజు నిజాంసైనికులు భారీఎత్తున లారీలలో బయలు దేరారు. బోట్కూల్పై దాడిచేసి దళాన్ని ఏవిధంగానైనా పట్టుకోవాలని ప్రయత్నం. ఉప్పొంగి ప్రవహిస్తున్న మంజీరానదిని లారీలు దాటలేక పోయాయి. లాతూర్ నుంచి చుట్టూతిరిగి నిజాం పోలీసుల లారీలు అర్ధరాత్రి బోట్కూల్ చుట్టుముట్టాయి. కాని ఆశ్చర్యం. ఆ గఢీలో ఒక్క రైతుదళ సభ్యుడు కూడా దొరకలేదు. గఢీ తలుపులు బార్లా తెరుచుకొనివున్నాయి. అసలు దళానికి అంతకుపూర్వమే తమ గూఢచారులవల్ల లారీల విషయం తెలిసింది. అనేకరెట్లు సంఖ్యలో ఆయుధాలతో మించివున్న నిజాంసైనికుల బలాలను సరాసరిన ఎదుర్కోడం కష్టమని ఆరాత్రి మంజీరానదిని ఈది దళం అట్టగ్గా చేరుకుంది.

## హఠాత్తుగా చావునోట్లోకి...

అట్టగ్గాలో ఐదారురోజులు విశ్రాంతి పొందిన తర్వాత తొండచీర్ దళం తిరిగి వెళ్ళిపోయింది. యశ్వంతరావ్, డాక్టర్ చెన్నప్ప వెంకట్రావ్

ఒకరోజు అట్టర్గాలో కృపాల్‌గీర్ యింట్లో పాలు తాగుతున్నారు. ఉదయం పూట జల్లుపడుతూవుంది. అకస్మాత్తుగా ఒక స్త్రీ పరిగెత్తుకుంటూ వచ్చింది. గ్రామంలోకి పోలీసులు ప్రవేశించారనే వార్త. పైముగ్గురు వెంటనే లేచి గుమ్మంలోకి వచ్చారు. గుమ్మం దాటుతుండగా అతనిగుండెకు తుపాకీ గురి చూసి పెట్టబడింది. వెనకాలవున్న డాక్టర్ చెన్నప్ప మెల్లిగా తప్పించుకొని ఇంటిపైకి ఎక్కిపారిపోయి దళంలో కలిసిపోయాడు. వెంకట్రావ్ నిరాయుధుడుగా ఏమీ తెలియనట్టు ముందుకు వెళ్ళిపోయాడు. ఎదురుగా తుపాకులతో ఆరుగురు పోలీసులు ఒక డి. వై. యస్. పి., ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్ వున్నారు. యశ్వంతరావు దగ్గరవున్న ట్వెల్‌బోర్ తుపాకిని ఇచ్చివేయమన్నారు. అతను నిరాకరించాడు. అధికారి పిస్తోలుఎత్తి హుకుం జారీ చేశాడు. యశ్వంత్‌రావ్ దగ్గరవున్న తుపాకిని లాక్కోవడం జరిగింది. అప్పుడు పోలీసు అధికారి ప్రశ్నించడం ప్రారంభించాడు. "నీపేరు ఏమిటి? "లక్ష్మణ్". "ఈ ట్వెల్‌బోర్ ఎవరిది?" "నాదికాదు, తెలిసినవాళ్ల ది". "నీవగ్గర ఎందుకుంది?" "ఆత్మరక్షణ కోసం". "అయితే ఈ తుపాకి ఇంతకీ ఎవరిది?" "ఇది తుల్జారామ్ నార్మా అనే రైతుది. అతనిదగ్గర లైసెన్సు వగైరా వుంది".

యశ్వంత్‌రావ్ తనపేరు చెప్పకుండా జాగ్రత్తగా వ్యవహరించాడు. ఇద్దరు పోలీసులను తుల్జారాం ఇంటికి పంపించారు. అధికారి యశ్వంత్‌రావ్ తదితరులు ఎక్కడున్నారని ప్రశ్నించాడు. వాళ్ళంతా దగ్గరలోనేవున్న ఇంటిలో వున్నారని యశ్వంత్‌రావ్ సమాధానమిచ్చాడు.

అసలు పోలీసులు ఇలా అకస్మాత్తుగా చుట్టివేయడానికి కారణం వుంది. తొండచీర్ దళం వెళ్ళిపోయిన తర్వాత రామా అనే పస్త్రక్వామ్ రహస్యంగా వెళ్ళి పోలీసులకు కబురుచేశాడు. డి. వై. యస్. పి. సాయుధ పోలీసులను తీసుకొని గ్రామాన్ని ఆ వుదయం చుట్టివేయగలిగాడు.

తాము పట్టుకున్న వ్యక్తి యశ్వంత్‌రావ్ అనే విషయం పోలీసులకు తెలియదు. అతన్ని పట్టుకొని గ్రామంలోంచి నడిపి వెడుతున్నారు. వానజల్లు, నేలంతా బురదమయం. ఇరుకైన సందులోంచి నడిచివెడుతున్నారు. పోలీసులు బూట్లతో జాగ్రత్తగా బ్యాలన్స్ కాపాడుకుంటు రాళ్ళపై కాళ్ళు ఆనించి నడుస్తున్నారు. యశ్వంత్‌రావ్ అదేఅదనుగా పోలీసుల పట్టు విడిపించుకొని ఆ సందులోంచి పరుగులంకించుకున్నాడు. బరువైన బూట్లతో పోలీసులు పరుగెత్తలేక పోయారు. "జాగ్రత్త, ఆగిపో, కాల్చివేస్తాం" అని అరిచారు. అయినా దళంవాళ్ళు కాల్పులువిని ఎక్కడ ఎదురుదాడిజరుపుతారో అనే భయంకూడా వుంది. మరోవైపు దళంవాళ్ళు ప్రాణాలకు తెగించి పోలీసులపై దాడి చేయాలని యశ్వంత్‌రావ్‌ను ఏ విధంగానైనా విడిపించుకోవాలని దృఢనిశ్చయంతో వున్నారు.

యశ్వంత్‌రావ్ పారిపోతూ ఒక మలుపుతిరిగి పక్కనేవున్న నీటి మడుగులో దాక్కున్నాడు. పోలీసులు విజిల్‌వేస్తూ పక్కనుంచి వెళ్ళిపోయారు. యశ్వంత్‌రావ్ అక్కడేవున్న ఒకస్త్రీ సహాయంతో ఒకఇంట్లోకి వెళ్లి దుస్తులను మార్చుకొని వెనకదారినుంచి తప్పించుకొని దళంవాళ్ళను కలుసుకోవాలని బయలుదేరాడు.

పోలీసులు ఊరంతా గాలిస్తున్నారు. దారిలో గొల్లవాడు ఒకడు తన ధ్యాసలో తానువెడుతున్నాడు. పోలీసులు అతన్ని ఆపి ఏదో అడిగినా అతను తనదారిన తానే వెళ్ళిపోతున్నాడు. ఆ గొల్లవాడు ఒక ఇంటిముందుకు వెళ్ళి సంకేతంగా ఈలవేశాడు. పరిచితమైన ఆ ఈలవిని ఆ ఇంటిలోవున్న దళం జైజై నినాదాలుచేసుకుంటూ బయటికి వచ్చి కాల్పులు ప్రారంభించింది.

## డి. వై. యస్. పి. హత్య

గొల్లవాడి వేషంలోవున్న యశ్వంత్‌రావ్, దళంవాళ్ళతో పోలీసులపై విరుచుకుపడ్డాడు. ఒక పోలీసు క్రిందపడిపోయాడు. అతని తుపాకి

లాక్కొని యశ్వంత్‌రావ్ డి. వై. యస్. పి. కోసం చూశాడు. ఆ పోలీసు అధికారి గుర్రంపై అప్పటికే గ్రామం బయటికి వెళ్ళిపోయాడు. మేకర్ స్థావరానికి వెళ్ళిపోవాలని అతని ప్రయత్నం. అయితే మంజీరానది ఉప్పొంగి ప్రవహిస్తున్నది. దాటడం సాధ్యంకాలేదు. ఆ అధికారి మరోదారి గుండా వెళ్లాలని బయలుదేరాడు. అటుప్రక్క పెద్దకాలువ నిండుగా పారుతోంది. అధికారి కాల్వలోకి గుర్రాన్నితోలాడు. అది బురదలో కూరుకుపోయింది. బురదమయమై ఎలాగో బయటికి రాగలిగాడు. ఈలోగా యశ్వంత్‌రావ్, వెంకట్రావ్ ఆ అధికారిని పట్టుకోగలిగారు. అతనుపారిపోతుండగాయశ్వంత్‌రావ్ తుపాకితో అతనికాళ్ళకు గురిచూసి కొట్టాడు. డి. వై. యస్. పి.గాయపడి క్రింద పడిపోయాడు. అతనిదగ్గర వున్న తుపాకి, పిస్తోలు, గడియారం లాక్కున్నారు. ప్రశ్నలద్వారా సమాచారాన్ని రాబట్టారు. డి వై.యస్ పి. చెప్పిన వివరాలు ఇవి. "మీదళ చర్యలు నిజాంపోలీసులకు సవాలుగా పరిణమించాయి. మిమ్మల్ని బహుమతికోసం కాకుండా వ్యక్తిగతంగా చూడాలని, పట్టుకెళ్ళిపోవాలనే పట్టుదలతో వచ్చాను. మేకర్‌లో పోలీసు పైఅధికారులు డెబ్బైమంది సాయుధ పోలీసులతో సిద్ధంగా వున్నారు. చుట్టుపక్కల తోగీర్‌లో పదిహేను బాల్కిలో ఐదు పోలీసు లారీలు ఉన్నాయి. బోట్‌కూల్ సంఘటన తరువాత మీ దళాన్ని ఏవిధంగానైనా నిర్బధించి శిక్షించాలని అధికారులు నిర్ణయించుకున్నారు. యశ్వంత్‌రావ్! నిన్ను చూస్తే నాకొడుకు జ్ఞాపకం వస్తున్నాడు. మీరంతా తప్పించుకొని ఇండియన్ యూనియన్‌లోకి పారిపోండి. నిజాం సాయుధబలగాలను ఎదుర్కొడం సాధ్యంకాదు. మూడునెలలు మాత్రం ఓపికతో వుండండి. రజాకార్ల లూటీలు, అత్యాచారాలు, మీకుతెలుసు. ఉద్యోగరీత్యా మేమే ఏమీచేయలేకపోతున్నాం. మీ గురించి నేను ప్రభుత్వానికి ఏదోఒకటి చెబుతాను".

అధికారి కోరికపై అతనికి పాలుత్రాగించారు. త్రాగడానికి సిగరెట్టు ఇచ్చారు. అతన్ని ప్రాణాలతో వదిలివేయాలంటే ముందు రైతులనుద్దేశించి

కాగితంపై వ్రాయమన్నారు. ఆ తర్వాత వదలివేసే అంశం ఆలోచిస్తా మన్నారు. ఆ తర్వాత అతను ఇలా వ్రాశాడు.

"రైతుసోదరులారా !

మీ అందరిని చూశాను. మీరంతా మీ ప్రాణాన్ని గౌరవాన్ని కాపాడుకునే నిమిత్తం అడవుల్లో తలదాచుకున్నారు. గ్రామాలను దోచుకునే వాళ్ళను మీరు ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వాన్ని కూలదోయాలని మీరు ప్రయత్నించడంలేదు. కుట్రపన్నడంలేదు. మీకు ఎవరి సహాయంలేదు. బయటినుంచి కాంగ్రెస్‌వ్యక్తి ఎవరూరాలేదు. ప్రభుత్వం మీకు స్వేచ్ఛ ఇచ్చి, ఆస్తులను తిరిగి ఇచ్చివేయడం మంచిది. మీకు ప్రభుత్వం ఆర్థిక సహాయం చేయాలి !

ఇట్లు
"ఫతేఆలీ"

అటు గ్రామంలో దళానికి, పోలీసులకు మధ్య కాల్పులు కొనసాగు తూనే వున్నాయి. యశ్వంత్ వెంటనే ఫతేఆలీని తీసుకువెళ్ళి చెట్టుక్రింద నిలుచోబెట్టాడు. "మీకు బహుమతి లభించలేదు. మా కర్తవ్యాన్ని నిర్వ హించనివ్వండి" అని యశ్వంత్ ఫతేఆలీని గురిచూసి కాల్చివేశాడు. ప్రక్కనేఉన్న గొయ్యిలో అతని శవాన్నిపూడ్చి యశ్వంత్‌రావ్, వెంకట్ రావ్ గ్రామంవైపు పరుగెత్తారు. మరొకవైపునుంచి ఎద్దులబండ్లలో పోలీ సులు వస్తున్నారు. గ్రామంలోని దళం సబ్‌ఇన్‌స్పెక్టర్, మరి ఆరుగురు పోలీసుల శవాలను కుప్పగా పడవేసింది. ఆతర్వాత దళసభ్యులు సాయం త్రం భోజనం చేయగలిగారు. ఆరాత్రి లారీలలో నిజాంసైనికులు వస్తున్నా రని కబురువచ్చింది. దళం అడవుల్లోకి వెళ్ళిపోయింది. అయితే ఆ రాత్రి సైనికములా అసలురాలేదు.

## హాథీబేట్ స్థావరం:

హైద్రాబాద్ సంస్థానంలో పత్రికలన్నీ పై సంఘటనల వార్తను ప్రముఖంగా ప్రకటించాయి. డి. వై. యస్. పి. ఫతేఅలీ ఇతర పోలీసుల మరణం గురించి అందరికీ తెలిసింది. ముస్లిం వర్గాల్లో సంచలనం బయలు దేరింది. కాంగ్రెస్ వర్గాల్లో హర్షోల్లాసం వ్యాపించింది. ముఖ్యంగా బీదర్ ప్రాంతంలో హిందువులు దళాన్ని అన్నివిధాలా కొనియాడారు. అక్కడి రజాకార్ల నడుం విరిగినట్లు అయిపోయింది. దళంయొక్క ఈ సాహస చర్యల గురించి ఇండియన్ యూనియన్‌లో కూడా వార్తలు వ్యాపించాయి.

యశ్వంత్‌రావ్ నాయకత్వాన దళం హాథీబేట్ అనే కొండ ప్రాంతాన్ని స్థావరంగా ఏర్పర్చుకుంది. ప్రక్కనే ఉన్న గ్రామాల్లోంచి రొట్టెలు సేకరించి దళం ఆకలి తీర్చుకునేది. ఆ తర్వాత ఆ దళం గంగాధర్ పటేల్ ఇంట్లో ఆశ్రయం పొందింది. దళ స్థావరం గురించి దేవర్జనలోని రజాకార్లకు సమాచారం అందింది. అసలు జయవంత్‌రావ్ పటేల్ ఆ సమాచారం అందజేశాడు. అతను స్వయంగా రజాకార్‌గా మారిపోయాడు. అంతకుపూర్వమే తన ప్రాణ భయంకొద్దీ అతను చుట్టుప్రక్కల వున్న రజాకార్లను సమీకరించడం మొదలుపెట్టాడు. దళం వాళ్ళకు రొట్టెలు పంపుతున్నారని గ్రామాలలోని ప్రజలను బెదిరించడం ప్రారంభించాడు. గ్రామాలన్నింటినీ తగలబెడతామని ప్రచారం చేశాడు. ఫలితంగా హాథీబేట్ స్థావరానికి ఎవరూ వెళ్ళలేకపోయారు.

జయవంతరావ్ పటేల్ వలాండీ, ఉద్‌గీర్ ప్రాంతాలకు "హరకారే"లచేత కబురు పంపించాడు. దళంవాళ్ళు హాథీబేట్‌ను స్థావరంగా ఏర్పర్చుకున్నారని వాళ్ళవల్ల తమ ప్రాణాలకు, ఆస్తులకు భయముందని, రక్షణ కావాలని చెప్పి పంపించాడు. వెంటనే సాయుధ పోలీసులు వచ్చి కొండలను చుట్టుముట్టివేశారు. రైతుదళ సభ్యులకు నాలుగురోజుల నుంచి తినడానికి

ఏమీ దొరకలేదు ఆ నీరసంతోనే పోలీసులను ఎదుర్కొన్నారు. మొదట్లో ప్రతిఘటనలేదని పోలీసులు ముందుకువెళ్ళారు. అప్పుడు దళంకాల్పులు ప్రారంభించింది. పైనుంచి వచ్చిన గుండ్లకు తట్టుకోలేక పోలీసులు వెనక్కి తగ్గారు. సాయంత్రం ఆరుగంటల వరకు కాల్పులు సాగాయి. చివరికి పోలీసులు వెనక్కి పారిపోకతప్పలేదు. అయితే తిండిలేక పోవడంవల్ల నీరసం బాగా ఎక్కువై పోయింది. చాటుగావచ్చిన ఇద్దరురైతులు తమ అసహాయతను వెలిబుచ్చారు. చివరికి రెండు గుర్రాలనుఇచ్చి కోమటి షావుకారు దగ్గరకు పంపించారు. ఆ గుర్రాలకు బదులుగా అర్థమణుగు బెల్లం, వేరుశనగ ఇచ్చాడు షావుకారు. ఆకలి ఆవిధంగా ఆరోజు తీరింది. జయవంతరావ్ ఆ రైతులనుపట్టి తెప్పించాడు. విపరీతంగా బాది దళానికి ఏమాత్రం సహాయం చేసినా ప్రాణాలుండవని తిట్టి పంపించాడు. ఆ తరువాత మళ్ళీ గ్రామంలో తిరిగి దళానికి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. ఇదంతావిని ఇకలాభంలేదని దళం ఒకరోజు జయవంతరావ్ ఇంటికి వెళ్ళింది. తాము అన్యాయాలను, అక్రమాలను ప్రతిఘటించే నిమిత్తం పోరాడుతున్నామని, ఒక హిందువుగా తన సహచరులకు సహాయపడకుండా అడ్డుతగలడం భావ్యంకాదని నచ్చజెప్పారు. గత్యంతరంలేక పటేల్ తనతప్పు ఒప్పుకున్నాడు. ఇకముందు తాను ఏవిధంగా కలగజేసుకోనని హామీ ఇచ్చాడు. దళం వెనక్కితిరిగి స్థావరానికి వెళ్ళిపోయింది. హాథీబేట్‌లో దళం ఆనాటికి ఏడవరోజు గడిపింది.

మరుసటిరోజు జయవంత్‌రావ్ తనకు రక్షణ కావాలని దళంవాళ్ళు తన ఇంటిని దోచుకోడానికి వచ్చారని ఇద్దరు 'హరకారా'లను పంపించాడు. దళంవాళ్ళు జాగ్రత్తవహించి ఆ ఇద్దరు వార్తాహరులను త్రోవలోనే పట్టుకొని విషయం తెలుసుకొన్నారు. పటేల్ ద్రోహాన్ని అర్థం చేసుకున్నారు.

జయవంత్‌రావ్ తన గఢ్ రక్షణకు పోలీసులు వస్తారని ఆశతో ఉన్నారు. అకస్మాత్తుగా ఇద్దరు దళసభ్యులు పిస్తోళ్ళతో రావడంచూసి నోటి

మాట రాలేదు. పిస్తోళ్ళు పేలాయి. ద్రోహి జయవంత్‌రావ్ శాశ్వతంగా కన్ను మూశాడు.

## తొండచీర్‌లో హాహాకారాలు.

రోజులు గడుస్తున్నకొద్దీ దళానికి కావలసిన ఆహార ధాన్యాలు సమస్యగా పరిణమిస్తున్నాయి. కిషన్‌గీర్ ఒక విధంగా ఆహారమంత్రిగా చుట్టు పక్కలున్న గ్రామాల నుంచి ఆహారధాన్యాలను విరాళంగా సేకరించేవాడు. కిషన్‌గీర్ తల్లి దళానికి రొట్టెలు చేసిపెట్టేది. అయితే క్రమంగా ఆహార సమస్య తీవ్రమైన పరిస్థితులలో దళాన్ని రెండుభాగాలుగా చేశారు. ఒక భాగాన్ని జమజల్‌కోట్‌వైపు పంపించారు. పథకం ప్రకారం మదనూర్ పోలీసు స్టేషనుపై దాడిచేసి ఆయుధాలు, తహశీల్‌పై దాడిచేసి ధనాన్ని లూటీ చేయాలని.

ఇటు తొండచీర్‌లో కిసాన్‌దళాలు లేవని రజాకార్లకు తెలిసింది. కిషన్‌గర్ దళాలకు చేసిన సహాయాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ గ్రామాన్ని సర్వనాశనం చేయాలని పోలీసులూ రజాకార్లూ గ్రామంపై దాడిచేశారు. ఇళ్ళను లూటిచేస్తూ నిప్పు అంటించారు. ఈ విషమపరిస్థితులలో కిషన్‌గీర్ తన భార్య, తల్లి అడ్డువచ్చినా వినకుండా నిస్సహాయస్థితిలో పరుగెత్తాడు. రజాకార్లకు ఎదురువెళ్ళి వాళ్ళ మంచితనాన్ని అర్థించాడు. కాని ఈలోగానే ఒక రోహిలా రజాకార్ అతన్ని గురిచూసి కాల్చివేశాడు. తన హత్యకు ప్రతీకారం తీసుకోబడుతుందని అంటూ కిషన్‌గీర్ నేలకొరిగాడు. నిరాయుధుడుగా ఉంటూకూడా గ్రామాన్ని రక్షించాలని అతను నిర్భయంగా ముందుకు ఉరికాడు. రజాకార్లను కేవలం చంపడంకోసం కాకుండా అవసరమైతే చావడం కోసం కూడా తాము ముందు ఉండగలమని, కిషన్‌గీర్, మరో యువకుడు, హన్మంత్ నిరూపించారు. ఆరోజు రజాకార్లు, పోలీసులు గృహ దహనాలు, మానభంగాలు, లూటీలు జరిపి విజయోన్మాదంతో

ఉద్‌గీర్ వైపు వెళ్ళిపోయారు. తొండచీర్‌లో విషాదం అలుముకుంది. కిషన్‌గీర్‌కు ఇతర మృతులకు బంధువులంతా కలసి విషన్న వదనాలతో దహన సంస్కారాలు జరిపారు.

తొండచీర్‌లో జరిగిన అత్యాచారాల గురించి రైతు దళాలకు కబురు అందింది. ఆ దళాలు వెంటనే బయలుదేరి తొండచీర్ వచ్చి చేరుకున్నాయి. ముఖ్యంగా దత్తగీర్ తన తండ్రిలాంటి కిషన్‌గీర్ చావును భరించలేక పోయాడు. ఏవిధంగానైనా ఆ అన్యాయానికి, అఘాయిత్యానికి ప్రతీకారం తీసుకోవాలని దళం నిర్ణయించుకొంది. ప్రాణాలకు తెగించి ఉద్‌గీర్ పై ధాడి చేయాలని అనుకొన్నారు. ఉద్‌గీర్‌పై దాడి చేయడమంటే అగ్నిలోకి శలభాలవలె దూకడమే. అయినా కక్ష సాధించాలనే దృఢ నిశ్చయం అందరిని ప్రాణాలకు తెగింప చేసింది. తమ తమ బంధు మిత్రులతో చివరి సారిగా కలసి రావడానికి దళ సభ్యులకు అనుమతి ఇవ్వడం జరిగింది. ఈ నిర్ణయాలన్ని రామఘాట్‌లోనే జరిగాయి.

## ఆత్మబలి— ప్రతీకారం

రైతుదళం ముఖ్యపాత్ర వహించే బల్‌వీర్ కూడా తన ఇద్దరు మిత్రులతో తల్లిని కలుసు కోవాలని డోన్‌గావ్ వెళ్ళాడు. ఈ విషయం తెలిసిన రెండు వందలమంది రజాకార్లు అతని ఇంటిని చుట్టు ముట్టి వేశారు. బల్‌వీర్ తన మిత్రులు ఇద్దరూ ఆ సమయానికి గ్రామం బయట కాల కృత్యాలు తీర్చు కోవాలని వెళ్ళి వున్నారు. ఈదాడి చూసి వాళ్ళిద్దరు గత్యంతరం లేక అటునుంచి పారిపోక తప్పలేదు. బల్‌వీర్ తన మరో సహచరుడైన విఠల్‌తో బాటు ఇంటిలోంచి ఎదురు కాల్పులు జరిపారు. కొన్ని గంటల పాటు కాల్పులు కొనసాగాయి. రజాకార్లు చివరికి ఆ ఇంటికి నిప్పు అంటించారు. ఈ విషమ పరిస్థితుల్లో బల్‌వీర్ బయటకు రావాలన్నా ఎదురుగా రజాకారు. తుపాకులకు బల్‌వీర్ తొణకకుండా తన తుపాకితో

మిత్రుడైన విఠల్‌ను కాల్చి ఆ తర్వాత స్వయంగా తానే తుపాకితో కాల్చుకున్నాడు. చేతిలో వున్న మందుగుండు సామాగ్రి వున్న సంచిని మంటల్లోకి విసిరేశాడు. దానితో చిన్న ప్రేలుడు జరిగి మంటలు మరింతగా ప్రజ్వరిల్లినాయి. బల్‌వీర్ తన సహచరుడితో ఆత్మబలి చేసుకున్నారు, శత్రువుల చేతుల్లో చావటం ఇష్టంలేక.

ఆజానుబాహుడైన బల్‌వీర్ దళానికి ఎన్నో విధాలుగా పనికి వచ్చిన వీరుడు. అతడు చావడం దళానికి తీరని నష్టం. బల్‌వీర్ మరణవార్త షోలాపూర్‌కు మరో విధంగా చేరింది. చన్‌వీర్‌గోన్‌గావ్‌కర్ మరణించాడని ఎవరో చెప్పారు. చన్‌వీర్ కుటుంబం తీరని శోకానికి లోనైంది. అయితే స్వాతంత్ర్యం తరువాత షోలాపూర్ నుంచి తిరిగివచ్చిన ఆకుటుంబం ముఖ్యంగా చన్‌వీర్ భార్య. చన్‌వీర్‌ను సజీవంగా చూసి ఆనందోత్సాహాలతో ఉప్పొంగి పోయింది.

తొండచీర్‌ను దోపిడీ చేసిన తర్వాత ఉద్‌గీర్ ముస్లిం వర్గాలు తమకు ఇక ప్రతిఘటన లేదని విర్రవీగి పోయారు. రమ్‌జాన్ ఉత్సవాలు ఘనంగా జరుపుకున్నారు. 15 ఆగష్టు 1948 నాడు స్వతంత్ర హైద్రాబాద్ ఉత్సవం జరుపు కోవాలను కొంటున్నారు. అయితే 11 ఆగష్టు నాడే ఉద్‌గీర్‌లో చెడువార్త ఒకటి వ్యాపించింది. పక్క వూరిలో (నిడేబన్)ని ఒక బావిలో నలుగురు రజాకార్ల శవాలు కనపడ్డాయని వార్త. దళంవాళ్ళు చంపి పడ వేసినట్లు తెలిసింది. ఇక ఎదురు లేదని అనుకుంటున్న రజాకార్లను ఈ సంఘటన భయ కంపితులను చేసింది. చాటు మాటుగా దళం వాళ్ళు ఎవరిపై ఎప్పుడు దాడి చేస్తారో అని భయం పీడించడం ప్రారంభించింది.

అసలు జరిగిన విషయం: రామఘాట్ లో రైతుదళం ఉద్‌గీర్ పై దాడి కోసం చురుకుగా ఏర్పాట్లు చేసుకుంటూ వుంది. అయితే ప్రతీకార

వాంఛతో దహించుకు పోతున్న కొందరు యువకులు మొదటే వెళ్ళి 10 ఆగస్టు నాడే కుమదాల్ గ్రామం ప్రవేశించారు. మానిక్‌రావ్ సహచరుడైన హన్నుఖాన్ ఆరుగురు సభ్యులను రజాకార్ల వేషంలో తీసుకెళ్ళాడు. అయితే ఆ గ్రామంలోని రజాకార్లు మొదట్లో హన్నుఖాన్‌ను నమ్మలేదు. అతను అల్లామియా, నిజాం సాక్షిగా వాళ్ళను నమ్మించగలిగాడు ఆరాత్రి అజాగ్రత్తగావున్న రజాకార్ల గఢ్‌పై హన్నూఖాన్ దాడిచేసాడు. అనేక మందిని చంపగలిగారు. నలుగురు రజాకార్లను చంపి నిడేబన్ దగ్గర పాడుబావిలో పడవేశారు.

# 13. రామ్‌ఘాట్‌లో పోరాటం

12 ఆగస్టు, 1948 నాడు ఉద్‌గీర్‌నుంచి సాయుధబలగం ఒకటి బయలుదేరింది. ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టర్, ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్‌తో సహా వందమంది పోలీసులు, వేలాదిమంది రోహిల్లాలు, పఠాన్‌లు, పస్తుక్వామ్‌లు, రజాకార్లు కూడా వెంటవున్నారు. వెనకాల వేలాది మంది ముస్లింలు ప్రేక్షకులుగా వస్తున్నారు. రామ్‌ఘాట్‌లో వున్న రైతు దళాన్ని మట్టుబెట్టాలని ఈసారి మందిమార్బలంతో బయలుదేరారు. జరగబోయే పోరాటాన్ని కళ్ళారా చూడాలని ముస్లింప్రజలు దారిలోవున్న చిన్న కొండఎక్కి కూర్చున్నారు.

రామ్‌ఘాట్, తొండచీర్, కౌల్‌ఖేడ్ గ్రామాలు త్రికోణంలో వున్నట్టు వుంటాయి. ఈ త్రికోణంమధ్య సమతలమైన కొండప్రాంతంవుంది. ఉద్‌గీర్ నుంచి బయలుదేరిన శత్రుదళం కౌల్‌ఖేడ్ దగ్గరలోనే వున్న పల్లపుప్రాంతాలను చేరుకొంది. ఈలోగా రైతుదళానికి కబురుచేరింది. అంతకుపూర్వమే ఈ దాడి జరుగబోతుందనే విషయం తెలిసింది. దళం అన్నిఏర్పాట్లు చేసుకుని ముందుకు దూసుకుపోయింది. భోజనం చేయగలిగే వ్యవధికూడా లేకుండాపోయింది. అంతపెద్ద శత్రుబలంతో తలపడడానికి ఇంతటి చిన్న దళం అంతటి మనోధైర్యంతో వెళ్ళడం దుస్సాహసం అనిపించవచ్చు.

సమతలంగా వున్న కొండమీదికి ఉదయం 8 గంటలకు దళం చేరు కుంది. శత్రుదళాలు ఎదురుగా కనపడగానే రైతుదళం మోచేతులపై ప్రాకుతూ కదిలింది. ఎదురుగా కాల్పులకు సమాధానంగా తిరిగి కాల్పులు రెండు మూడు గంటలపాటు ఎదురెదురుగా సాగుతూనే వున్నాయి. శత్రువు దగ్గర మందుగుండు సామాగ్రికి కొదవలేదు. ఆగకుండా కాల్పులు సాగు తూనేవున్నాయి. ఎటుచూసినా పొగ వ్యాపించివుంది. శత్రువు అత్యంత శక్తి వంతంగా దాడిచేస్తున్నాడనే సంగతి రైతుదళానికి తెలుసు అయినా చంప డమో చావడమో అనే అంతిమలక్ష్యంతో వాళ్ళు కృతనిశ్చయులై వున్నారు. కొండ ఆచివర వాళ్ళు, ఇటు వీళ్ళు పరస్పరం తుపాకులు గురిచూసి కాల్చు తూనే వున్నారు. తమదగ్గరవున్న పరిమితమైన మందుగుండు సామగ్రి జాగ్రత్తగా వాడుతున్నారు, దళం తన దగ్గరవున్న ఫిరంగిని పేల్చింది. అది ఎదురుగావున్న కొండపైకి గుళ్ళను విసిరింది. ప్రేక్షకుల్లా వచ్చిన జనం గందరగోళంగా పరిగెత్తడం ప్రారంభించారు. మరోసారి ఫిరంగి పేలింది. శత్రుదళాల్లో కొందరు ఆ దెబ్బకు కూలిపోయారు. అయినా రోహి లాలు, పఠాన్లు, పోలీసులు కదలకుండా ప్రతిఘటిస్తూనే వున్నారు. మరో వైపు రాళ్ళచాటునుండి మానిక్ రావ్ మూలే, యార్ మొహమ్మద్ ఖాన్ ఎదురెదు రుగా తుపాకులు గురిచూచి కాలుస్తున్నారు. ఒకగుండు మానిక్ రావ్ మూలే తలపైనుంచి దూసుకుపోయింది, వెంట్రుకవాసిలో చావుతప్పింది. అలాగే మరో మూరుగంటల కాల్పులు కొనసాగాయి. శత్రువర్గంలో అనేకమంది మరణించారు. 50 మంది చచ్చిపోగా వందలాది మంది గాయపడ్డారు. చివరకు యార్ మొహమ్మద్ను చుట్టిముట్టి చంపివేశారు దళంవాళ్ళు. యార్ మొహమ్మద్ పడిపోగానే శత్రుదళాలలో సంచలనం కలిగింది. చాలా మంది అవకాశం చూసుకొని వెనక్కి తగ్గిపోసాగారు. హన్స్ పీర్ అదే సమయంలో ఇద్దరు పఠాన్లనుంచి తుపాకులను లాక్కొని వాళ్ళను ఖతం చేశాడు. రామకృష్ణయోర్ పఠాన్ల నుంచి తుపాకి లాక్కొందామని ముందుకు

దూకాడు పఠాన్ తుపాకి ఆనించాడు. అతని గుండెపై రామకృష్ణ తన తుపాకి మడిమెతో లాగి కొట్టాడు. అది విరిగింది. ఇద్దరు తలపడి కుస్తీ పట్టారు. దళసభ్యుడు పఠాన్‌ను గురిచూసి దెబ్బతీశాడు. రామకృష్ణ మోకాలుకు దెబ్బ తగిలింది. దేవరాజ్ శత్రువుపై దాడిచేసి తుపాకి లాక్కోవాలని ముందుకు దూకాడు. దళం చేసుకున్న నిర్ణయం ప్రకారం ఎవరైనా. శత్రువుదగ్గర ఆయుధం లాక్కొంటే అవి వాళ్ళ సొంతం అవుతాయి. ఆ ఆశ కొద్దీ దేవరాజ్ ముందుకు వెళ్ళాడు. శత్రువు గుండు తగిలింది. క్రింద కూలిపోయాడు. మరోవైపు దత్తగిర్ ప్రతీకార వాంఛతో మండి పోతున్నాడు. కిషన్‌గిర్‌ను చంపిన పైజుమహ్మద్‌ను స్వయంగా చంపాలని పిచ్చిగా వెతకడం ప్రారంభించాడు. అయితే ఈలోగా రాయి ప్రక్కన గాయపడిన యార్ మొహ్మద్ కనపడ్డాడు. అదే కసితో అతని తలపై రాయితో బలంగా కొట్టాడు దత్తగిర్. ఒకప్పుడు ఉద్‌గిర్‌లో చిన్ననాడు దత్తగిర్, యార్ మొహ్మద్ ఒకే స్కూల్లో ఒకే తరగతిలో చదువుకొన్న సహాధ్యాయులు. ఈనాడు బ[illegible]లు.

ఈ పోరాటంలో ఘోరంగా ఓడిపోయి రజాకార్లు పోలీసులు ఉద్‌గిర్ వైపు పారిపోయారు. దళం అమరుడైన దేవరాజ్ మాధవ్‌ను సైనిక మర్యాదలతో సమాధిచేశారు. తమకంటే ఎన్నోరెట్లు బలవంతుడైన శత్రువును ఓడించి వెనక్కితోసి విజయంతో రామఘాట్ తిరిగి వెళ్ళిపోయింది రైతు దళం. గాయపడిన కొంతమందికి డాక్టరు చెన్నప్ప చికిత్స చేశాడు. తీవ్రంగా గాయపడిన వాళ్ళను షోలాపూర్ పంపించే ఏర్పాట్లు జరిగాయి. ఇటు ఉద్ గీర్‌లో ఓటమివార్త విషాదంలా వ్యాపించింది. ముస్లిం, పోలీసువర్గాలు కోపంతో కొందరి హిందువుల ఇళ్ళపై దాడిచేశారు. అక్కడే స్థానికపటేల్ హావర్గారావును పోలీసురైటరు బహిరంగంగా కాల్చివేశాడు. ఒక బ్రాహ్మణ యువకుని సజీవంగా దహనం చేశారు. హిందువులందరూ అరచేతులలో

ప్రాణాలు నిలుపుకొని తలుపులు బిగించుకొని వుండిపోయారు

## హిస్సర్గా కోటపై అధికారం

రామఘాట్ పోరాటం ముగిసిన తరువాత దళం తిరిగి మందుగుండు సామాగ్రి, ఆయుధాల సమస్యను ఎదుర్కొంది. కొందరు షోలాపూర్ బయలుదేరి వెళ్ళారు. మధ్యలో అట్టర్గా, జావల్గా తదితర ప్రాంతాలలో ఆగుతూ సరిహద్దు ప్రాంతంలోవున్న లింగదల్లి చేరుకున్నారు. ఇది నిజాం రాజ్యంలో అంతర్భాగమైనా ఆనాటికే స్వతంత్రమైపోయింది. హోన్నాలికి చెందిన భావూరావు, బాబారావు అనే సోదరుల సాహసంతో ఈ లింగదల్లిని విముక్తిపర్చారు. ఆ సోదరులుకూడా దళంలో చేరిపోయారు. భావూరావు స్వాధీనంలోవున్న గఢ్లో ఆయుధాలు దాచిపెట్టారు. షోలాపూర్లో తిరిగి ఆయుధాలు సేకరించారు. షోలాపూర్ కలెక్టర్, స్థానిక నాయకుడు చెన్నా సింగ్ ఈదళ నాయకులను ప్రశంసించి సహాయం చేశారు.

లింగదల్లి పక్కనేవున్న హిస్సర్గలో నిజాంసైన్యాలు వున్నాయి. లింగదల్లికి వాటివల్ల ప్రమాదం వున్నదన్న సంగతి తెలుసు. దళం అక్కడే వున్న సందర్భంలో హిస్సర్గపై దాడిచేశారు. వెంకట్రావ్ మిరకల్, డా॥ చెన్నప్ప నాయకత్వాన దళంవెళ్ళి విజయవంతంగా దాడి జరిపింది. ఒక మైలుదూరం ఆ నిజాం సైన్యాలను తరిమికొట్ట గలిగారు. అయితే ఆ తర్వాత అదనంగా వచ్చిన సైనికదళాలతో పోరాటం జరిగింది. రైతు దళంలో ముగ్గురు మరణించారు. ఇకలాభంలేదని రైతుదళం లింగదల్లివైపు ఉపసంహరించుకుంది. అయితే ఈలోగా ఇక్కడే దళంలో ప్రముఖ నాయకులు కొందరు జీవితాలను అర్పించారు. వెంకట్రావ్ మిరకల్, డా॥చెన్నప్ప సమర్థారావు, భాయిసింగ్లాంటి వీరులు మరణించారు. యశ్వంత్రావ్ లింగల్లినుంచి తిరిగి హిస్సర్గపై దాడి జరిపాడు. అయితే ఈలోగా నిజాం

సైన్యాలు హిస్సర్గనుంచి వెనక్కి వెళ్ళిపోయాయి. యశ్వంత్‌రావ్ అప్పుడే హిస్సర్గకోటపై త్రివర్ణపతాకాన్ని ఎగురవేశాడు. హిందువులంతా హర్షోల్లాసాలతో ఉత్సవం జరుపుకున్నారు. ఆ తర్వాత పదిరోజులకే పోలీసుచర్య జరిగింది. అయితే ఈ హిస్సర్గ పోరాటంలోనే దళం తన అమూల్యమైన సహచరులను కోల్పోయింది. మానిక్‌రావ్‌ను తిరిగిసంస్థానంలోకి, యశ్వంత్ రావ్, దత్తగీర్ భారతీయ సైన్యాలకు దారిజూపించడానికి నియమితులైనారు. 12 సెప్టెంబర్ 1948 నాడు భారతీయసైన్యాలు సంస్థానంలో ప్రవేశించాయి.

## రజాకార్రాయ స్వాహా

పోలీసుచర్య కొన్నిరోజుల్లో జరుగుతుందనగా మానిక్‌రావ్‌మూలే• తదితరులు షోలాపూర్ నుంచి తిరిగివచ్చారు. ఈ దళం అట్టర్గానుంచి లాసోనాపైకి వెళ్ళింది. దళానికి ఆహారం, డబ్బు సమస్య పీడించసాగింది. లాసోనాలోని ఫీరాజీపటేల్‌ను విరాళం అడిగారు. అతను నిరాకరించాడు. ఫీరాజీ ధనవంతుడు. దళం భయంచేత రజాకార్లు అతన్ని లూట్ చేయకుండా వదిలేశారు. ఆ కృతజ్ఞతతోనైనా అతను సహాయం చేయలేదు. అందువల అతన్ని చివరికి భయపెట్టి దళం వెయ్యిరూపాయలు వసూలు చేసుకోలేక తప్పలేదు. రజాకార్లకు వ్యతిరేకంగా మాత్రమే ఆయుధాలు లేవనెత్తిన దళం అలాంటి మూర్ఖులైన ధనవంతులను కూడా భయపెట్టి పనిచేయించక తప్పలేదు. లాసోనా ప్రాంతంలోనే దళం స్థావరం ఏర్పాటు చేసుకుంది.

హలనాయి ప్రాంతంలో రజాకార్లు అత్యాచారాలు చేస్తున్నారనే వార్త అందింది. ఒక హరిజన యువతిని బలాత్కరించి, వీధుల్లో ఆవుమాంసం విసిరివేయడంలాంటి పనులు జరిగాయి. దళం హలవాయిపై దాడిచేసి 40 మంది రజాకార్లను ఖతంచేసింది. ఆ తర్వాత వలాండి గ్రామం చేరు

కొన్నారు. అక్కడే రజాకార్లతో ఘర్షణ పెద్దఎత్తున జరిగింది. చివరికి హాండ్‌గ్రైనేడ్‌తో పోరాటం జరిగింది. రజాకార్లు బాగా దెబ్బతిని తోక ముడిచారు. అక్కడినుంచి మేకర్‌వెళ్ళి ఆ గఢ్‌లో వున్న రజాకార్లపై దాడి చేశారు. ఆ గఢ్‌లో రజాకార్లు దాచిపెట్టిన దోపిడి సామాగ్రిని గ్రామప్రజ లకు పంచిపెట్టారు.

మేకర్‌నుంచి దేవని చేరుకున్నారు. ఇక్కడ రజాకార్లు పెద్దసం ఖ్యలో వున్నారు. షోలాపూర్ నుంచి క్రమంగా భారతీయసైన్యాలు ముం దుకు వస్తుంటే రజాకార్లు వెనక్కిపారిపోయి దేవనీలో తలదాచుకుంటు న్నారు. ఆ గ్రామంలో హిందువుల ఇళ్ళను దోచుకున్నారు, విపరీతంగా ఖూనీలు జరిపారు. అక్కడ గఢ్‌లో రజాకార్ల స్థావరం ఏర్పరచుకున్నారు. దళం దాడిజరిపి కాల్పులు జరిపింది. అయితే గఢ్‌లోవున్న రజాకార్లు అను కూలమైన స్థితిలో వున్నారు. ఆరు రోజులపాటు ఈ ముట్టడి సాగుతూనే వుంది. చివరికి ఒకరోజు దళం నర్సింగ్‌రావ్ మాస్టరును దేశ్‌ముఖ్ ఇంటి పైకి ఎక్కించారు. మరోవైపు దళం కాల్పులు కొనసాగిస్తూనే వుంది. నర్సింగ్‌రావ్ ఆ ఇంటిపైనుంచి ఐదారు చేతిబాంబులు విసిరాడు. గఢ్‌లో వున్న రజాకార్లు ఆదెబ్బకు తలుపులు తెరచుకొని పారిపోవడం ప్రారం భించారు. దేవని నుంచి భుజనాల్‌వైపు రజాకార్లు, చివరికి నిజాం ప్రభుత్వా ధికారులు, అరబ్ తహసీల్‌దార్, పోలీస్‌అమీన్ కూడా వాళ్ళతోబాటు పారి పోతున్నారు. దారిలో రజాకార్లు, ముస్లింలు ఊచకోతకు గురైనారు. ఎక్కడచూసినా శవాలే! ఈనాటికి తమ అన్యాయాలకు, అవినీతిపనులకు ఫలితం అనుభవించారు.

ఆ ప్రాంతాల్లో దాదాపు 2 నుంచి 4 వేలదాకా రజాకార్లు ప్రజల చేతుల్లో చచ్చిపోయారు, హిందువుల ప్రతీకారం మండిపోయింది. అక్బర్ ఖాన్ అనే పఠాన్ తన నలుగురు కూతుళ్ళతో పారిపోతుండగా దారిలో చంప

బడ్డాడు. ఆ నలుగురు కూతుళ్ళు కమాల్‌నగర్ వెళ్లారు. వాళ్ళ నిస్సహాయ స్థితిని జూసి అక్కడి పోలీసుఅధికారి వాళ్ళను బంధించి పెట్టాడు. దళం అక్కడికి వెళ్ళి ఆ నలుగురు అమ్మాయిలను విముక్తిపర్చారు. వాళ్ళను హైద్రాబాద్ వెళ్ళే రైల్లో సురక్షితంగా పంపించివేశారు.

పోలీసుచర్య జరుగుతున్న సందర్భంలో రైతుదళంపై కొందరు అధికారులకు ఫిర్యాదులు చేయడం ప్రారంభించారు. మిలిట్రీ నియమించిన జిల్లాకలెక్టర్‌కు దళంపై ఆరోపణలు వెళ్ళాయి. డోన్‌గావ్‌లోవున్న దళాన్ని వాళ్ళ నాయకులను బంధించి పెట్టాలనే ప్రయత్నాలు విఫలమైనాయి. జిల్లా కలెక్టర్ రోజెల్లో వాళ్ళకు నచ్చచెప్పి పరిస్థితిని అదుపులో పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రాంతాల్లో దళంవల్ల అశాంతి ప్రబలివుందని కొందరు దుష్ప్రచారం సాగించారు.

హాల్‌సముంద అనే ప్రాంతంనుంచి ఒక ఆజానుబాహుడైన రైతు బయలుదేరాడు. దారిలో ఒకట్రక్కును ఆపి బీదర్ వెళ్లాడు. అయితే బీదర్‌లో లారీలోంచి ఆ రైతు సూటువేసుకొని దిగాడు. అతనే చన్‌వీర్. సరాసరిన అతను బీదర్‌కోట దగ్గరలోవున్న కలెక్టర్ భవనానికి వెళ్ళాడు, కలెక్టర్ భవనందగ్గర భీమ్‌రావు పటేల్ కలిశాడు. మొదట్లో అతను ఏమాత్రం గుర్తుపట్టలేదు. చన్‌వీర్ తనను పరిచయం చేసుకోగానే పటేల్ ఆశ్చర్యపడ్డాడు. పోలీసులు ఇంతకాలంగా గాలిస్తున్న వ్యక్తి ఈనాడు స్వయంగా కలెక్టర్ కార్యాలయానికి వచ్చాడు. తాను కలెక్టర్‌ను కలుస్తానని, అయితే తనవల్ల చెడువిధంగా వ్యవహారాలు జరిగితేమాత్రం దళానికి కబురు అందజేయాలని చన్‌వీర్ పటేల్‌తో చెప్పివెళ్లాడు.

లోపలికి ప్రవేశిస్తుండగా మిలిట్రీసెంట్రీ, చప్రాసీ అతనికి సెల్యూట్ చేశారు. అతను కార్యాలయం లోపలికి ప్రవేశించగానే లోపల కొందరు ప్రముఖులు కూర్చున్నారు. కలెక్టర్ ఇంకారాలేదు. బీదర్ కాంగ్రెస్ నాయ

కుడు, న్యాయవాది శ్రీనివాస్‌రావు, గుండేరావు, యేరోతక్కర్ ఎదురుగా కూర్చుని వున్నారు. చన్‌వీర్ వాళ్ళను గుర్తుపట్టాడు. కాని వాళ్ళు ఇతనిని ఎవరో కొత్తఅధికారి కాబోలని అనుకున్నారు. కాసేపట్లో కలెక్టర్ లోపలికి వచ్చారు. అప్పుడు చన్‌వీర్ గాగుల్స్, హ్యాట్‌తీసి కలెక్టర్‌కు నమస్కరించాడు. కలెక్టర్ అతన్ని గుర్తుపట్టి, "చన్‌వీర్, నువ్వా !" అంటూ భయంతో, ఆశ్చర్యంతో చేంబర్‌లోకి వెళ్ళండి.యస్. పి.ని వెంటనేసాయుధ పోలీసులతో రమ్మని ఆజ్ఞాపించాడు. శ్రీనివాసరావు, గుండేరావ్‌లు చన్‌వీర్‌ను రెప్పవాల్చకుండా చూస్తూఉండిపోయారు. కొన్ని నిముషాల్లోనే డి. ఎస్. పి. పోలీసులతో వచ్చి కార్యాలయాన్ని చుట్టుముట్టాడు. స్వయంగా కలెక్టర్‌తో సంప్రదించి ఇద్దరు చవ్‌వీర్‌ముందుకు వచ్చారు. చన్‌వీర్ అన్నాడు : "నేను స్వయంగా లొంగిపోవాలనే వచ్చాను. మీరేకదా మాపై కేసులు వగైరా ఏమీవుండవు వచ్చి లొంగిపొమ్మని కబురు పంపించారు. కొంచెం సేపు నిశ్శబ్దం ఆవరించింది.

"శూర్ ఇద్యో" (గొప్ప సాహసివి) అని కన్నడంలో చన్‌సీర్‌ను డి. యస్. పి. వీపుతట్టి అభినందించాడు. కాగితాలపై హామీ వ్రాయించుకొని కొన్ని విషయాలు నచ్చజెప్పాడు. చన్‌వీర్ ప్రతిరోజు ఉద్‌గీర్ పోలీస్ స్టేషన్‌లో హాజరు వేయించుకోవాలని, మిగతా సహచరులను కూడా లొంగిపొమ్మని చెప్పాలని షరతులు విధించారు. చన్‌వీర్ వెంటనేవెళ్ళి రామ్‌ఘాట్ నుంచి మిగతా మిత్రులను తీసుకువచ్చాడు. నిర్ణయానుసారం చన్‌వీర్‌తో సహా అందరూ పోలీసుఅధికారి దల్‌వీర్‌దగ్గరకు వెళ్ళారు. దల్‌వీర్ వాళ్ళను రోజూవచ్చి సబ్‌ఇన్‌స్పెక్టర్ మన్నాన్ కలసి వెళ్లాలని ఆదేశించాడు. బోట్‌కూల్‌లో మన్నాన్ మాచేత ఓటమిపొందాడు. అతని ఆయుధాలు అప్పట్లో లాక్కొన్నాము. అతనిముందు రోజూ హాజరు వేయించుకోమంటారా ? అని చన్‌వీర్ అన్నాడు. దల్‌వీర్ వివరాలన్నీ విని లోపలినుంచి మన్నాన్‌ను

పిలిపించాడు. అతనుతనఓటమిగురించి అంగీకరించాడు. దల్‌వీర్,చన్‌వీర్‌ను ప్రశంసిస్తూ మీరురోజూ హాజరు వేయించుకోవలసిన అవసరంకూడా లేదు. అయితే మా ఔదార్యాన్ని మాత్రం "దుర్వినియోగం చేయవద్దు" అని చెప్పి **పంపించాడు.**

## చా క చ క్యం :

అయితే కొంతకాలం గడచిన తర్వాత చన్‌వీర్, మానిక్‌రావులను పోలీసులు తిరిగి అరెస్టుచేశారు. పాతకేసు ఒకదానిని తిరగతోడి వాళ్ళిద్దరును విచారణాధీనంలో వున్న ఖైదీలుగా బీదల్‌జైల్లో వేశారు. బీదల్ కాంగ్రెస్ నాయకుడైన గుండేరావు పలుకుబడిగల వ్యక్తి. అతను స్వయంగా రైతుదళ నాయకులను ఏదో కేసులో ఇరికించి జైల్లో వేయించాలని శ్రద్ధ తీసుకున్నాడు. పైగా న్యాయవాదులందరిని సహాయపడవద్దని ప్రచారం చేశాడు. ఒకరోజు చన్‌వీర్, మానిక్‌రావ్‌లు కోర్టుకువచ్చారు. న్యాయవాదిగా కొత్తగా ప్రాక్టీసు ప్రారంభించిన హన్మంత్‌రావ్‌జాదవ్ వాళ్ళకు కనపడ్డాడు. పిలిచి అతన్ని తమ తరుపున వాదించమని కోరారు. అతను తాను మరీ కొత్తవాణ్ణిఅని, గుండేరావ్ ప్రభావంవల్ల మిగతా న్యాయవాదులు ముఖావంగా వున్నారని స్వయంగా తాను ఏమిచేయగలనని అసహాయతను వెలిబుచ్చాడు. తమ తరఃఫున వకాలత్ పడవేసి కొత్తగా వచ్చిన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌తో వివరాలను చెబితే చాలునని చన్‌వీర్ చెప్పాడు. అలాగే జరిగింది. ఆతర్వాత ప్రాసిక్యూటర్ విషయమంతా ఓపిగ్గావిని సానుభూతితో పరిశీలించాడు. నిజాంనాటి కేసులేవైనా నిరాధారంగా సాగదీయబడుతుంటే ఎత్తివేయాలని పైనుంచి ఆదేశాలు కూడా వచ్చాయి. ప్రాసిక్యూటర్ ఈ వ్యవహారమంతా పై పోలీసు అధికారులతో చర్చించి చివరకు కేసును ఉపసంహరించుకొన్నాడు. తిరిగి చన్‌వీర్, మానిక్‌రావ్‌లు విడుదలై బయటికి వచ్చేశారు.

ఆ తర్వాత మానిక్‌రావ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇంటికివెళ్ళి కృత

జ్ఞాతలు తెలియచేశాడు. అతను ప్రాసిక్యూటర్ ఇంట్లోవుండగా పోలీసులు తలుపుతట్టి, ఇంటిని గాలించాలని బయటినుండి కేక వినపడింది. ప్రాసిక్యూటర్ తలపట్టుకొన్నాడు. మానిక్‌రావ్ లంచం ఇవ్వడానికి వచ్చాడని అదే సందర్భంలో అరెస్టుచేశామని చెప్పడానికి విరోధులు ఈఎత్తుగడకు దిగారు.

మానిక్‌రావ్ వెంటనె ప్రాసిక్యూటిర్ యూనిఫారమ్ వేసుకొని "మీరు ఏమీ బెదిరిపోవద్ద"ని మెల్లగా తలుపుతీసి వెనకాల నిలబడ్డాడు. సబ్‌ఇన్‌స్పెక్టర్ సరాసరి లోపలికి వెళ్ళిపోగానే యూనిఫారమ్‌లో వున్న మానిక్‌రావ్ బయటికివెళ్ళి పోలీసులను వెనకాలవున్న ద్వారంలోంచి రమ్మనమని చెప్పాడు. పోలీసులు వెనక్కి తిరిగారో లేదో మానిక్‌రావ్ తప్పించుకుని పారిపోయాడు. ప్రాసిక్యూటర్ ఇంట్లో ఆరోజు పోలీసులకు ఎవరూ దొరకలేదు. ప్రాసిక్యూటర్ గౌరవం ఆవిధంగా కాపాడబడింది.

మానిక్‌రావ్ సరాసరివెళ్ళి దూరంగా లోయప్రాంతంలో తనకోసం ఎదురుచూస్తున్న చన్‌వీర్ తదితర మిత్రులను కలుసుకున్నాడు. జరిగిన వ్యవహారం గురించి చెప్పాడు. వెంటనే వాళ్ళు ఆపబ్లిక్ ప్రాసిక్యూటర్ యూనిఫారమ్ మూటగట్టి వెడుతూ వెడుతూ అతనిఇంట్లో పడవేసి వెళ్ళిపోయారు.

హైద్రాబాద్ సంస్థానంలో స్వాతంత్ర్యానికి పూర్వం ఆ తర్వాత రైతుదళ వీరులు ఎన్నోకష్టాలు ఎదుర్కొన్నారు. ప్రాణాలకు తెగించి ప్రజల విముక్తికోసం అనేకవిధాల ఇబ్బందుల్లో జీవించారు. సాహసంతో చాకచక్యంతో సర్వస్వం అర్పించి పోరాటంలో పాల్గొన్నారు. అలాంటి నిజమైన దేశభక్తులు స్వేచ్ఛా వాతావరణంలో కూడా ఇన్ని ఇబ్బందులకు గురియైనారంటే హృదయం కోపంతో, బాధతో మండిపోతూ వుంటుంది. దేశంలో ఈనాటికి ఇలాంటి వీరులను, దేశభక్తులను ఉదాసీనదృష్టితో చూడడం మరింత బాధాకరమైన విషయం.

రైతుదళం గురించి మరికొన్ని ముఖ్యమైన అంశాలను ప్రస్తావించ

వలసిఉంటుంది. కాంగ్రెసునాయకులు అనేకమంది వాళ్లను నిరుత్సాహపరిచే వారు. సాయుధులైన రజాకార్లను, నిజాం పోలీసులను ఎదుర్కోడం దుస్సాహసం తప్ప మరొకటికాదని అనవసరంగా ప్రాణాలు బలిపెట్టు కోవడంతప్ప ప్రయోజనం ఉండదని వ్యాఖ్యానించేవారు. అయినా ఆశయం కోసం తెగించిన దళసభ్యులు నిరుత్సాహపడలేదు. షోలాపూర్ వెళ్ళి ఆయుధాలు కావాలన్నప్పుడు "మీరంతా చదువురాని వాళ్ళు. ఈ ఆయుధాలతో హిందువులనే దోపిడీ చేస్తా రేమో అని" కాంగ్రెస్ నాయకులు అనుమానం వ్యక్తం చేశారు. అయినా ఆచరణలో త్యాగం, నిస్వార్థం, సాహసం, చాకచక్యం చూపించిన రైతుదళం తన ప్రతిజ్ఞను, నియమాలను కాపాడుకుంది.

అలాగే రైతు దళంలో క్రొత్తగా సభ్యులు కావాలని ఎవరైనా వస్తే జాగ్రత్తగా అన్ని అంశాలను పరిశీలించేవారు. ఆ క్రొత్తవాళ్ళ పూర్వ చరిత్రను వాకబు చేసి కనుక్కొనేవారు. తమ గూఢచారులద్వారా వాస్తవాలను సేకరించేవారు. రజాకార్ల వల్ల స్వయంగా బాధలు, నష్టాలు అనుభవించిన వ్యక్తులకు ప్రాధాన్యం ఇచ్చేవాళ్ళు. అలాంటివాళ్ళ తప్పకుండా కసితో చంపడానికైనా, చావడానికైనా సిద్ధపడతారని వాళ్ళు అంచనా వేసుకునేవారు. ప్రతికూలమైన పరిస్థితుల్లో కొన్నిపనులు చేయమని పురమాయించి వాళ్ళ ధైర్యసాహసాలను పరీక్షించేవాళ్ళు.

ప్రజల ఆత్మగౌరవాన్ని కాపాడిన రైతాంగదళం జనంలో అన్యాయాన్ని ప్రతిఘటించే శక్తి కలుగజేసింది. అనేకమందిని దృఢ దీక్షతో నిలవగలిగే సైనికులుగా తీర్చిదిద్దకలిగింది. గెరిల్లాయుద్ధ పద్ధతులలో బలవంతుడైన శత్రువును మట్టి కరిపించగలిగింది.

ఈరైతుదళానికి అప్పారావ్ పటేల్, కౌల్ ఖేడ్ అధ్యక్షుడు. సేనాపతిగా నిలచినవాడు మానిక్‌రావ్ మూలే, ఇతర ప్రముఖ దళవీరులు, చన్

వీర్ యశ్వంత్‌రావ్, దత్తగీర్, నివృత్తిరావు, భీమ్‌రావ్ సోచరులు, మురళీధర్ ఇతర ముఖ్య సహచరులు బల్‌వీర్, విఠల్, అన్వర్, దేవరాజ్, జాధవ్ మొదలైనవాళ్ళ ప్రశంసనీయమైన సాహసాన్ని నిరూపించారు.

పైముఖ్యమైన వ్యక్తులతో బాటు గూఢచారి విభాగం ఒకటి చాక చక్యంగా పనిచేస్తూ ఉండేది. అందులో కన్నయ్యలాల్ పాత్ర ముఖ్యమైనది. అతను లంబాడీలలో కలిసిపోయి లంబాడీల భాష మాట్లాడేవాడు. ఇతర త్రా వార్తలను అందించే వారిలో కూడా వుండేవాడు. గాయపడిన వారిని డాక్టర్ చెన్నప్ప చికిత్స చేసేవాడు. దేగలూర్‌లోని డాక్టర్ మోరే కూడా విరివిగా సహాయం చేసేవాడు.

ఇక ఆయుధాల విషయం మొదట్లో వడిసెల, గొడ్డలి, బరిసె, బల్లెం, కత్తి, ఛర్‌మార్, తుపాకీలను దళసభ్యులు ఉపయోగించేవారు. స్టేట్ కాంగ్రెసు సహాయం వల్ల ఆధునిక ఆయుధాలు లభించాయి. కొన్ని ఫిరంగులు కూడ ఎంతో బలాన్ని ఇచ్చాయి.

దళానికి గ్రామాలనుంచి ఆహారం సరఫరా అవుతూవుండేది, చుట్టు ప్రక్కల గ్రామాలలో ప్రజలు ప్రతి ఇంట్లో అదనంగా రొట్టెలు కూరగాయలు వండి పంపిస్తూవుండేవారు. క్రొత్త సభ్యుల ఆశ్రయం కోసం తిండి కోసం, అనుమానాస్పదమైన పరిస్థితుల్లో బాధపడవలసిన అవసరం ఉండేది కాదు అయితే అప్పుడప్పుడు రజాకార్ల భయంవల్ల గ్రామస్తులు ఆహారం పంపించలేకపోయేవారు. అప్పుడు పస్తులు తప్ప మరో మార్గం వుండేది కాదు.

దళం ఎక్కువగా అడవుల్లో కొండప్రాంతాలలో విడిదిచేస్తూవుండేది. జాతీయదృష్టితో నిజాయతీగా దళ సభ్యులు ప్రవర్తించేవారు. అవసరమైనప్పుడల్లా కృతఘ్నులైన, ద్రోహులైన, హిందువులను వదలేవారుకాదు.నని

యైన గుణపాఠం చెప్పేవారు. దయాభిక్ష పెట్టవలసి వచ్చినప్పుడు ముస్లి మైనా హిందువైనా న్యాయం లభించేది. ముస్లిం స్త్రీతో అసభ్యంగా ప్రవర్తించిన సంఘటన ఒక్కటికూడాలేదు.

కట్టుదిట్టమైన క్రమశిక్షణతో సభ్యులు నియమాలను పాటించేవారు. ఒక సభ్యుడు కూడా ద్రోహిగా కృతఘ్నుడుగా మారిన ఉదంతం లేదు. చరిత్రాత్మకమైన ఆ విముక్తి పోరాటంలో రైతు దళం మరుపురాని ధైర్య సాహసాలను, నిజాయతీని నిరూపించుకొని మాజీ హైదరాబాదు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

# 14. బాలూర్ వడిసెల వీరులు

సికింద్రాబాద్–పర్లి రైల్వేమార్గంలో వున్న కమాల్‌నగర్‌కు ఒక మైలుదూరంలో వుంది. బాలూర్ అనే గ్రామం. అనాడు ఆగ్రామం జనసంఖ్య ఐదువందలు; ఇప్పుడు యాభై లేక అరవై. దేవనీజాగీరులో ఒకభాగం. ఈనాడు కర్ణాటకలోని బీదర్‌జిల్లాలో అవరాద్ తాలూకాలో వున్న గ్రామం. రజాకార్ల రోజుల్లో ఈ గ్రామంలోని పది లేక పన్నెండుమంది యువకులు సాహసంతో కేవలం వడిసెళ్ళతో దుండగులను ఎదిరించి నిలుచున్నారు.

ముఖ్యంగా గ్యానోబా, సదాశివధగే లు వడిసెళ్ళతో ఎవరినైనా ఎదురొడ్డేవాళ్లు. ఫర్లాంగుదూరంలో లాఠీపట్టుకొని నిలుచున్న మనిషి చెయ్యిని వడిసెలతో గురిచూసి రాయితోకొట్టి లాఠీని పడవేయడం ఆ అన్నదమ్ముల ప్రత్యేకత. మరీ ముఖ్యంగా గ్యానోబాధగే వడిసెల విసరడంలో ఆరితేరిన వ్యక్తి.

గ్రామంపోలీసు పటేల్ రాచప్పకు ఆనాటి దేశ రాజకీయాలు బాగా తెలుసు. రజాకార్ల అఘాయిత్యాల గురించి వివరాలు తెలుసుకున్నాడు. తమ గ్రామాన్ని రక్షించుకోడానికి రైతుదళాలతో సంబంధాలు ఏర్పర్చుకున్నాడు. ఆయన మిత్రులు తుకారాందమ్, గ్యానోబాధగే అన్నివిధాలా గ్రామానికి అండగా వున్నారు.

వర్షాకాలంనాటి ఒకఉదయం ఎటుచూసినా పొలాలు, పంటచేలతో కనులపండువగా వున్నాయి. దేవనదీ కలకలనాదానికి పక్షుల కిలకిలారావాలు వంత వేస్తున్నాయి. రైతులు నదినీళ్ళలో పశువులను మనసారా స్నానం చేయిస్తున్నారు. లేగదూడలు గంతులు వేస్తున్నాయి. ఆ రోజు జరిగే పొలి పండుగకు పశువులను పరిశుభ్రం చేస్తున్నారు. ప్రతి సంవత్సరం పొలి రోజున తమ పశుగణాన్ని రైతులు ఇక్కడ అన్నివిధాలా అలంకరిస్తారు. అలంకరణలో పోటీపడుతున్నట్లు కనపడతారు.

ఆవులను, ఎద్దులనుకడిగి, అలంకరించి రైతులు ఆరోజున వాటిని ఆదరాభిమానాలతో అతిథులుగా సత్కరిస్తారు. బెల్లంనీరు (గులవర్నా) తాగించి వాటికి పూజచేస్తారు. ఇతర తీపిపిండివంటలు తినిపించి ఆరోజున ఎలాంటి పని చేయించరు. రైతులు తాము దాచిపెట్టుకున్న మంచిదుస్తులు ధరించి అలంకరించిన ఎద్దులతో బండ్లలో బయలుదేరుతారు. గ్రామం బయటవుండే ఆంజనేయస్వామి దేవాలయం చుట్టు ప్రదక్షిణలు జరిపి తిరిగి వస్తారు. సాయంత్రం చీకటిపడేముందు గ్రామం మొదట్లోకి చేరుకుంటారు. ప్రవేశద్వారం దగ్గర మామిడితోరణాన్ని తెంపే ఉత్సవం జరుగుతుంది. "కరీ"ని తెంపడం అనే ఉత్సవానికి వంశపారంపర్యంగా ఒకే కుటుంబం నాయకత్వం వహిస్తున్నది. పోలీస్‌పటేల్ లేదా అతని ప్రతినిధి ఆరోజున కొరడాతో ఆ మామిడితోరణాన్ని తెంచివేస్తాడు. అదే కార్యక్రమానికి ఈ రోజు ఉత్సాహంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి.

పశుపులస్నానం ముగిసిన తర్వాత రైతులు ఆంజనేయ దేవాలయానికి వచ్చారు. పశువులకు గడ్డిగాదంవేసి నీళ్ళు తాగించారు. ఇండ్లకుతీసికెళ్ళి వాటికి పూజ జరవాలనే ప్రయత్నాల్లో వున్నారు. ఆ రైతుల్లో యువకులైన ఇద్దరు అన్నదమ్ములు గ్యానోబాకదమ్ కాన్‌వలె, తుకారాంకదమ్ జాన్‌వలె, కూడా వున్నారు.

ఈ పొలిపండుగ జరుగుతున్న రోజు శుక్రవారం. నిజాం పరిపాలనలో శుక్రవారం శెలవుదినంగా వుండేది. ఆరోజు ముస్లిం నమాజు (ప్రార్థనలు) జరుపుతారు. కాబట్టి కార్యాలయాలకు వారాంతం సెలవుగా గడిచేది. గతరాత్రి అంటే గురువారం రాత్రి కమాల్‌నగర్‌లో ఇత్తేహాదుల్ ముస్లిం సంఘం బహిరంగసభ జరిపింది. రజాకార్లు పెద్దసంఖ్యలో హాజరైనారు. నిజాం ప్రభుత్వ అధికారులు స్వయంగా పాల్గొన్నారు. నాయకుడు జాఫర్ ఖాన్ పఠాన్ తన ముస్లిం సోదరులను సంబోధిస్తూ ఇలా ప్రసంగించాడు : "సోదరులారా! ఈనాటి పరిస్థితుల్లో మనమంతా మేల్కొనివుండాలి. ఆజాద్ హైద్రాబాద్ మనుగడకు సవాలుగా పరిణమించాయి కొన్నిశక్తులు.

స్వతంత్ర హైద్రాబాద్ శత్రువులు మనచుట్టూ వున్నారు. రామఘాట్ తదితర ప్రదేశాల్లో ఇటీవల జరిగిన సంఘటనలు మీకుబాగా తెలుసు. శత్రువులు తమబలాన్ని పుంజుకొని మనపై దాడి చేయాలనుకుంటున్నారు. మన పొరుగునవున్న గ్రామం బాలూర్. ఆ గ్రామంలో హిందూపోలీస్ పటేల్ రాచప్ప మనకు వ్యతిరేకంగా జరుగుతున్న కుట్రలో భాగస్థుడు. ఆగ్రామం గురించి మన సయ్యద్‌మియా ఇచ్చిన వివరాలు, మన విశ్వాసపాత్రుడైన హిందూ సోదరుడు ఇచ్చిన సమాచారం చాలా విషయాలను బయటపెడుతున్నాయి. రాచప్ప అతని మిత్రులు తుకారాంకదమ్, గ్యానోబాఢగే ఆయుధాలు సేకరించి పెట్టారు. రైతుదళాలతో సంబంధాలు ఏర్పర్చుకొని అన్ని ఏర్పాట్లు చేసుకున్నారు. మనపై తిరుగుబాటు చేయడానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు. వీళ్ళ ప్రయత్నాలు మొగ్గలోనే తుంచివేయని పక్షంలో మహాప్రమాదం ముంచుకురాబోతుంది. అందువల్ల మనం రేపు బాలూర్ గ్రామంపై పోలీసుబలగంతో దాడి జరుపుదాము. రేపు హిందూరైతులకు పొలి పండుగ. ఆ సందడిని ఆసరాగా తీసుకొని రేపే దాడిచేయడం మంచిది. రేపు సాయంత్రమే విజేతలుగా తిరిగివచ్చి అల్లాకు నమాజులుచేద్దాం. "అల్లాహో అక్బర్. షాహీ ఉస్మాన్ జిందాబాద్."

పొలిపండుగ జరుగుతున్న రోజు ఉదయం పొలాల్లోవున్నారు తుకారాం కదమ్, గ్యానోబా. అకస్మాత్తుగా రజాకార్ల దాడి జరిగింది. ఏమరుపాటునవున్న ఆ ఇద్దరు అన్నదమ్ములపై ఆయుధాలతో దాడిచేశారు. గ్యానోబా తీవ్రంగా గాయపడి కిందపడిపోయాడు. తుకారాం రెండుచేతులను రజాకార్లు భుజాల దగ్గరగా నరికివేశారు. ఎదురుగా పశువులు ఈ దాడిని చూసి పరిగెత్తడం మొదలుపెట్టాయి. పశువుకంటె హీనంగా పరిణమించారు దుండగులు. రాక్షసులను తలదన్నే చర్యలకు పాల్పడ్డారు ఆ రజాకార్లు

నరకబడిన చేతులతో రక్తం కారుతుండగా తుకారామ్ గ్రామం వైపు పరుగెత్తాడు. గ్రామస్తులకు ఈదాడి గురించి హెచ్చరిక చేయాలని వెడుతున్నాడు. ఈలోగా కమాల్‌నగర్ నుంచి వచ్చిన వందమందిపోలీసులు, రజాకార్లు గ్రామాన్ని చుట్టుముట్టి వేశారు. గాయపడిన గ్యానోబాకదమ్‌ను ఎత్తుకెళ్ళిపోయారు. పశువుకొట్టాలకు నిప్పు అంటించారు. మండుతున్న కొట్టాలలోకి గాయపడిన గ్యానోబాను విసిరివేశారు. సజీవంగావున్న వ్యక్తిని నిలువునా దహనం చేయడం! ఎంతటి విపరీతమైన ఘోరమో చెప్పడం సాధ్యంకాదు.

గ్రామంలోకి మొండి భుజాలతో వచ్చినా తుకారాంను చూసి గ్యానోబాథగే, గ్వానోబాకదమ్, తుకారాం తమ్ముడు మండిపోయారు. గ్రామస్తులు పరుగెత్తి తుకారాంకు నీళ్ళు తాగించాలని ప్రయత్నం చేస్తున్నారు. తుకారాం మూలుగుతూనే అన్నాడు, "మీరంతా వెళ్ళి గ్రామాన్ని కాపాడండి. రజాకార్లు చుట్టుముట్టారు. మన ఆడవాళ్ళ మానాలను రక్షించండి. నాకు నీళ్ళు తాగించే బదులు రజాకారు దుండుగులను ఆ నీళ్ళలోనే ముంచండి." ఈ మాటలు వినగానే థగే సోదరులు గ్యానోబా, సదాశివ్ వడిసెలు తీసుకొని గ్రామ ప్రవేశద్వార దగ్గరికి పరుగెత్తారు. అక్కడే తులసీరాంపటేల్ రెండంతస్తుల భవనం వుంది. దానిపైకి ఎక్కి



తులసీరామ్ పటేల్ భవనం

ధగేసోదరులు గురిచూసి వడిసెలు విసరడం ప్రారంభించారు. మరోవైపు రైతు దళంసహాయం కోసం రామఘాట్ కు ఒక వ్యక్తిని పంపించారు. ధగే సోదరులు వడిసెలతో రాళ్ళు విసురుతుంటే గ్రామంలోకి అడుగు పెడుతున్న రజాకార్లు రాళ్ళ దెబ్బలు తిని వెనక్కి పరుగెత్తడం మొదలు పెట్టారు.

గురుగోవింద్ సింగ్ మొగల్ కాలంలో ఒక సందర్భంలో ఇలా అన్నాడు, "పిచ్చుకలతో డేగలను తరిమి గొడ్తాను. అప్పుడే గురుగోవింద్ సింగ్ అని పిలవండి". ఈరోజు అక్కడ నిజంగానే బాలూర్‌లో పిచ్చుకలు డేగలను తిరిమిగొట్టే సాహసం చేస్తున్నాయి. అటువైపు దాదాపు రెండు వందల మంది రజాకార్లు, పోలీసులు ఆధునిక ఆయుధాలతో దాడి చేస్తున్నారు. ఇటువైపు కేవలం వడిసెళ్ళతో రాళ్ళతో ఎదుర్కొంటున్నారు బాలూర్ వాసులు. రాచప్ప పటేల్ దగ్గర ఒక భర్‌మార్ తుపాకి, కొన్ని నాటుబాంబులు వున్నాయి. ధగే సోదరులు మరి కొంతమంది, మొత్తం డజను మంది మాత్రం అంత పెద్ద సాయుధ మూకను వడిసెళ్ళ రాళ్ళతో మూడు గంటల సేపు ఎదుర్కొన్నారు. గ్యానోబాధగేను వదలి సదాశివ్‌ధగే, రాచప్ప పటేల్ భవంతి పైకి వెళ్ళి అటునుండి వడిసెల విసరడం మొదలు పెట్టాడు. రెండువైపుల నుంచి ఎదురుగా వస్తున్న దుండుగుల పైకి గురిచూసి రాళ్ళు విసురుతూనే వున్నారు. ఇతర గ్రామాల నుంచి రజాకార్ల బలగం, పోలీసులు వచ్చినా గ్రామంలోకి అడుగు పెట్టలేక పోయారు.


రాచప్పపటేల్ భవనం

సూర్యాస్తమయం జరుకుతున్న వేళ నిజాం పోలీసులు ముందుకు వచ్చి గ్యానోబాథగే ను పిలిచారు."అనవసరంగా ప్రాణాలు వదులుకుం టావు లొంగిపో" అని అన్నారు. మీరు రజాకార్లను వెనక్కి తిప్పి పంపించివేయండి. మీ ప్రభుత్వంతో నాకు పేచీ లేదు, అని గ్యానోబాథగే జవాబు ఇస్తున్నాడు. ఈ అవకాశాన్ని చూసు కొని అమాయకుడైన గ్యానోబాథగేను గురిచూసి తుపాకితో కాల్చి వేశారు. ఒకపక్క రాళ్ళ వర్షం ఆగిపోగానే నిజాం పోలీసులు, రజాకార్లు గ్రామంలోకి చొచ్చుకొని వచ్చారు. రాక్షసకాండ ప్రారంభించారు. ఎదురు పడిన ప్రతిఒక్క హిందువును బల్లాలతో పొడిచి వేయడం మొదలైంది. ఇండ్లకు నిప్పు పెడుతున్నారు, పొడిచివేయబడిన వ్యక్తులను కాలుచున్న ఇండ్లలోకి విసరి వేస్తున్నారు. పిడకలున్నచోట నిప్పు అంటించి వాటిలో తీవ్రంగా గాయపడినవాళ్ళను తోసివేస్తున్నారు. ఈ విధంగాసజీవ దహనం పొందిన గ్రామీణులు శంభాజీ కరగ్‌భోంలే, సంత్‌రాం నర్‌బావేల్‌బాడే, నారాయన్‌నాగోబా, కాక్‌నోలే, గుండప్పా శిర్‌సగే, గుణవంత్ గుండిజీ రాయఫల్, మనవాహులప్పాధన్‌గర్. ఈ వ్యక్తులలో మొదటివాడు శంభాజీ మూడు పాతికల వయోవృద్ధుడు. దారిలో చెట్టుక్రింద కూర్చున్న వాడిని చంపి అతన్ని కాలుతున్న ఇంట్లో పడేశారు. సంత్‌రాం ఇంట్లో రెండు నెలల పసిపాప కూడా దహనమైపోయింది.

ఆ తర్వాత రాచప్ప కౌల్‌ఖేడే అనే రైతును చిత్రహింసలపాలు చేశారు. రాచప్ప ఇంటిపేరు కౌల్‌ఖేడే కాబట్టి ఆతనికి రైతు విప్లవకారులతో సంబంధం వుంటుందని రజాకార్లు అనుమానించారు. రైతుదళం నాయకుడు అప్పారావుపటేల్ కౌల్‌ఖేడ్ ప్రాంతంవాడు. అందువల్ల అతనికి రాచప్పకు సంబంధం వుందనే అనుమానంపై రాచప్పను పాశవికంగా హింసించారు. కమాల్‌నగర్ చుట్టుపట్లవున్న హిందువుల్లో బీభత్సాన్ని సృష్టించాలని రజాకార్లు రాచప్పను అంత రాక్షసంగా హింసించారు. మొదటిరోజు రాచప్ప చేతిని నరికివేశారు. రెండోరోజు రెండోచేతిని నరికివేశారు. మూడోరోజు అతని ముక్కు, చెవులుకోసి, కళ్ళు పెరికివేశారు. బహిరంగంగా అతన్ని హత్య చేశారు. బాలూర్‌వాసులకు ఎవరు ఆశ్రయం ఇవ్వకూడదని, ఎవరైనా రైతుదళం వాళ్ళు కనపడితే మజ్లీస్ కార్యాలయానికి సమాచారం అందజేయాలని ఆ ప్రకటన సారాంశం.

మరోవైపు గ్యానోబాధగే ఆ భవంతిపై తీవ్రంగా గాయపడి కూలిపోయాడు. రజాకార్లు రకరకాల ప్రయత్నాలద్వారా ఆ భవంతిమీదకిఎక్కి చేరుకున్నారు. గాయపడిన గ్యానోబా నీళ్ళు అడిగితే మూత్రం పోస్తామని బూతులుతిట్టారు. ప్రభుత్వానికి విరుద్ధంగా కుట్రపన్నుతావా ? రాచప్పకు సహాయపడతావా ? అని అతన్ని క్రింద కాలుతున్న ఇంటిలోకి సజీవంగా విసిరివేశారు. విసిరివేసే ముందు అతని కాళ్ళు, చేతులను నరికివేశారు. వర్ణనాతీతమైన ఆ బాధతోకూడా గ్యానోబా మీరు మీపనిచేయండి అంటూనే ఉన్నాడు. హంతకులబలాన్ని సవాలుచేస్తూనే, అన్యాయాన్నిఎదుర్కొంటూ ప్రాణాలు కోల్పోయాడు. దూరంగా తీవ్రంగా గాయపడివున్న తుకారాం కదమ్ దుండగులను ఎదుర్కొమని గ్రామీణులను ప్రేరేపించుతూనే వున్నాడు. అతన్నికూడా రజాకార్లు పట్టుకొని సజీవంగా దహనం చేశారు. బాలూర్ గ్రామస్తులు ఈ వీరుల బలిదానాన్ని, సాహసాన్ని ఏనాటికి మరచిపోరు. భారతదేశంలోని అనేకమంది సుపుత్రుల్లో వీరు చిరకాలం చరిత్రలో నిలుస్తారు.


గంగారాం ధగే

మరోవైపు గ్యానోబా తమ్ముడు సదాశివధగే, రాచప్పపటేల్ భవంతి పైనుంచి వడిసెలతో రాళ్ళు విసరి శత్రువులను వెనక్కి తిరుముతున్నాడు. గ్యానోబా కూలిపోగానే సదాశివ్ శివమెత్తిన వాడిలా తనబలాన్ని అంతా కూడదీసుకొని రాళ్ళు విసరి కొడుతున్నాడు. రాచప్పపటేల్ ఇంట్లో అనేక మంది స్త్రీలు, పిల్లలు తలదాచుకున్నారు. గ్యానోబా భార్య ప్రసవించి అనారోగ్యంగా వుంది. చివరికి సదాశివధగే కూడా తుపాకిగుండుకు బలై పోయాడు.

రాచప్పపటేల్ స్వయంగా తుపాకిపట్టి దుండగులను ఎదుర్కొన్నాడు. రాచప్ప ఇంట్లో చాలా ఆయుధాలున్నాయనే భ్రమ కొంత ఆ ఇంట్లో తలదాచుకున్న వాళ్ళను కాపాడింది. రాచప్ప ప్రయోగించిన రెండు మూడు చేతిబాంబులు పనిచేశాయి. అయితే ఏడు లేక ఎనిమిదిమంది తప్ప మిగతా వాళ్ళు ఆయుధాలుపట్టి ఎదుర్కోలేకపోయారు. శత్రువుతో ధైర్యంగా తలపడిన వ్యక్తులు: గంగారామ్‌ధగే, నివృత్తిరామ్‌కదమ్, జాన్‌వల్, శ్రీపతి గణపతిధగే మొ॥నవాళ్ళు. వీళ్ళు అందుబాటులో వున్న ఆయుధాలతో రాచప్ప ఇంటిని కాపాడారు. ఆశ్రయం పొందినవాళ్ళకు రక్షణ ఇవ్వగలిగారు. చీకటి పడ్డదేగాని ఆ ఇంటిని స్వాధీనం చేసుకోలేకపోయారు. రైతుదళం వచ్చి దాడి చేస్తుందనే భయంకొద్దీ రజాకార్లజట్టు వెనక్కిమళ్ళి వెళ్ళిపోయింది. కమాల్‌నగర్‌కు ఆరోజు రాత్రి విజయంపొంది నమాజు చేస్తామన్న మాట నిలువుకోలేకపోయారు పాపం.



నివృత్తిరామ్ కడమ్

రజాకార్ దుండగులు కమాల్ నగర్‌కు వెళ్ళిపోగానే రాచప్ప పటేల్‌తో సహా అందరు బయటికి రాగలిగారు. సదాశివధగేకు దహన సంస్కారాలు జరిపారు. తుపాకి గుండు తగిలి గాయపడిన గంగారాం ధగేను వెంటబెట్టుకున్నారు. భయంకరంగా కాలి నాశనమై పోయిన బాలూర్‌నుంచి మిగిలిన వాళ్ళు అడవులదారి పట్టారు.

ఊరు కాలి, బంధువులను కోల్పోయి, రోజంతా పోరాడిన గ్రామవాసులు హృదయవిదారకమైన వాతావరణంలో అడవుల్లోతలదాచుకున్నారు. బాలూర్‌లో కాలుతున్న ఇండ్లలో లేగదూడలు అరుస్తూ చనిపోయాయి. వృద్ధస్త్రీ యశోద ప్రాణాన్ని లెక్కచేయకుండా కాలుతున్న ఇంట్లో జొరబడి రెండు లేగదూడలను కాపాడుకుంది. పుత్రశోకం నుంచి ఉపశమనం పొందింది.

పొలిపండుగ ఆనందోత్సాహాలు ఈరోజు కుమిలి కుమిలి ఏడుస్తున్న రోజుగా మారిపోయింది. ఆక్రందనల మధ్య, భీషణమైన, కరుణపూరితమైన గ్రామంగా మారిపోయింది. బాలూర్ ఈనాటికీ ప్రతి పొలిపండుగ రోజు బాలూర్ గ్రామవాసులు ఆనాటి 1948 సంఘటనలను తలచుకొని కంటతడి పెట్టుకుంటారు.